# రాచకొండ విశ్వనాథశాస్త్రి

కె.కె.రంగనాథాచార్యులు



భారతీయ
సాహిత్య
నిర్మాతలు

అట్టలోపలివైపున అచ్చు వేసిన శిల్పంలో కనబడది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్యచేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకుంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారతదేశంలో లేఖన కళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనమైనది.

నాగార్జున కొండ క్రీ.శ. 2వ శతాబ్దం.

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీవారి సౌజన్యంతో)

భారతీయ సాహిత్య నిర్మాతలు

# రాచకొండ విశ్వనాథశాస్త్రి

కె.కె. రంగనాథాచార్యులు



సాహిత్య అకాడెమీ

*Rachakonda Viswanatha Sastry* : A monograph in Telugu
by K.K Ranganadhacharyulu, Sahitya Akademi, 2000, Rs 25



First Published : 2000

ISBN . 81 - 260 - 0939 - X

**సాహిత్య అకాడెమీ**

రవీంద్ర భవన్, 35, ఫెరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ - 110001

విక్రయ విభాగము .
'స్వాతి' మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110001

జీవన్ తార భవనము, 4వ అంతస్తు, 23A/44X
డైమండ్ హార్బర్ రోడ్, కలకత్తా - 700053

172, ముంబయి మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్,
దాదర్, ముంబాయి - 400014

గుణా బిల్డింగ్, 304-305, అణ్ణాసాలై,
తేనాంపేట, చెన్నై - 600018

సెంట్రల్ కాలేజ్ క్యాంపస్,
డా. బి ఆర్ అంబేద్కర్ వీధి, బెంగళూరు - 560 001

వెల : రూ. 25

Laser Typesetting at : Oriental Type writing Institute, Hyderabad
Printed at : Sathyasri Printers Pvt. Ltd., Bangalore - 18

రావిశాస్త్రిని గురించి రాయడానికి అవకాశం
ఇచ్చిన కేంద్ర సాహిత్య అకాడెమీకి,
రావిశాస్త్రి గురించిన మౌలిక సమాచారం
అందించిన పత్రికలలోని, ప్రత్యేక సంచికలలోని
వ్యాసకర్తలకు, వాటి సంపాదకులకు, ఆకరాలుగా
ఉపయోగించిన గ్రంథ రచయితలకు,
మొదటి సాఫు ప్రతి రాసిన పి.మల్లికార్జున్‌కి,
సహకరించిన తదితర మిత్రులకు

నా కృతజ్ఞతలు.

కె.కె.రంగనాథాచార్యులు

# అనుక్రమణిక

# 1. నేపథ్యం

"పుష్కలమైన అనంతమైన సంఘటనలతో నిండి ఉన్న ఎంతో గాంభీర్యము, వైవిధ్యముగల నేటి జీవితాన్ని వీక్షించక, రచయితలు ప్రసిద్ధికెక్కిన ప్రాచీన కాల్పనిక కథల నుండి ఇతివృత్తాలను ఎందుకు స్వీకరిస్తారో అర్థంకాక నాకు ఆశ్చర్యం వేసింది. ఈ కారణాల వల్ల నేను వాస్తవ జీవితం నుంచి సమకాలిక ఇతివృత్తాన్ని స్వీకరించి దానిని తెలుగు వాడుక భాషలో నాటకంగా రూపొందించాను"

– గురజాడ అప్పారావు

ఆధునికాంధ్ర సాహిత్యంలో ఆలోచనలలో, వివిధసాహిత్యప్రక్రియలలో మార్గదర్శకులనదగ్గ రచయితలు చాలా మంది ఉత్తరాంధ్రకు సంబంధించిన వారు. గురజాడ అప్పారావు, శ్రీశ్రీ, చాగంటి సోమయాజులు, ఆరుద్ర, రాచకొండ విశ్వనాథశాస్త్రి, కాళీపట్నం రామారావు మొదలైన ప్రఖ్యాత రచయితలు ఈ ప్రాంతం నుంచి వచ్చినవారే. కవిత్వంలో వస్తు రూపాలు రెండింటిలోను విప్లవాత్మకమైన మార్పు తీసుకొని వచ్చినవారు గురజాడ, శ్రీశ్రీ. నిజమైన తొలి ఆధునిక నాటకాన్ని తెలుగువాళ్లకి అందించినవాడు గురజాడ. ఆధునిక తెలుగు కథానికకూ ఆయనే ఒరవడి దిద్దాడు. సమాజానికి, మనిషికి సంబంధించి మౌలికమైన ఆలోచనలు చేసినవాడు, సాహిత్యాన్ని జీవితానికి సన్నిహితం

చేసినవాడూ గురజాడే. ఆయన మానవ స్వభావాలను సునిశితంగా పరిశీలించాడు. వ్యక్తుల స్వరూప స్వభావాలను లోతుగా పరిశీలించి, సూక్ష్మాతి సూక్ష్మంగా చిత్రించడం గురజాడతోనే ప్రారంభం అయింది. దానికి అనుగుణంగా సాహిత్య భాషనూ జీవితానికి దగ్గరగా తీసుకొని వచ్చాడు గురజాడ.

కవితారంగంలో గురజాడ వేసిన బాటను మరింత వెడల్పు చేశానన్నాడు శ్రీశ్రీ. వచనరచనలో గురజాడకు వారసులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, రాచకొండ విశ్వనాథశాస్త్రి. తాను ఎరిగిన జీవితాన్ని వస్తువుగా తీసుకున్న శ్రీపాద కథనంలో, భాషలో చిత్రిస్తున్న జీవితానికి దగ్గరగా ఉండే మార్గాన్ని అవలంబించాడు. తాను చూసిన జీవితంతో మమేకమై వస్తువును స్వీకరించిన రాచకొండ విశ్వనాథశాస్త్రి ఆ జీవితానికి సంబంధించిన భాషను వాడడంతోపాటు, కథనానికి కవిత్వశిల్పాన్ని జతచేర్చాడు. గురజాడ పాత్రలు, చిత్రించిన సన్నివేశాలు తనచుట్టూ ఉన్న జీవితానికి, అర్థం చేసుకున్న జీవితానికి సంబంధించినవి. అవి అతనికుండే ప్రాపంచిక దృక్పథం వల్ల సాధారణీకరణం చెందాయి. పాత్రలను, సంఘటనలను సవిమర్శకంగా చిత్రించడంలో గురజాడకుగల సాధారణ దృక్పథం స్పష్టపడుతుంది. శ్రీశ్రీతో సమాజంలో అణచివేతకు గురైన మానవ సమాజం సాహిత్యంలో ప్రవేశించింది. పతితులు, భ్రష్టులు, బాధాసర్పదష్టులు, ఉన్మాదులు, పడుపుగత్తెలు, భిక్షువర్షీయసులు, నిరపరాధులై చెరసాలల్లో చిక్కేవాళ్ళు శ్రీశ్రీ కవిత్వంతో సాహిత్య లోకంలో ప్రవేశించారు. సాహిత్యాన్ని శ్రామిక ప్రపంచంవైపు నడిపినవాడు శ్రీశ్రీ. సమాజపు విభజనరేఖ కింద ఉన్నవారి స్థూల విభాగాన్ని సాహిత్యంలో ఆయన ప్రవేశపెట్టాడు. తదనంతర సాహిత్యానికి విషయ సూచికను అందించాడు.

శ్రీశ్రీ ప్రవేశపెట్టిన విభజనరేఖకింది స్థూల మానవ విభాగంలోని వైవిధ్యాన్ని గుర్తించి సూక్ష్మాతిసూక్ష్మ విభాగాలవైపు సాహిత్యాన్ని నడిపినవాడు రాచకొండ విశ్వనాథశాస్త్రి (ఇక ముందు రావిశాస్త్రి). సమకాలీన సమాజపు చీకటి కోణంలో పడి నలుగుతూ అంతవరకు గుర్తింపుకు రానివారి జీవితాలను రావిశాస్త్రి వస్తువుగా గ్రహించాడు. ఆర్థిక, రాజకీయ, సామాజిక వ్యవస్థ కారణంగా తమ జీవితం అలా ఎందుకు ఉందో తెలుసుకోవడానికి, ఆలోచించడానికి కూడా అవకాశమూ, ఎరుకా లేక అదే తమ బతుకని యాంత్రికంగా పరిస్థితులకు అధీనంగా జీవనం గడిపే అట్టడుగు బడుగు జనం రావిశాస్త్రి రచనల్లో కనిపిస్తారు. మధ్యతరగతి కుహనాస్వభావం, ఆత్మవంచన, స్వైరవిహారుల్లు, భూకామందులు, దళారీలు, సారాకాంట్రాక్టర్లు,అవినీతితో,అన్యాయంతో,అధర్మంతో రాజకీయ పదవీ సోపానాలధిరోహించేవాళ్లు అసలు నేరగాళ్లుగా రావిశాస్త్రి రచనలలో ఉంటారు. వీళ్లు ఆడే, ఆడించే చదరంగంలో మంచి-చెడులు, సుఖ-దుఃఖాలు,

ఆనంద-విషాదాలు మొదలైన ద్వంద్వాలలోని తేడాలేమిటో కూడా తెలియక బతికే అలగాజనం. వలసపాలనలో ప్రవేశించిన కోర్టులు,చట్టాలు,సాక్ష్యాలు, ప్లీడర్లు, పోలీసులు, నిత్యజీవితంలో వాటిప్రభావాలు మొదలైనవాటి చిత్రణ గురజాడ రచనల్లోనే కనిపిస్తుంది. రావిశాస్త్రి రచనల్లో ప్రత్యక్ష వలసపాలన తరువాత కూడా కొనసాగుతున్న వీటి సంక్లిష్టరూపం మరింత స్పష్టంగా దర్శనం ఇస్తుంది. న్యాయవాదిగా రావిశాస్త్రి అనుభవాలు రాజ్యాంగ స్వభావాన్ని అర్థం చేసుకోవడానికి దోహదం చేశాయి. సాహిత్యంలోనేకాదు నిత్య జీవితంలో, వృత్తి జీవితంలో కూడా అలగాజనం పక్షానే నిలుచున్నవాడు రావిశాస్త్రి.

రావిశాస్త్రి బడుగు వర్గాలవారి జీవితాన్ని కేవలం స్థూలదృష్టితో మాత్రమే వర్ణించలేదు. వాళ్లు అలాకావడానికి కారణమైన సంకీర్ణ, సంక్లిష్ట వ్యవస్థ స్వరూపం కూడా పాఠకులకు అర్థమయ్యేట్టు వర్ణించాడు. రాచకొండ చూచిన, చూపించిన జీవితాన్ని అంతకుముందు ఏ రచయితా చూడలేదు, చూపించలేదు. సమాజంలోని వికృతరూపాలు, కుట్రలు, వింత తత్త్వాలు మొదలైన వాటి నైజాన్ని తన సాహిత్యం ద్వారా బయటపెట్టినవాడు రావిశాస్త్రి. రావిశాస్త్రి చిత్రించిన జీవితం మనల్ని ఒకవైపు నవ్విస్తూనే, మరోవైపు జాలి, కోపం కలిగిస్తుంది.

వస్తువులోనే కాదు శిల్పంలోను కొత్త పుంతలు తొక్కినవాడు రావిశాస్త్రి. వచనాన్ని కవిత్వంగా, కథను కావ్యంగా మలచడం ఆయనకే చేతనవును. శ్రీశ్రీ తెలుగు కవిత్వాన్ని మరో మలుపు తిప్పితే, రావిశాస్త్రి తెలుగు కథను పెద్దమలుపు తిప్పాడు. ఆధునికసాహిత్యప్రక్రియలలో తెలుగుకథకు అంతర్జాతీయ ప్రమాణాలు సాధించిన ఇద్దరు, ముగ్గురిలో రావిశాస్త్రి ఒకడు. ఆయన కథల్లోని నగిషీని, శిల్పాన్ని అనుకరించాలని ప్రయత్నించిన వాళ్లు చాలా మంది ఉన్నారు. కథ, సంవిధానం, పాత్ర చిత్రణ అన్నిటిలోను రావిశాస్త్రిది విశిష్టమైన మార్గం. వాక్యాన్ని ఎన్ని రకాలుగా ఆటలాడించవచ్చునో అన్ని రకాలుగా ఆటలాడించి చెప్పదలచిన విషయాన్ని పాఠకుడి మనసులో ముద్ర వేసేట్టు చేయడం రావిశాస్త్రి ప్రత్యేకత. రావిశాస్త్రికి శిల్పంపైన, అలంకారాలపైన ఉండే మోజు మోతాదును మించిందని విమర్శకులు చెప్పే మాటలలో కొంతవరకు నిజం లేకపోలేదు. కాని ఆయన కథాకథనంలో, శిల్పంలో ప్రవేశపెట్టిన నవ్యరీతులు, ఉపయోగించిన ఉపమానాలలోని వైవిధ్యం, విస్తృతి, మానవ జీవితంలోని సంక్లిష్టతని, గాఢతని, లోతులను, వాస్తవాలను మరింత స్పష్టం చేయడానికే ఉపకరించాయన్న విషయాన్ని విమర్శకులు ఒప్పుకోక తీరదు. ఆయన చిత్రించిన జీవితంతో తాదాత్మ్యం చెందడానికే అవి దోహదం చేశాయి. చాలా మంది రావిశాస్త్రిని చదివినవారికి ఇతరుల రచనలు ఆనని పరిస్థితి ఏర్పడటానికి ఆయన రచనా శిల్పమే కారణం. ఇది ఆయన రచనల బలమూ, బలహీనత కూడా. ప్రఖ్యాత

విమర్శకుడు రాచమల్లు రామచంద్రారెడ్డి చెప్పినట్టు సినిమా నటులకులాగా రచయితలకు కూడా అభిమానసంఘాలంటూ ఏర్పడితే రావిశాస్త్రి అభిమాన సంఘానిదే ప్రథమస్థానం అవుతుంది. అభిమానసంఘమంటూ ప్రత్యేకంగా ఏర్పడకపోవచ్చు కాని ఆయన రచనా రీతికి సమ్మోగ్ధులైన అభిమానుల సంఖ్య ఎక్కువే. రచయితగా రావిశాస్త్రి విషయంలో వీరారాధన వంటిది ఉన్నదని అంటే ఆశ్చర్యపోవలసిన అవసరం లేదు. రావిశాస్త్రి ఆలోచనలతో మౌలికంగా ఏకీభవించనివాళ్లు కూడా ఆయనను సొంతం చేసుకోవాలని ప్రయత్నించడానికి కారణం రచనా శిల్పంలోని సమ్మోహన శక్తే.

రావిశాస్త్రిని గురించి మేధావి, రచయిత అయిన కొడవటిగంటి కుటుంబరావు ఇలా అంటాడు. "రావిశాస్త్రి ఈ దేశపు, ఈ కాలపు మేధావి వర్గంచేత బ్రహ్మరథం పట్టించుకోగల రచయిత. ఆయన కథలు చదివినాక చదవక ముందున్న స్థితిలోనే ఉండగలవాడు పరమ జడుడై ఉండాలి. ఆయనలో ప్రచార గుణం ఉన్నది. పాఠకుణ్ణి కాలరు పట్టుకుని నిలదీసే లక్షణం ఉన్నది. శిల్పవైవిధ్యం ఉన్నది. నూతన ప్రయోగాలు చేసే సమర్థత ఉన్నది....."

తెలుగు కథాలోకంలో తాను చేసిన పనిని గురించి రావిశాస్త్రి ఇలా చెప్పుకున్నాడు. "నన్నేదో గొప్పచేస్తూ మీరు మాట్లాడటం, రాయటం చేస్తారుగాని, నేను పెద్దగా చేసిందేం లేదు. ఇంట్లోపడి కొట్టుకుంటున్న కథని బయటకు తీసుకొచ్చేననుకొంటున్నాను. సెక్స్‌లోను, సంసారంలోను పడి కొట్టుకుంటున్న కథకి కొత్త ఒరవడి పెట్టేనని నమ్ముతున్నాను".

# 2. రావిశాస్త్రి జీవితం

"ఇంట్లో విశ్వం - సాహిత్య లోకంలో రావిశాస్త్రి - ఊళ్లో శాస్త్రిగారు - బార్లో ఆర్వీయస్ - క్లయింట్లకి శాస్త్రి లేక చాత్రి బాబు......" అసలు రాచకొండ విశ్వనాథశాస్త్రి 1922 జులై 30నాడు జన్మించాడు. ఆయన పుట్టిన సంవత్సరం దుందుభి నామ సంవత్సరం. సరిగ్గా అంతకు అరవయ్యేళ్లకు ముందు తొలి తెలుగుకథానికాకారుడు గురజాడ పుట్టాడు. సొంతఊరు అనకాపల్లి దగ్గర తుమ్మపాల. రావిశాస్త్రి మాటలలో, రాతలలో తుంపాల. పుట్టింది శ్రీకాకుళంలో ఒకప్పటి కోతీవారి వీధి, ఇప్పటి కృష్ణాపార్కు వీధిలో ఉన్న మాతామహులు తెన్నేటివారి ఇంట్లో. పెరిగింది సొంతఊర్లో. ఎదిగిందీ, చివరిదాకా బతికిందీ విశాఖపట్టణంలో. తల్లి సీతామహాలక్ష్మి, తండ్రి నారాయణమూర్తి. అన్న మహాదేవశాస్త్రి, తమ్ముళ్లు నరసింహశర్మ, సుబ్బారావు, సోదరి నిర్మల.

రావిశాస్త్రి ఇంటి పేరైన రాచకొండ తెలంగాణా ప్రాంతంలోని నల్లగొండ జిల్లాలో ఒక ఊరు. కోస్తాంధ్రలోని బ్రాహ్మణ శాఖలలో తెలగాణ్యులు, వెలనాటివారిలో కొందరు కొన్ని వందల సంవత్సరాల క్రితం తెలంగాణా ప్రాంతం నుంచి వలస వెళ్లారు. వాళ్ల ఇళ్లపేర్లు సాధారణంగా వాళ్లు వదలివచ్చిన ఊళ్లపేర్లు అయి ఉంటాయి. రావిశాస్త్రి వంశీయులు కూడా మూడు వందల సంవత్సరాల క్రితం అలా వలస వెళ్లినవాళ్లే. ఈ అభిమానంతోనే రావిశాస్త్రి 1983లో ఒకసారి రాచకొండ వెళ్లి చూసి వచ్చాడు.

రావిశాస్త్రి కుటుంబం పెద్దగా ఉన్న కుటుంబమేమీ కాదు. తండ్రి నారాయణమూర్తి లాయరు వృత్తిలో ఇమడలేక మానేసి 1932లోనే తుమ్మపాలలో వ్యవసాయం పెట్టాడు. జీవితం కష్టంగానే సాగేది. చిన్నప్పుడు సైకిలు కొనివ్వమని తల్లితో మారాం చేయడం, 'మనం బీదవాళ్లం, సైకిలు కొనలేం'.. అంటూ కొట్టడం రావిశాస్త్రికి చివరిదాక జ్ఞాపకం ఉంది. డబ్బు ఖర్చవుతుందని ఒకప్పుడు చదువు మానుకుందామని కూడా రావిశాస్త్రి అనుకున్నాడట. నిక్కరో చొక్కాయో లేక కొన్నిసార్లు, రెన్ అండ్ మార్టిన్ గ్రామర్ లేక కొన్నిసార్లు క్లాసులకి వెళ్లడం మానుకొన్న రోజులు కూడా ఉన్నాయి.

సాధారణమైన చదువు విషయంలో రావిశాస్త్రి అభిప్రాయాలు ఎలా ఉన్నా చదివే అలవాటు ఆయనకి చిన్నప్పటి నుంచీ ఉంది. తల్లి పిల్లలకి పుస్తకాలు చదివే అలవాటు పెంచింది. తుమ్మపాలలో ఉన్నప్పుడే అనకాపల్లి శారదా గ్రంథాలయంలో సభ్యుడుగా చేరి క్రమం వదలక పుస్తకాలు చదివేవాడు. పన్నెండు, పదమూడేళ్లకే చాలా ఇంగ్లీషు నవలలు చదివాడని ఆయన రాసుకున్న డైరీలవల్ల తెలుస్తుంది. చదివే అలవాటు రావిశాస్త్రికి రాయాలనే ఉత్కంఠను పెంచింది. తండ్రి పళ్లతోపాటు చిత్రగుప్త, వినోదిని మొదలైన పత్రికలను కూడా తెచ్చేవాడు.

చిన్నప్పటి నుంచి రావిశాస్త్రి పెంకిఘటం. చెల్లెల్ని కొడుతుండేవాడు. అమ్మని బెదిరించేవాడు. ఒక రోజు ఇంట్లో వాళ్లమీద కోపంతో తన రక్తంతో బొట్టు పెట్టుకున్నాడట. సూటూ బూటూ వేసుకొనే కుర్రాళ్ళని చూచి కావాలని పంచె, లాల్చీ, గాంధీ టోపీ ఎందుకు వేసుకోకూడదని వేసుకొని తిరిగాడట. చిన్నప్పుడు తనకు తాను గాంధీయిస్టునమకొనేవాడట. రాట్నం వడికాడు. ఒకటి రెండుసార్లు ఖాదీ బట్టలు కొన్నాడు. చిన్నప్పుడు సరస్వతీ పూజ చేసేవాడు. విరాటపర్వం మీద ఒత్తు పెట్టుకొని రాస్తే కథలు బాగా రాయవచ్చని నమ్మేవాడు. రావిశాస్త్రికి పెంకితనంతోపాట బిడియమూ ఎక్కువే. వయసు వచ్చిన తరువాత ఆయనలో ఈ బిడియమే ఎక్కువగా కొనసాగింది.

రావిశాస్త్రి బాల్యానంతరజీవితం విశాఖపట్టణంతోనే ముడివేసుకొని ఉంది. "విశాఖ సముద్రం ఆయన ఊపిరి". చివరిదాకా విశాఖ వదలిరాలేదు. చివరి దశలో అనారోగ్యంగా వుండి చాలా మంది చికిత్స కోసం రమ్మన్నా హైదరాబాద్ వెళ్లలేదు. అవకాశాలు వచ్చినా, పిలిచినా అమెరికా వెళ్లలేదు. అమెరికా అంటే తనకు ఎలర్జీ అని ఆయనే చెప్పుకున్నాడు. రావిశాస్త్రి రచనా ప్రపంచం అంతా విశాఖ పరిసరాలే. స్థానీయత అన్న లక్షణం ఒక స్థాయిలో ఆయన రచనలకు బాగా అతుకుతుంది. వస్తువు స్థానికం అయినా, దోపిడి, అణచివేతల రూపాలు వేరైనా, జీవన విధానాలు వేరైనా సారాంశ రూపంలో

ఆయన రచనలు విశ్వజనీనం.

రావిశాస్త్రి మొదటి భార్య లక్ష్మి సోదెమ్మ, రెండవ భార్య రామం. ఆయనకు నలుగురు కొడుకులు. ఇద్దరు కూతుళ్లు. 10.11.1993 నాడు రావిశాస్త్రి మరణించాడు.

చదువు

విద్యార్థిగా రాచకొండ మామూలు విద్యార్థే. దానికి కారణం ఆయన తెలివిలేనివాడు కావడం కాదు. సాధారణ గ్రంథాలు, రచనలు చదవడం తప్ప నియత విద్యాపద్ధతుల మీద ఆయనకు అంతగా శ్రద్ధా, నమ్మకమూ లేదు. ఇప్పటి ఏడవ తరగతికి సమానమైన అప్పటి సెకండ్ ఫారమ్‌లో ఒకసారి తప్పాడు కూడా. జీవితమే పెద్ద బాలశిక్ష అని, చదివిన పుస్తకాలు బాలశిక్షలని అంటాడు రావిశాస్త్రి. చిన్నప్పుడే అమ్మ చదవడం అలవాటు చేసింది. అక్కడే మొదలయింది ఆయన నిజమైన చదువు.

సొంత ఊళ్లోనే మొదలైంది చదువు. హైస్కూలు చదువు విశాఖపట్టణంలో మిసెస్ ఏ.వి.ఎన్ కాలేజీలో. అబ్బూరివరదరాజేశ్వరరావు, నన్నాల రంగనాథరావు ఆయన స్కూల్‌మేట్స్. అబ్బూరి వరద రాజేశ్వరరావును గురువుగా ఆదరించాడు రావిశాస్త్రి. తన తోటి విద్యార్థులందరూ పేరుపేరునా ఆయనకు జ్ఞాపకం. మిత్రులన్నా, సహాధ్యాయులన్నా రావిశాస్త్రికంత అభిమానం. మిత్రుల నుంచి నేర్చుకున్నది చాలా ఉన్నదని అంటాడాయన. ఉపాధ్యాయులు కొట్టినా, తిట్టినా విద్యార్థులను అభిమానించడాన్ని కూడా ఆయన జ్ఞాపకం చేసేవాడు. సాహిత్యం, మానవీయశాస్త్రాలమీదదృష్టిగల చాలామందికిలాగే శాస్త్రికి గణిత శాస్త్రంవంటి విషయాలు వంటబట్టేవికాదు. మిసెస్ ఏ.వి.ఎన్‌కాలేజీలోనే ఇంటర్ మీడియెట్ కూడా చదివాడు రావిశాస్త్రి. చరిత్ర ఆయన ప్రత్యేక అధ్యయనాంశం.

ఇంటర్ తరువాత ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఫిలాసఫీ ఆనర్స్‌లో చేరాడు. ఆ రోజుల్లోనే అక్కడి వాతావరణం ఆయనకు అంతగా నచ్చలేదు. ఏ.వి.ఎన్ కాలేజీలో చదువు అమ్మదగ్గర చదువు నేర్చుకున్నట్టు ఉంటే, విశ్వవిద్యాలయంలో చదువు స్వాములవారి దగ్గర సంస్కృతం నేర్చుకున్నట్టు ఉండేదట. అయితే విశ్వవిద్యాలయ గ్రంథాలయం ప్రభావం ఆయన మీద చాలా ఉంది. లైబ్రరీ తెలియని లోకాలని చూపించిందనీ, కొత్త భావాలను తెలియజేసిందనీ, మంచి సరదాలను పెంచిందనీ అంటాడు రావిశాస్త్రి. గ్రంథాలయం రావిశాస్త్రిని ఎంతగానో మార్చింది. ఆనర్స్ పూర్తిచేసిన మూడు నాలుగు సంవత్సరాల తరువాత 1946-48 మధ్య మద్రాసు లా కాలేజీలో చేరాడు. తాను లా కాలేజీలో లా అట్టే చదవలేదని అక్కడ లోకం గురించి

మాత్రమే ఎక్కువగా తెలుసుకున్నానని అంటాడు రావిశాస్త్రి. ఆ కాలేజీలో చదివేవారు ఎక్కువగా మధ్యతరగతికుటుంబాలవారని, మధ్యతరగతి స్వార్థపరత్వం, దానివల్ల అనర్థాలు అక్కడే అర్థమయ్యాయని కూడా అంటాడు. లా కాలేజీలో ఒకప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, కేంద్రమంత్రి, భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షుడు దామోదరం సంజీవయ్య ఆయన రూమ్‌మేట్, సహాధ్యాయి. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా, కేంద్రమంత్రిగా పనిచేసిన కోట్ల విజయభాస్కరరెడ్డి ఆయన కాలేజీమేట్. ఒకప్పటి ఆంధ్రప్రదేశ్ మంత్రి, పార్లమెంట్ సభ్యుడు ఇ.అయ్యపురెడ్డి ఆయన సహాధ్యాయి, మంచి మిత్రుడు. ఈ విషయాలను ప్రస్తావించడానికి కారణం తనకున్న పరిచయాలను తన ప్రయోజనాల కోసం రావిశాస్త్రి ఎప్పుడూ వాడుకోలేదని చెప్పడానికే.

విద్యార్థి జీవితంలో వక్తృత్వపోటీలలో, పాటల పోటీలలో, ఆటల పోటీలలో చాలా హుషారుగా పాల్గొనేవాడు రావిశాస్త్రి. ఇంటర్‌లో హిస్టరీలో మూడు ప్రశ్నలకి మాత్రమే సమాధానం రాసి, సమయం మధ్యనే బయటికి వెళ్లిపోయాడు. ఈ విషయాన్ని ఒక మిత్రుడు ప్రశ్నిస్తే పాసుకావడానికి ఆమాత్రం చాలు అన్నాడట. నియతవిద్యని రావిశాస్త్రి చాలా మామూలుగా తీసుకున్న విషయాన్ని ఇది తెలియజేస్తుంది.

## వృత్తి

బి.ఎ ఆనర్స్ పూర్తయిన తరువాత మిలిటరీ అకౌంట్స్ డిపార్ట్‌మెంట్‌లో కొంతకాలం గుమాస్తాగా పనిచేశాడు రావిశాస్త్రి. 1948లో మద్రాసులో లా పూర్తిచేసిన తరువాత విశాఖలో తాతా శ్రీరామమూర్తి దగ్గర ఒక సంవత్సరం ఎప్రెంటిస్‌గా చేశాడు. తరువాత ఆయన దగ్గరే తొమ్మిది సంవత్సరాలు జూనియర్‌గా చేసి సొంత ప్రాక్టీసు ప్రారంభించాడు. రావిశాస్త్రి కుటుంబంలో చాలామంది న్యాయవాదులు. శాస్త్రి తండ్రి నారాయణమూర్తి మేనమామ సర్ బయ్యా నృసింహేశ్వరశర్మ విశాఖలో , మద్రాసులో ప్రాక్టీసు చేసి పేరు పొందాడు. అప్పటి గవర్నర్ జనరల్ ఎగ్జిక్యూటివ్ మెంబర్‌గాకూడా ఉండేవాడు. శాస్త్రి పెద్దనాన్న నరసింహం కూడా విశాఖ, మద్రాసులలో ప్రాక్టీసు చేశాడు. తండ్రి నారాయణమూర్తి కొంతకాలం ప్రాక్టీసు చేసి వదిలేశాడు. శాస్త్రి మాతామహుడు తెన్నేటి విశ్వనాథశాస్త్రి శ్రీకాకుళంలో ప్రసిద్ధి పొందిన న్యాయవాది. మేనమామ శంకరనారాయణమూర్తి విశాఖలో ప్రాక్టీసు చేశాడు.

న్యాయవాద వృత్తిమీద రావిశాస్త్రికి అంతగా ఆసక్తి ఉండేదికాదు. చాలాకాలం మనసుపెట్టి వృత్తి చేయలేదు. సీనియర్ తాతా శ్రీరామమూర్తి ప్రోత్సాహంతో కొంత ప్రయత్నం చేశాడు. కాలక్రమంలో పుంజుకున్నాడు. తాతా

శ్రీరామమూర్తి రావిశాస్త్రిని వృత్తి న్యాయవాదికాదని, ప్రవృత్తి న్యాయవాది అని అంటాడు. శాస్త్రికి సివిల్ కేసులంటే చిరాకుగా ఉండేవి. క్రిమినల్ లాయర్‌గానే ఆయన కొనసాగాడు. అందులోను సామాన్యుల లాయర్‌గా పేరు పొందాడు. అందువల్లే తన క్లైయింట్స్‌కి అన్యాయం జరిగిపోతుందేమో అన్న తపనతో పనిచేసేవాడు. శాస్త్రిది సున్నితమైన మనస్తత్వం. ఒక్కొక్కప్పుడు తనకు తాను కుంగిపోతుండే వాడు. న్యాయ వ్యవస్థలోని పరిస్థితులను గమనించిన అతనికి తన వృత్తి విషయంలో ఎక్కువగా మమకారం ఉండేదికాదు.

మొదటి నుంచీ రావిశాస్త్రి పేదోళ్ల లాయర్‌గా పేరు పొందాడు. వృత్తిలోను, జీవితంలోను, రచనా ప్రపంచంలోను కూడా ఆయన అట్టడుగు వర్గాల పక్షాన్నే వకాల్తా పుచ్చుకున్నాడు. ఆర్తులైన జనానికి ఆర్తత్రాణ పరాయణుడని ఆయన సీనియర్ అంటాడు. సామాన్య జనానికి ఆయన 'చాత్రిబాబు'. ఒక సామాన్యుడికి బెయిల్ ఇప్పించగలిగితే ఎంతగానో సంబరపడి పోయేవాడు. ఫీజు తీసుకోవలసి వచ్చినప్పుడు తప్పు చేసినట్టు బాధపడేవాడు. చాలాసార్లు ఆయనకు ఇచ్చే ఫీజు అరటిపండ్లు, సిగరెట్ పెట్టె, చేపలు, రొయ్యలు. కింది తరగతి వారి నేరాలకు పై తరగతివారే బాధ్యులని నమ్మేవాడు రావిశాస్త్రి. నేరస్థులని వ్యవస్థ సృష్టించిందని భావించేవాడు. ఆయన రచనలలోలాగే ప్లెయింట్స్, పిటీషన్లలో కూడా ఆయన శైలి అనుకరించాలనిపించి కూడా అనుకరించలేనిదిగా ఉండేదట. అప్పుడప్పుడు ఆయన సీనియర్ శైలీ పాటవాన్ని కాస్త తగ్గించమని సలహా ఇస్తుండేవాడట.

కోర్టులు, కేసులు, సాక్ష్యాలు, మాయ లాయర్లు, న్యాయాధికార్లు తదితర యంత్రాంగంపైన రావిశాస్త్రికి అంతగా ఇష్టం ఉండేదికాదు. అది ఆయన వృత్తిలో అనుభవం వల్ల ఏర్పడ్డభావం. శిక్షలు, బెయిళ్లు, కేసులు కొట్టివేయడాలు ఆయన్ని చాలా చికాకు పరుస్తుండేవి. న్యాయవాదిగా ఆయన అనుభవాలు సాహిత్య రచనలో వస్తువులు కాగలిగాయి. ఆయన అధికాధిక రచనల్లో ప్రధానవస్తువు న్యాయవ్యవస్థ, రాజ్యాంగ యంత్రం. 'తలుపు గొళ్లెం'లోని ఈ వాక్యాలు న్యాయ వ్యవస్థ విషయంలో ఆయనకున్న దృఢమైన అభిప్రాయాల్ని వ్యక్తం చేస్తాయి. ''ఏ దేశంలో ఏ మారుమూల ఏ కోర్టుకి వెళ్లి చూసినప్పటికీ అక్కడ కనిపించే పోలీసులూ, బంట్రోతులూ, గుమాస్తాలూ అంతా కూడా పీడించడానికి యముడు పంపిన స్పెషల్‌బైప్ పిశాచాల్లా ఉంటారే తప్ప మనుషుల్లా కనిపించరు, మనుషుల్లా ప్రవర్తించరు.''

రావిశాస్త్రి చివరి రోజుల్లో ఇంగ్లీషులో 'A guide to young lawers' అన్న పుస్తకం రాయడం మొదలు పెట్టాడు. కాని పూర్తికాలేదు. యువ లాయర్లు చాలా మంది ఆ పుస్తకం కోసం ఎదురు చూశారు. న్యాయవాది అంటే ఎవరు? వాదనా

పద్ధతులెలా ఉండాలి? కోర్టులో ఎలా ప్రవర్తించాలి? కేసు ఎలా మొదలు పెట్టాలి? న్యాయాధికారుల మనస్తత్వాన్ని గుర్తించడం ఎలా? మొదలైన అంశాలు ఈరచనలో ఉన్నాయి. రాసినంత వరకు కూడా ఆ రచన దొరక్కుండా పోయింది. ఈ విషయాన్ని రచయిత, విమర్శకుడు చందు సుబ్బారావు 'శాస్త్రిగారి అమూల్య రచన' అన్న వ్యాసంలో తెలియ జేశాడు.

మధ్య కొంతకాలం రావిశాస్త్రి సినిమారంగంలో కూడా పనిచేశాడు. కాని ఇమడలేకపోయాడు. 'స్త్రీ' అన్న సినిమాకి రచన చేశాడు. అది అంతగా ఆడలేదు. ఎల్.వి.ప్రసాద్ హిందీలో తీసిన 'రాజా ఔర్ రంక్' కి స్క్రీన్‌ప్లే రాశాడు. 'రత్తాలు-రాంబాబు' సినిమాగా రావలసింది, రాలేదు. కొంతకాలం సినిమాలకి పనిచేసి మద్రాసు నుంచి తిరిగి వచ్చిన తరువాత 'మన మందు మన్ని తాగనివ్వరు, మన డైలాగుల్ని మనల్ని రాయనివ్వరు' అని ఆయన తన మిత్రులతో చెప్పిన మాటలు ఆయన చేదు అనుభవాల్ని తెలియజేస్తాయి.

## ప్రవృత్తి

వృత్తికి న్యాయవాది అయినా ఆయన ప్రవృత్తి పుస్తకపఠనం, సాహిత్య రచన, నాటకరంగం, సంగీతం. న్యాయవాదవృత్తిని కూడా ఆయన తన మనస్తత్వానికి, అభిప్రాయాలకి అనుగుణంగా ప్రవృత్తిగానే కొనసాగించాడు. చిన్నప్పుడు పుస్తక పఠనంతోపాటు బొమ్మలు కూడా గీసేవాడు. విద్యార్థి దశలో పాటల పోటీలలో, వక్తృత్వ పోటీలలో పాల్గొనేవాడు. చిన్నప్పటి నుంచి భారత కథలు వినడం, డిటెక్టివ్ నవలలు చదవడం ఇష్టంగా ఉండేది. చిన్నప్పటి నుంచే ఎన్నో ఆలోచనలు. మిత్రులతో కలసి టింగురంగా లాడ్జి పెడదామని, 'యువభారతి' అన్న సంస్థను స్థాపిద్దామని, 'ఉష' అనే పత్రిక మొదలు పెడదామని...

చిన్నప్పుడు సరస్వతీ పూజ చేసేవాడు. విశాఖపట్టణంలో విశాఖ కనక మహాలక్ష్మిని వారం తప్పక దర్శనం చేసుకునేవాడు. తరువాతి కాలంలో పూర్తిగా నాస్తికుడయ్యాడని చెప్పలేం కాని, పూజా పురస్కారాల మీద ఆసక్తి తగ్గింది. విశాఖలో హిందూరీడింగ్‌రూంలో మిత్రుల్ని కలుసుకోవడం అలవాటుగా మారింది. ఎ.వి.ఎన్ కాలేజీలో క్లాస్‌మేట్స్ అయిన అబ్బూరి వరదరాజేశ్వరరావు, పన్యాల రంగనాథరావు అప్పటికే రచనలు చేస్తున్నారు. నేను మాత్రం ఎందుకు రాయకూడదని తానూ రాయడం మొదలుపెట్టాడు. అబ్బూరి వరద రాజేశ్వరరావు అంటే రావిశాస్త్రికి చాలా గురి. "బయట ప్రపంచాన్ని రుచి చూపించినవాడు అబ్బూరి వరద రాజేశ్వరరావు... నా రా థింకింగ్ అంతా వరదే వదిలించాడు" అని కూడా చెప్పుకున్నాడు. తెలుగు సాంస్కృతికరంగంలో ప్రముఖకవి, మేధావి

అబ్బూరి రామకృష్ణారావు, ఆయన కుమారుడు అబ్బూరి వరద రాజేశ్వరరావులది చాలా విచిత్రమైన పాత్ర. అనేక రంగాలలో చాలా మందిని వారు ముందుకు తోశారు. వాళ్లు మాత్రం ఎప్పుడూ వెనకే ఉండిపోయారు. "చదవడంవల్ల సంస్కృతం రాలా, చదవకపోవడం వల్ల తెలుగు వచ్చింది. తెలుగు నేను చదివి నేర్చుకోలా, విని నేర్చుకున్నా. జనం దగ్గర ఓనమాలు దిద్దా. ప్లీడరు వృత్తిలో గుణింతాలు నేర్చుకున్నా. జీవితం పెద్దబాలశిక్ష. మంచి పుస్తకాలు చిన్నబాలశిక్ష" - ఈ మాటలు రావిశాస్త్రి ప్రవృత్తిని,స్వభావాన్ని తెలియజేస్తాయి. విద్యార్థిదశ నుంచీ ఆటలన్నా ఆసక్తి. బాడ్మింటన్, ఫుట్‌బాల్, క్రికెట్, వాలీబాల్, రింగ్ టెన్నిస్, పింగ్‌పాంగ్, క్యారమ్స్, పేక అన్నీ ఇష్టమే.

రావిశాస్త్రికి గానం ఇష్టం. పాలూరు రాజేశ్వరరావు, ఈలపాట రఘు రామయ్య, బడే గులాం అలీఖాన్, వైణికుడు వాసా కృష్ణమూర్తి మొదలైన సంగీతకారుల్ని ఆయన అభిమానించేవాడు. సైగల్ పాటలు ఇష్టం. పాడేవాడు కూడా. ఒక మూడ్‌లో ఈలపాట రఘురామయ్యకు పాదాభివందనం కూడా చేశాడట. సంప్రదాయ కీర్తనలు, జానపద గేయాలు స్వయంగా పాడేవాడు శాస్త్రి. పద్యాలంటే ఇష్టం. ధూర్జటి కాళహస్తీశ్వర శతకం అంటే మరీ ఇష్టం. విప్లవ సాహిత్యోద్యమంలో భాగంగా వచ్చిన శివసాగర్ 'నరుడో-భాస్కరుడో' పాటను ఊగిపోతూ పాడేవాడు. సినీనటి కన్నాంబ అంటే అభిమానం. కపిలవాయి రామనాథశాస్త్రి అన్నా అభిమానమే. తెలుగు జానపద బాణీలు హిందీసినిమా పాటలలోకి ఎలా ఎగుమతి అవుతున్నాయో పోల్చి చెప్పేవాడు రావిశాస్త్రి. అంతరంగ ప్రపంచంలో సన్నిహితులు చేరినప్పుడు జావళీలను, జానపద గీతాల్ని రకరకాల హావభావాలతో పాడి వినిపించేవాడట. ఆ సందర్భంలో శాస్త్రి నిజమైన కళాకారుడుగా కనిపించేవాడని మిత్రులంటారు.

రావిశాస్త్రికి అభిరుచిగల మరోరంగం నాటక రంగం. ఆయన స్వయంగా నాటక రచయిత, ప్రయోక్త, నటుడు, దర్శకుడు. విశాఖ నాటక కళామండలిలో శాస్త్రిది ప్రముఖ పాత్ర. గణపతిరాజు అచ్యుతరామరాజు దీనికి ప్రధాన కార్యకర్త. సంకు పాపారావు, చాగంటి సన్యాసిరాజు, ఆకెళ్ల కృష్ణమూర్తి మొదలైనవాళ్లు ఈ నాటక మండలిలో సభ్యులు. ఈ సంస్థ విశాఖలో ఇన్‌స్పెక్టర్ జనరల్ నాటకం విజయవంతంగా ప్రదర్శించింది. ఈ సంస్థపక్షానవే రావిశాస్త్రి రాసిన 'వచ్చేకాలం' నాటక ప్రదర్శన జరిగింది. తరువాత ఈ నాటకం పేరు 'తిరస్కృతి'గా మారింది. సుమారుగా రావిశాస్త్రి ఈ నాటకానికి దర్శకత్వం వహించాడు. సంభాషణలు పలకడం మొదలైన విషయాలలో శాస్త్రి మౌలికమైన సలహాలను ఇస్తుండేవాడు. తరువాతకాలంలో విశాఖనాటకకళామండలి వైయక్తిక రాజకీయాల కారణంగా చీలిపోయింది. అదేకాలంలో అబ్బూరి రామకృష్ణారావు గురజాడ కన్యాశుల్కం

నాటకాన్ని రెండు గంటలకు కుదించి ప్రయోక్తగా ప్రదర్శించే ఏర్పాట్లు చేశాడు. అందులో రావిశాస్త్రి గిరీశంగా నటించవలసి ఉంది. కాని ప్రదర్శన జరగలేదు. అయితే ఆ తరువాత కాలంలో అబ్బూరి వారి ఆధ్వర్యవంలోనే హైదరాబాదు మొదలైన చోట్ల ఈ నాటక ప్రదర్శన చాలాసార్లు జరిగింది.

రావిశాస్త్రి 'తిరస్కృతి' (వచ్చేకాలం) నాటకమే కాకుండా 'నిజం', 'విషాదం' అన్న నాటకాలు కూడా రచించాడు. 'నిజం' నాటక ప్రదర్శన వందలసార్లు జరిగింది. అత్తిలి కృష్ణారావు నాట్యభారతి పక్షాన 'విషాదం' నాటక ప్రదర్శన జరిగింది. శాస్త్రి ఈ నాటకాలకు రచయిత మాత్రమేకాదు, దర్శకుడు కూడా. ప్రదర్శనకు కావలసిన రూపకల్పన చేసినవాడు, నటించినవాడు కూడా. రావిశాస్త్రి, ఆకెళ్ల కృష్ణమూర్తి, చాగంటి సన్యాసిరాజు, మంగిపూడి శాస్త్రి, సంకు పాపారావు, కోరాడ జగన్నాథరావు, వాసిరెడ్డి వెంకటప్పయ్య మొదలైనవాళ్లు విశాఖలోనే గురజాడ కళాకేంద్రం స్థాపించారు. పదవుల పేరుతో సంస్థ చీలిపోకుండా ఉండడానికి ఏ హోదాలు లేక అందరూ సాధారణ సభ్యులుగానే ఉండడం ఈ సంస్థ విశేషం. రావిశాస్త్రి పనిచేసిన కళాసంస్థల పక్షాన వివిధ నాటక పోటీలలో పాల్గొనడం, నాటక పోటీలలో న్యాయమూర్తిగా పాల్గొనడం చేసేవాడు.

కన్నడ, మరాఠీ, మలయాళ భాషా ప్రాంతాలలో సాహిత్యం, నాటకరంగం, జానపద కళలు, ఇతర సామాజిక, కళారంగాలలో బహుముఖంగా పనిచేసి అఖిల భారతస్థాయిలో పేరు గడించిన వాళ్లున్నారు. రావిశాస్త్రి బహుముఖ ప్రజ్ఞావంతుడు. ఆయన ప్రతిభ బహిఃప్రపంచం, అంతరంగ ప్రపంచాలుగా రెండుగా విడిపోయింది. ఆయన సాహిత్యం మాత్రమే బహిః ప్రపంచానికి అందింది. ఇతర ప్రతిభా విశేషాలు అంతరంగ ప్రపంచంలోను, ఆయనే విధించుకున్న పరిమితుల్లోను మిగిలిపోయాయి, అణగిపోయాయి. ఈ రెండు ప్రపంచాల మధ్య సరిహద్దును చెరిపేసికాని ఉంటే రావిశాస్త్రి అఖిలభారత స్థాయిలో తెలుగువారికి ప్రాతినిధ్యం వహించే బహుముఖప్రజ్ఞాశాలిగా ఎదగడానికి అవకాశం ఉండేదని వేరే చెప్పవవసరం లేదు.

## వ్యక్తిత్వం

> "లోపల షర్టైనా బుష్షర్టైనా టకప్ చేసి తను నమ్మిన నేలపై గట్టిగా నిలబడి, నా జీవితం తెరచిన పుస్తకం (మై లైఫ్ ఈజ్ ఎన్ ఓపెన్ బుక్) చదువుకోండి, నాకు రహస్యాల్లేవంటూ, చుట్టూ పదిమంది స్నేహితులో, క్లయింట్లో, కవులో వుండగా, ఒక చేతిలో సిగరెట్, మరో చేతిలో నల్లకోటు ధరించి, విశాఖపట్నం వీధుల్లో ఏ సెంటర్లోనైనా దర్శనమిచ్చే క్రిమినల్ లాయర్,

తెలుగులో ది మోస్ట్ ఒరిజినల్ రైటర్, వచన రచనకు నిజమైన మేస్త్రి రాచకొండ విశ్వనాథశాస్త్రి"

- పురాణం సుబ్రహ్మణ్యశర్మ

రావిశాస్త్రి జీవితం తెరచిన పుస్తకమే.రాతలలో తన బలాన్ని బలహీనతల్ని, ఆవేశాల్ని, ఉద్వేగాల్ని ఆయన ఎప్పుడూ దాచుకోలేదు. కాని వ్యక్తిగతంగా మరీ సన్నిహితుల మధ్య తప్ప రావిశాస్త్రికి బిడియం ఎక్కువ. చిన్నప్పుడు పెంకివాడుగా ఉన్నట్టు చెప్పుకున్నా, అనంతర జీవితంలో బిడియమే ఎక్కువగా కనిపిస్తుంది. వేదికల మీదికి ఎక్కడం అన్నా, పబ్లిగ్గా మాట్లాడాలన్నా ఆయనకు అంతగా ఇష్టం ఉండేదికాదు. బిడియం వల్లే ఆయనలోని కళాకారుడు పూర్తిగా బయటికి రాలేదేమో అనిపిస్తుంది. ఎప్పుడైనా గడుసుగా కన్పించినా సాధారణంగా భోళా శంకరుడేనని సన్నిహిత మిత్రులంటారు. ఎవరికైనా సహాయం అవసరమైతే సమయమూ, డబ్బూ ఖర్చుపెట్టి, స్వయంగా తిరిగి పనిచేసి పెట్టేవాడు. ఏదైనా సంఘటనలకు స్పందిస్తే మాత్రం ఆవేశంగా మాట్లాడే వాడు. కార్మిక నాయకుడు, కమ్యూనిస్టు వాసిరెడ్డి వెంకటప్పయ్య, సంకు పాపారావు, కథకుడు, ప్రగతిశీలి ఎన్నెస్ ప్రకాశరావు ఆయన ప్రాణస్నేహితులు. సల్ఫ్యూరిక్ యాసిడ్ పడి ఎన్నెస్ ప్రకాశరావు, వాసిరెడ్డి వెంకటప్పయ్య 1973 జూన్‌లో మరణించారు. ప్రకాశరావును గురించి రాసిన ఎలిజీ, వెంకటప్పయ్య మరణానికి రాసిన వచన ఖండిక మంచి సాహిత్య ఖండికలు. ప్రొఫెసర్ తుమ్మల వేణుగోపాలరావు, విప్లవ రచయితల సంఘ ప్రముఖ కార్యకర్త చలసాని ప్రసాద్, ఆంధ్రవిశ్వవిద్యాలయం తెలుగుశాఖలో అధ్యాపకులు డా॥ అత్తలూరి నరసింహారావు ఆయన ఆంతరంగిక వర్గంలో ప్రముఖులు. ప్రముఖ కథానికా కారుడు కాళీపట్నం రామారావంటే రావిశాస్త్రికి అమిత గౌరవం. విశాఖలో ప్రముఖ లాయరు, విశాఖ నాటక కళా మండలి వ్యవస్థాపకుడు గణపతిరాజు అచ్యుత రామరాజు, ప్రముఖ కమ్యూనిస్టు ఆకెళ్ల కృష్ణమూర్తి, మరోప్రముఖరచయిత, పాత్రికేయుడు పురాణం సుబ్రహ్మణ్య శర్మ, రచయిత బీనాదేవి(బి.నరసింగరావు) ఆయన ఆప్తవర్గంలోనివారు. మారేపల్లి రామచంద్రకవి, పురిపండా అప్పలస్వామి అంటే ఆయనకు ఎక్కువగా గౌరవం.

రావిశాస్త్రి చిన్నప్పుడు తనకు తాను గాంధీయిస్టుననుకునేవాడు. క్రమంగా మార్క్సిస్టు భావాలతో ప్రభావితుడైనాడు. ఆయన పందొమ్మిది వందల అరవైల తరువాత రాసిన రచనల్లో మార్క్సిస్టు దృక్పథం స్పష్టంగా కనిపిస్తుంది. ప్రత్యక్షంగా మార్క్సిస్టు పరిభాష వాడక పోవడం వల్ల ఆయనను మార్క్సిస్టు రచయితగా గుర్తించడానికి కొందరు సిద్ధపడకపోవచ్చు. కాని ఆయన ఇంటర్వ్యూలలో, ఉపన్యాసాలలో, వ్యాసాలలో మార్క్సిజం పైన తన విశ్వాసాన్ని, గౌరవాన్ని స్పష్టంగా వ్యక్తం చేశాడు. "మార్క్సిజాన్ని విమర్శించాలనేవాళ్లు నాలాటి వాడి వ్యసనాల్ని చూసేకన్నా నమ్మిందిఆచరించిన వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసం మొదలైన

వారి ఆదర్శం పాటించితే మంచిది. ఒక గొప్పవాడి గొప్ప మంచివాడు చెప్పినా, చెడ్డవాడు చెప్పినా ఒకటే. అలాగే మార్క్సిజం గొప్ప మార్క్సిజానిదేగాని చెప్పేవాడిని బట్టి మారదు" అని ఒక మిత్రుడితో వ్యక్తిగత సంభాషణలో అంటాడు రావిశాస్త్రి. ఆయన్ని ప్రభావితం చేసినవాళ్లలో ప్రముఖమార్క్సిస్టు చరిత్రకారుడు డి.డి.కోశాంబి ఒకడు. గోవులొస్తున్నాయి జాగ్రత్త, పిపీలికం, ది స్మోకింగ్ టైగర్ అను పులిపూజ, షోకుపిల్లి మొదలైన రచనల్లో ఆయన మార్క్సిస్టు దృక్పథం స్పష్టంగానే కనిపిస్తుంది.

రావిశాస్త్రికి వైయక్తిక స్థాయిలో ఉన్న కొన్ని నమ్మకాలు సాధారణ మార్క్సిస్టులతో పోల్చినప్పుడు కొంత విరుద్ధంగా కనిపించవచ్చు. చివరిదాకా ఆయనకు జ్యోతిషం మీద నమ్మకం ఉండేదని మిత్రులంటారు. చిన్నప్పుడు, ప్రారంభ యౌవనంలో సరస్వతీ పూజలు, కనక మహాలక్ష్మి దర్శనాలు చేసేవాడు. మార్క్సిస్టు భావాలతో ప్రభావితుడైన తరువాత దశలో కూడా ఆయనకు దేవుడిపైన పూర్తి నమ్మకం పోయిందని చెప్పడానికి వీలులేదు. దేవుడిమీద నమ్మకం గురించి ఎవరైనా అడిగితే ఆయన స్పష్టాస్పష్టంగానే సమాధానం చెప్పేవాడు. "దేవుడి మీద నమ్మకం ఉందా లేదా అన్నది అనవసరమైన విషయం. అది వ్యక్తిగతమైన విషయం. నాకు నమ్మకం ఉన్నా లేకపోయినా నా లక్ష్యానికి అదెన్నడూ ఆటంకం కాదు" అని చెప్పుకొనేవాడు. కోర్టుకెళ్లే కొన్నాళ్లవరకు దేవుడంటే భక్తి ఉండేదని, జీవితంలో అది పూర్తిగా పోలేదేమో అని కూడా చెప్పుకున్నాడు. ఆ రోజుల్లో అందరూ బాగుండేట్టు చేయాలని దేవుణ్ణి వేడుకొనేవాడట. ఎంత తహతహలాడినా భగవంతుడితో లాభం లేదని, దేవుడు పేదవాడికి సహాయం చేయడని క్రమంగా దేవుడిమీద నమ్మకం తగ్గిందని, అంతకంటే ఎక్కువగా కోపం ఏర్పడిందని మరోచోట అంటాడు. "దేవుడు లేడనుకోవడంకంటే ఉన్నాడనుకోవడమే నాకు ఒకప్పుడు ఇష్టంగా ఉంటుంది. లేడనుకుంటే ద్వేషించడానికి ఎవరూ ఉండరు. దేవుణ్ణి ద్వేషించడం ప్రమాదరహితం" అని ఒకసారి దేవుడున్నాడనుకోవడంలోని సౌకర్యాన్ని వివరిస్తాడు. ఆయన రచనల్లోని పాత్రలు కూడా దుఃఖాల్లో బాధల్లో దేవుణ్ణి సంబోధిస్తూ పైవిధంగానే రకరకాలుగా ప్రవర్తిస్తాయి. మంచికి రాముణ్ణి, చెడుకు రావణుణ్ణి, దుష్టపాలకులకు హిరణ్యకశిపుణ్ణి, ప్రజలకు నరసింహావతారాన్ని సింబల్స్‌గా వాడటం ఆయన రచనల్లోను, వ్యాసాల్లోను, ఉపన్యాసాల్లోను కనిపిస్తుంది. విష్ణువుని, కృష్ణుణ్ణి శాస్త్రి విమర్శించేవాడు. శివుణ్ణి ప్రోలటేరియట్ దేవుడిగా చెప్పేవాడు. ఇవన్నీ ఆయనకు ప్రజలయెడ, పేదలయెడ నిబద్ధత విషయంలో ఆటంకం కలిగించలేదు. దోపిడీ, అన్యాయాలు, పీడన, వ్యవస్థాగతమైన దుర్మార్గం మొదలైన వాటికి వ్యతిరేకంగా చివరిదాకా రాజీ లేకుండా నిలబడ్డాడు. ఉద్యమాలతో, సంస్థలతో సంబంధం ఉన్నా తన వైయక్తికమైన

అభిప్రాయాలను ఎప్పుడూ దాచుకోలేదు. పాకిస్తాన్ చీలి బంగ్లాదేశ్ ఏర్పడిన సందర్భంలో తను ఏ ఉద్యమానికి దగ్గరగా ఉన్నాడో ఆ ఉద్యమ విధానానికి భిన్నమైన అభిప్రాయాన్ని ప్రకటించాడు. బంగ్లాదేశ్ ఏర్పడడాన్ని సమర్థించాడు. ఇంకా అనేక రాజకీయ పరిణామాల విషయంలో తన సొంత అభిప్రాయాల్ని స్పష్టంగా ప్రకటించేవాడు. అలాగే సంస్థలని, సిద్ధాంతాలని స్వప్రయోజనం కోసం ఎప్పుడూ వాడుకోలేదు. ఆత్మవంచన లేని స్వభావం ఆయనది. చెప్పేదొకటి చేసేదొకటి అంటే ఆయనకు గిట్టదు. తన బలహీనతలకు ఆయన మరొకర్ని బాధ్యుల్ని చేయలేదు. చాలా నమ్మకాలు, అభిప్రాయాల విషయంలో రావిశాస్త్రి సందిగ్ధ మనస్కుడుగా కనిపించినా సామాజిక నిబద్ధత విషయంలో ఆయనను ఎవరూ సందేహించలేరు. విశాఖ వంటి నగరంలో లాయర్‌గా ఆయన ఎంతైనా సంపదను ఆర్జించే అవకాశం ఉంది. కాని ఫీజులు ఇవ్వలేని పేదలకేసులనే ఆయన తీసుకొనేవాడు. స్థిరచరాస్తులు సంపాదించలేదు. చివరివరకు సొంతఇల్లు లేదు. చాలా కష్టంపైనే సంసారయాత్ర చేశాడు. 1966 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు తరువాత ఏ అవార్డునీ ఆయన గ్రహించలేదు. ఆ అవార్డుని కూడా తరువాత తిరిగి ఇచ్చివేశాడు. ఆంధ్ర విశ్వవిద్యాలయం ఇవ్వడానికి సిద్ధపడిన కళాప్రపూర్ణను రెండుసార్లు తిరస్కరించాడు.

వాసిరెడ్డి వెంకటప్పయ్య,ఆకెళ్లకృష్ణమూర్తి మొదలైన వాళ్ల సాహచర్యంలో ఆయన వామపక్షభావాలకు సన్నిహితం అయ్యాడు.విశాఖలో హిందూ రీడింగ్ రూంలో గాని, లీలామహల్ టీకొట్టు దగ్గరగాని మిత్రులంతా చేరడం, జాతీయ అంతర్జాతీయ విషయాలను చర్చించుకోవడం సర్వసాధారణం. అబ్బూరి రామ కృష్ణారావు వంటి పెద్దలు కూడా ఈ చర్చలలో పాల్గొంటూ ఉండేవారు. కోశాంబీ రచనలను మిత్రులకు వివరించి చెప్తూ ఉండేవాడు రావిశాస్త్రి. వియత్నాం యుద్ధం మొదలుకొని, అంతర్జాతీయ రాజకీయ పరిణామాలు, సాధారణ మార్క్సిస్టు సిద్ధాంతాల వరకు మిత్రుల మధ్య చర్చా విషయాలుగా ఉండేవి. అలాగే పాశ్చాత్య సాహిత్య విషయాలు కూడా. ఆ రోజులలో ఆంధ్ర దేశంలో ఈ పరస్పర మైత్రీ చర్చలే ఎంతో మంది మేధావుల్ని, రచయితల్ని తీర్చిదిద్దాయి. అంతర్జాతీయ కుట్రలో భాగంగా 1961 లో జరిగిన కాంగోనాయకుడు పేట్రిస్ లుముంబా హత్య రావిశాస్త్రిని, మిత్రుల్ని ఎంతగానో కదలించి వేసింది. టౌనుహాలులో సంతాప సభ కూడా జరిపించాడు రావిశాస్త్రి. ఈ సందర్భంగా గొప్ప ఎలిజీ కూడా రాశాడు. స్థానిక అట్టడుగు వర్గాల వారి జీవితంలో మమేకం అయి రచనలు చేసేవాడు రావి శాస్త్రి. అంతగానూ జాతీయ, అంతర్జాతీయ సంఘటనలకు స్పందించేవాడు.

శ్రీశ్రీ తరువాత అంతగా గాఢంగా అభిమానించే వర్గం ఉన్న రచయిత రావిశాస్త్రి. ఆయనతో ప్రైవేట్ సంభాషణలలో పాల్గొనడం మిత్రులకు,

అభిమానులకు సరదా. రాజకీయాల నుంచి సాహిత్యంవరకు, త్యాగరాజకీర్తనల నుండి జానపదగీతాల వరకు అనేక విషయాలపైన ఈ సంభాషణలు కొనసాగేవి. పబ్లిక్ వేదికలపైన చూచినవారికి తెలియని ఆయన శక్తి సామర్థ్యాలు, పరిజ్ఞానం, ఆయనలోని కళాచాతుర్యం అంతరంగప్రపంచంలో విశ్వరూపంలో కనిపించే దని మిత్రులు, అభిమానులు కథలు కథలుగా చెప్పుకునేవారు. ఎక్కడికి వెళ్లినా ఆయనను సొంతం చేసుకుందామని చూచేవాళ్లు ఎక్కువగా ఉండేవారు. అదీ ఆయనలోని ఆకర్షణ.ఆయనతో కొంత సమయం గడపగలగడం ఒక ఎడ్యుకేషన్ అని మిత్రులు అంటూ ఉంటారు. అభిమానులు అది ప్రివిలేజ్‌గా భావించేవారు. సుమారుగా ప్రతిపుస్తకాన్ని అప్పులకో,మిత్రులకో,విప్లవపోరాటాల్లో పాల్గొన్నవాళ్లకో అంకితం ఇవ్వడం అతనికున్న ఆర్ద్రమైన మానవ సంబంధాల్ని, నిబద్ధతను తెలియజేస్తాయి.

దాపరికం లేకుండా ఉన్న విషయాలను, బలహీనతలను చెప్పుకోవడం రావిశాస్త్రి సాదాసీదా స్వభావాన్ని తెలియ జేస్తుంది. 1965లో విశాఖ రచయితల సంఘం ద్త్రెమాసిక పత్రికలో 'నేనెందుకు రాస్తున్నాను' అనే వ్యాసంలో తన రచనా జీవితానికి సంబంధించిన అనుభవాల్ని తెలియజేశాడు రావిశాస్త్రి. అందులో చిన్నప్పుడే సెక్స్‌కథలు చదవడంవల్ల తనమీదగల ప్రభావాలను గురించి ఆయన వివరించాడు. మనుచరిత్రనుంచి మైదానం దాకా అన్నిట్లోను సెక్స్ కనిపించిందని, ఒక దశలో అందుకోసమేతప్పమరొక దానికోసం చదవలేకపోయానని తెలియ జేశాడు. దీనివల్ల వైయక్తిక జీవితంలోనేకాదు, రచనల్లో కూడా తప్పుదార్లు పట్టడం జరిగిందని అంటాడు. పదిహేనో ఏట రాసిన 'దేముడే చేసేడు' అన్న కథలో ఒక పెద్దింటి వాడివల్ల అత్యాచారానికి గురయిన పేదింటిఅమ్మాయిని పాఠకులకు కామభావాలు కలిగేటట్టుగా వర్ణించిన తీరుని తనే ఉదాహరణగా ఇస్తాడు రావిశాస్త్రి. తనే చెప్పుకున్న ఈ విషయంలో కొంతవరకు నిజం లేకపోలేదు. ఆయన రచనలలో ఇటువంటి ఛాయలు కొద్దో గొప్పో కనిపిస్తూనే ఉంటాయి. దయనీయమూ, విషాద భరితమూ అయిన సన్నివేశాలలో కూడా స్త్రీవర్ణనలు అవసరాన్ని మించి ఉన్నాయనిపించే భాగాలు కొన్ని ఆయన రచనలలో కనిపిస్తుంటాయి. గంభీరమైన ఆయన రచనలలో అన్నంలో రాళ్లల్లాగా ఇవి తగులుతూ ఉంటాయి. ఈ అంశం స్త్రీవాద రచయిత్రుల విమర్శకు గురి అయిన మాట కూడా వాస్తవమే. కాని అడుగడుగునా ఆయన జీవితంలోను, రచనల్లోను కనిపించే నిజాయితీతో కూడిన నిబద్ధత, ఆయన స్వీకరించిన వస్తువులు, అట్టడుగువారితో ఆయన మమేకమై జీవించి రచించిన తీరు, అనితరగమ్యమైన కథాకథనం, రచనా సంవిధానం మొదలైన వాటివల్ల ఈ బలహీనత పాఠకుల దృష్టిలో పడే అవకాశం చాలా తక్కువ.

రావిశాస్త్రి సహజంగానే ఆవేశపరుడు. 1969లో ప్రత్యేక తెలంగాణా ఉద్యమంలో సర్కారుజిల్లాలవారిపై దాడులు జరిగాయన్న వార్తలకు ఆవేశ పూరితంగా స్పందించాడు. అయితే దీనికి తెలంగాణా బీదవారు కూడా బలి అవుతున్నారని ప్రకటించాడు. ఇలాంటి ఉద్యమాల వల్ల లాభపడేది పెద్దలు, అధికారంలో ఉన్నవారూ మాత్రమేనని కూడా చెప్పాడు. "పల్లకిలో కూర్చున్నది శర్మగారైనా, వర్మగారైనా సరే బరువు మాత్రం బోయివారిదేకదా! పల్లకిలోంచి శర్మగారిని ఎంత వేగిరం దించేసి వర్మగారు ఎంత వేగిరం ఎక్కితే వారి బరువుల్లో తేడా లేదనే విషయం వారిని మోసేవారు అంత వేగిరం తెలుసుకోగల"రని బోధ చేశాడు. 1970 అక్టోబర్‌లో ఖమ్మంలో జరిగిన మొదటి విప్లవ రచయితల సంఘం సభలలో ఏ ప్రాంతం అయినా పేదరికం స్వభావంలో తేడా లేదని ఉపన్యసించాడు. 1972లో ప్రత్యేకాంధ్ర ఆందోళన జరిగినప్పుడు రావిశాస్త్రి స్పందనలు భిన్నంగా ఉన్నాయి. అప్పుడు జరిగిన కాల్పులని, కర్ఫ్యూలని, లాఠీచార్జీలని నిరసిస్తూ ఆయన ప్రవర్తన ప్రభుత్వ వ్యతిరేక స్వభావాన్ని సంతరించుకుంది. తోటి లాయర్లతో కలసి ప్రత్యేకకోర్టులు నిర్వహిస్తామని కూడా ప్రకటించాడు.

రావిశాస్త్రి వ్యక్తిత్వాన్ని గురించి ఇంతగా చెప్పడానికి కారణం ఇది. కళాకారులలో ఆవేశమూ, బలహీనతలూ ఉండడం సహజం. వాటిని మనం పట్టించుకోవవసరం లేదనే అభిప్రాయం ఒకటి ఉంది. ఈ అభిప్రాయంలోని సత్యమూ, సబబు ఎంతవరకు అన్నదికాదు ప్రశ్న. రావిశాస్త్రి విషయంలో కొందరి విమర్శకు పాత్రమైన వైరుధ్యాలు ఆయన నిజాయితీని, పేదల యెడల ఆయన కున్న నిబద్ధతను ఏ మాత్రం సడలించలేదు. తెలుగు రచయితలలో రావిశాస్త్రి లాగా సామాన్యుల జీవితంతో అంతగా సంబంధం ఉన్న వారు అరుదు. ఆయన సాహిత్యం జీవితం నుంచి వచ్చింది. పుస్తకాల నుంచి కాదు. అంతర్జాతీయ స్థాయికి తగిన రచనలు చేసిన రావిశాస్త్రి కీర్తి ప్రతిష్ఠల కోసం, గుర్తింపు కోసం పాకులాడలేదు. ఈ విషయంలో ఆయన ఏ మాత్రం దృష్టి సారించినా జాతీయ, అంతర్జాతీయ గౌరవాలను పొందగలిగేవాడు. తెలుగు రచయితలలో అటువంటి గుర్తింపు పొందేందుకు అన్నిరకాలా అర్హుడు రావిశాస్త్రి.

## క్రియాశీలి

రావిశాస్త్రి ఆలోచనాశీలి మాత్రమేకాదు. క్రియాశీలి కూడా. తన జీవితకాలంలో వివిధ దశలలో అనేక ఉద్యమాలకు పరిమిత రూపంలోనే అయినా దృఢసంకల్పంతో స్పందించాడు. గాంధీ ఉద్యమానికి స్పందించి చిన్నప్పుడే ఖద్దరు ధరించాడు. సొంత ఊరు తుమ్మపాలలోని చక్కెరఫ్యాక్టరీ కార్మికుల

పమ్మెకు సానుభూతి చూపాడు. చిన్నతనంలోనే నిరుద్యోగ సమస్యను గురించి కథరాశాడు. 1938లో వచ్చిన 'మాలపిల్ల' సినిమా చూసి ఒక కులాన్ని తక్కువ చేసి చూపించడాన్ని నిరసిస్తూ 'హిందూ' పత్రికకు ఉత్తరం రాశాడు. లాయర్‌గా కూడా పేదలపక్షం వాదించి వాళ్ల కష్టసుఖాల్లో పాలు పంచుకొని క్రియాశీలిగానే వ్యవహరించాడుగాని న్యాయవాద వృత్తికి సంబంధించిన వాడుగా ప్రవర్తించలేదు.

1949లో పుట్టిన విశాఖ రచయితల సంఘంలో ప్రముఖ పాత్ర వహించాడు రావిశాస్త్రి. తొలి దశలో అబ్బూరి రామకృష్ణారావు, పురిపండా అప్పలస్వామి విశాఖ రచయితల సంఘానికి అధ్యక్షులుగా ఉన్నారు. తరువాత ఆచార్య కె.వి.ఆర్.నరసింహం గౌరవాధ్యక్షులుగా వ్యవహరించారు. ప్రసిద్ధ చారిత్రికులు మల్లంపల్లి సోమశేఖరశర్మకు ఈ సంస్థతో సంబంధం ఉండేది. మసూనా, అంగర సూర్యారావు, కొండా మారుతి రామిరెడ్డి, నానిశెట్టి కృష్ణారావు, ఎమ్.జి.కె.మూర్తి మొదలైన రచయితలు,పండితులు ఈ సంఘవ్యవస్థాపకులలో ఉన్నారు. మహాకవి శ్రీశ్రీ, ప్రసిద్ధ భాషావేత్త భద్రిరాజు కృష్ణమూర్తి ఈ సంస్థలో సభ్యులుగా ఉండేవారు. 1965 జనవరిలో ఈ సంఘం పక్షాన ప్రారంభమైన 'విశాఖ' సాహిత్య త్రైమాసిక పత్రికకు రావిశాస్త్రి సంపాదకుడు. దాని సంపాద కీయాలు చాలావరకు ఆయనే రాసేవాడు.

విశాఖ పత్రిక సంపాదకీయాల్లో రావిశాస్త్రి ఆంధ్రాభిమానం, తెలుగు భాషాభిమానం ఎక్కువగా కనిపిస్తాయి. రావిశాస్త్రికి నాటక సంఘాలతో, ప్రదర్శనలతో ఉన్న ప్రత్యక్ష సంబంధాన్ని గురించి ఇంతకుముందే తెలుసుకున్నాం. ఆయన విశాఖ నాటక కళామండలిలో సభ్యుడు. గురజాడ కళాకేంద్రం వ్యవస్థాపకులలో ఒకడు. 1970లో విశాఖలో శ్రీశ్రీ షష్టి పూర్తిలో కూడా ఆయన క్రియాశీల పాత్ర వహించాడు.

వాసిరెడ్డి వెంకటప్పయ్య, ఆకెళ్ల కృష్ణమూర్తి మొదలైన వారి సంపర్కం వల్ల వామపక్ష భావాలతో ప్రభావితుడైన రావిశాస్త్రి తరువాత జీవితంలో మళ్లీ వెనక్కి తిరిగి చూడలేదు. 1962 నుంచి ఎన్నికలలో ఆయన కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థి కోసం పనిచేసేవాడు. 1967లో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో మార్క్సిస్టుపార్టీ అభ్యర్థి పక్షాన ప్రచారంచేశాడు.1970 జులైలో శ్రీశ్రీ అధ్యక్షతన విప్లవ రచయితల సంఘం (ఇకముందు విరసం) ఏర్పడి నప్పుడు దానికి కొడవటిగంటి కుటుంబరావుతోపాటు ఉపాధ్యక్షుడైనాడు. 1970 ఫిబ్రవరిలో విశాఖలో పెద్దఎత్తున జరిగిన శ్రీశ్రీ షష్టిపూర్తి విరసం ఆవిర్భావానికి అవసరమైన వాతావరణాన్ని ఇచ్చింది. ఆ సందర్భంగా విశాఖ విద్యార్థులు చదివి పంచిన కరపత్రం "రచయితలకు సవాల్" రచనలో రావిశాస్త్రి పాత్ర ఉందని అంటారు. 1970 అక్టోబరులో ఖమ్మంలో జరిగిన విరసం మొదటి మహాసభల్లో ఉత్తేజకరమైన ఉపన్యాసం ఇచ్చాడు. ఇదే

సందర్భంలో అప్పటి మార్క్సిస్టు పార్టీ కార్యదర్శి మోటూరు హనుమంతరావు రాసిన "సాహిత్యోద్యమంలో మార్క్సిస్టుల కర్తవ్యాలు" అన్న వ్యాసానికి సమాధానంగా విరసం విధానాలను సమర్థిస్తూ ఒక బహిరంగ లేఖ రాశాడు. ఇది 'తెలుగు వెలుగు' పత్రికలో 'మోటూరుకు శ్రీరాచకొండ బహిరంగ సవాళ్లు' అనే పేరుతో అచ్చయింది. తరువాత సభల్లో ఆయన తక్కువగానే పాల్గొన్నా విరసం ధ్యేయాలకు ఆయన దూరం కాలేదు. విశాఖలో జరిగే సభలలో మాత్రం ఆయన పాత్ర ఉండేది. 1976లో ఎమర్జెన్సీ కాలంలో ఆయన విరసానికి రాజీనామా చేశాడు. ఈ రాజీనామాకు కారణాలను అనేకులు అనేక రకాలుగా ఊహించినా, తనవల్ల, తన బలహీనతలవల్ల విరసానికి ఇబ్బందులు రాకుండా ఉండాలని రాజీనామా చేసినట్టు తనే స్వయంగా చెప్పుకున్నాడు.

విరసంలో సభ్యుడుగా ఉన్నప్పుడూ, తరువాతకూడా రావిశాస్త్రి పౌరహక్కుల కార్యక్రమంలో క్రియాశీలంగా పాల్గొన్నాడు. పార్వతీపురం కుట్రకేసులోను, సికిందరాబాదు కుట్ర కేసులోను అరెస్టు అయిన ఉద్యమ కారులు, విప్లవ రచయితల పక్షాన నిలిచాడు. 1971లో వరంగల్ నుంచి వచ్చిన 'మార్చ్' అన్న కవితా సంకలనాన్ని నిషేధించి, ప్రచురణకర్త పెండ్యాల కిషన్‌రావును అరెస్ట్ చేసినప్పుడు 'ఓ ఆంక్షా, ఓ అరెస్టూ' అన్న పేరుతో ఒక ప్రకటన చేశాడు. 1971లోనే జ్వాలాముఖి, చెరబండ రాజు, నిఖిలేశ్వర్ అరెస్ట్ అయినప్పుడు 'జేబులో కాణీ లేదు' అన్న పేరుతో విజయవాడ ప్రెస్‌క్లబ్‌లో ఒక ప్రకటన పత్రం చదివాడు. వారి అరెస్ట్ సందర్భంలోనే 'ప్రజారక్షణ సమితి' వారికి కరపత్రం రాశాడు. శ్రీశ్రీ, కొడవటిగంటి కుటుంబరావు, కె.వి.రమణారెడ్డిలతో పాటు విరసం సభ్యులైన ఈ ముగ్గురుని విడుదల చేయాలని చేసిన ప్రకటనలో సంతకం చేశాడు. విప్లవకారుల అణచివేత గురించి కలకత్తా నుంచి వచ్చే 'ఫ్రాంటియర్'లో వ్యాసం రాశాడు. 1973లో వరవరరావు, ఎం.టి.ఖాన్, చెరబండ రాజుల అరెస్టును ఖండిస్తూ 'విశాఖ పౌరహక్కుల సమితి' లో అధ్యక్షోపన్యాసం చేశాడు. ఇదే సందర్భంలో హైదరాబాదులో జరిగిన నిరసన ప్రదర్శనలో ఉత్తేజ కరంగా మాట్లాడి అందరినీ చకితుల్ని చేశాడు. 1974 లో దేశవ్యాప్తంగా జరిగిన రైల్వేసమ్మెను సమర్థిస్తూ 'అయితే ఎవరిదీ ప్రభుత్వం' అని కరపత్రం ప్రకటించాడు. అత్యవసర పరిస్థితిమీద ఒక వ్యాసం రాశాడు. ప్రముఖ విప్లవకారుడు నాగభూషణం పట్నాయక్‌కు ఉరిశిక్ష విధించినప్పుడు సంతకాల ఉద్యమం చేపట్టాడు. రావిశాస్త్రి రాజకీయ వ్యాసాలు, కరపత్రాలు, ప్రకటనలు, ఉపన్యాసాలు సాహిత్యవిలువలుగల ఖండికలుగా గుర్తింపు పొందాయని వేరే చెప్పనవసరం లేదు. ఎమర్జెన్సీలో విరసం సభ్యులతోపాటు 4.7.1975 నుంచి 6.2.1977 దాకా విశాఖ జైల్లో ఉన్నాడు. అప్పుడే వైయక్తిక కారణాలవల్ల విరసానికి రాజీనామా చేశాడు. తరువాత విడుదల అయ్యాడు.

రావిశాస్త్రి 1981లో మిత్రులతో కలిసి 'జన విశాఖ'ను ఏర్పాటు చేశాడు. విశాఖపట్టణం స్థానిక సమస్యల పరిష్కారం కోసం ఈ సంస్థ పనిచేసింది. విశాఖ మున్సిపాలిటీ కార్యక్రమాల తీరుని పరిశీలించడం ఈసంస్థ పని. అధ్యక్షుడితో పాటు విశాఖ కార్పొరేటర్లందరూ ఎన్నికైనప్పుడు తమ ఆస్తిపాస్తుల వివరాలను ప్రకటించాలని ఈ సంస్థ కోరింది. ఇదే సమయంలో బ్రహ్మ సమాజం మిత్రుడు ఎమ్.జి.కె.మూర్తి మరణిస్తే ఎవరూ అంత్యక్రియలు జరపడానికి సిద్ధంగా లేకపోతే తనే వాటిని జరిపించాడు. మూర్తి విశాఖ రచయితల సంఘం కార్యదర్శిగా ఉండేవాడు. 1982 తరువాత రావిశాస్త్రి అనేక కారణాలవల్ల అంత క్రియాశీలంగా లేకపోయినా జరుగుతున్న సంఘటనలకు స్పందిస్తూనే ఉన్నాడు. ఈ కాలంలో ఆయన కార్యక్షేత్రం ముఖ్యంగా విశాఖ నగరానికి పరిమితమైపోయింది.

## సాహిత్య జీవితం

జాస్మిన్, శంకరగిరి గిరిజాశంకరం, విషారా, కాంతాకాంత, గోలుకొండ రాంప్రసాద్, అంజానా, రావి శాస్త్రి, రాచకొండ విశ్వానాథశాస్త్రి - ఇవి రచయితగా రాచకొండ నామాష్టకం.

చిన్నప్పటి నుంచి అమ్మ పుస్తకాలు చదివించటం, నాన్న వినోదిని, చిత్రగుప్త వంటి పత్రికలు కొని తేవడం, భారత కథలంటే సరదా పడడం, పెద్దలు చెప్పే కథలు వినడం, తోటివారికి తాను కథలు కల్పించి చెప్పడం, పుస్తక పఠనం, విశాఖపట్టణం ఎ.వి.ఎన్ కాలేజీ హైస్కూల్‌లో అప్పటికే రాస్తున్న అబ్బూరి వరద రాజేశ్వరరావు, పన్యాల రంగనాధరావు వంటివారితో సాహచర్యం రావిశాస్త్రికి సాహిత్య వాతావరణాన్ని ఇచ్చాయి.

స్కూల్లో చదువుతున్నప్పుడే రావిశాస్త్రి ఇంగ్లీషు నవలలు ఎక్కువగా చదివేవాడు. డిటెక్టివ్ నవలలంటే రావిశాస్త్రికి సరదా. 1935లో వేసవి సెలవుల్లో రోజుకు అయిదు పేజీల చొప్పున ఒక డిటెక్టివ్ నవల రాయాలని ప్రారంభించి పూర్తి చేయలేదు. పదమూడు, పధ్నాలుగు ఏళ్లనాడే ఆయన ఎన్నో రచనలు ఆరంభించి పరిత్యజించాడు. 'గలివర్స్ ట్రావెల్స్' చదివి నవల రాయాలని ప్రయత్నించాడు. 1936లో తుమ్మపాలలోనే మొదటి కథ రాశాడు. థర్డ్‌ఫారం (ఇప్పటి ఎనిమిదవ తరగతి)లో ఉండగా రసపుత్ర వీరుల కథలు, చరిత్ర చదివి రసపుత్ర వీరుల గురించి నలభై పేజీల నవల రాసి ఆపేశాడు. 1938లో కొన్ని డిటెక్టివ్ కథలకి ప్లాట్లు అల్లాడు. 'కృష్ణాలాడ్జిలో ఖూనీ' చాలావరకు రాసి వదిలిపెట్టాడు. అదే సంవత్సరం 'శశాంక విజయము', 'దేముడు లేడూ?' అనే కథలు రాశాడు. 1938లోనే 'దేముడే చేశాడు' అన్న కథ వినోదిని అనే పత్రికలో రాచకొండ విశ్వానాథశాస్త్రి పేరుతో అచ్చయింది. ఒక పెద్దింటి అబ్బాయి ఒక

పేదింటి అమ్మాయిపైన అత్యాచారం చేయడం ఈ కథలో వస్తువు. తరువాత పెద్దింటివాడు పాముకరిచి చనిపోతాడు. ఇదే రావిశాస్త్రి రాసిన అచ్చయిన మొదటి కథ. 'ప్రతిఫలం' అనే మరో కథను 'వినోదిని' పత్రికకే పంపాడుకాని వేసుకోలేదు. 'కామేశ్వరరావుగారి కేసు' అన్న డిటెక్టివ్ కథను కూడా వినోదినిలో వేసుకోలేదు. 1939లో 'ప్రేమ ఫలితం' అన్న కథ 'ప్రజాబంధు' అన్న పత్రికలో పడింది. చెహోవ్ కథ ఆధారంగా రాసిన 'దౌర్భాగ్యం' అన్న కథ 'చిత్రగుప్త'లో అచ్చయింది. అదే సంవత్సరం 'పాతివ్రత్యం', 'రైలు ప్రయాణం', 'పోరు పడలేక', 'స్వప్నమా? సత్యమా?' అన్న కథలు రాశాడు. అదే సంవత్సరం 'ఉద్యోగం దొరక్కపోతే' అన్న కథ 'చిత్రగుప్త'లోను, 'మీరే ఆలోచించండి' అన్న కథ 'కథాంజలి'లోను పడింది. అప్పుడే 'మోడర్న్ రత్నావళి' నాటకం రాయాలనుకుని రాయలేదు. అలాగే 'కోనయ్య' అన్న నవల కూడా.

తొలిదశలో రావిశాస్త్రి కథలలో డిటెక్టివ్ కథలు, ప్రేమకు సంబంధించిన కథలు ఎక్కువగా ఉండేవట. నిరుద్యోగ సమస్య, కార్మిక సమస్యలకు సంబంధించిన కథలు కూడా కొన్ని ఉన్నాయి. రావిశాస్త్రి రచనల్లో ఎక్కువగా తనకు తెలిసిన పరిసరాలను వర్ణించేవాడు. తనకు తెలిసిన జీవితాన్ని చిత్రించేవాడు. రావిశాస్త్రి 'ఎందుకు రాసేను' అన్న వ్యాసంలో తన కథారచన ప్రారంభ దశను గురించి ఇలా చెప్పుకున్నాడు.

"నేను నా తొమ్మిది లేక పదోయేట ఒక డిటెక్టివ్ నవల రాయడానికి ప్రయత్నంచేసి పది, పదిహేను పేజీలు రాసేను. పెద్దవాళ్లలాగా మనవూ రాసేద్దాం అనే సరదాతోనూ మా ఇంట్లో వాళ్ల దగ్గర గొప్పకోసవూ ఆ ప్రయత్నం చేసేనని ఇప్పుడనుకుంటున్నాను. నాకు తెలిసిన పరిసరప్రాంతాల్నే అందులో వర్ణించి నట్టుగా నాకిప్పుడు బాగా గుర్తుంది. మేవు( ఆ రోజుల్లో విశాఖపట్నంలో బీచికి దగ్గిరగా ఉంటూ ఉండేవాళ్లం. నేను రాయబోయిన ఆ నవల్లో పత్తేదారు నారాయణరావు (మా నాన్నగారిపేరు నారాయణమూర్తి) లైట్‌హవుస్ నించి ఊటగెడ్డవైపుకి నడుస్తూంటే(సాయంకాలపు నీడల్లో) "బీచిని ఉన్న బ్రహ్మచెముడు డొంకలు బ్రహ్మరాక్షసుల్లా కనిపించేయి. సముద్రము పెద్దగా చప్పుడు చేసింది. ఈదురుగాలి హోరున వీచింది" - అదీ నేను చేసిన కథా ప్రారంభం. కథా రచనకి అది నా ప్రథమ ప్రయత్నం."

1941 తరువాత 1949 వరకు ఏడెనిమిది సంవత్సరాలు రావిశాస్త్రి కథలేం రాయలేదు. చిన్నప్పుడు కథలు రాయాలనే సరదా ఉండేదని, బాగా రాయగలనని కూడా అనుకుంటూ ఉండేవాణ్ణని, కాని తరువాత తన కథలపైన తనకే నవ్వు వచ్చి రచనాప్రయత్నం మానేశానని ఆయన స్వయంగా చెప్పుకున్నాడు. పెళ్లయిన తరువాత తాను కథలు రాసే సంగతి ఒకసారి భార్యకు చెప్పుకున్నాడట. తను

కథలు రాయగలననే విషయం వింతగా తోచి 'ఓ కథ రాయకూడదూ!' అని రోజా అడుగుతుండేదట. ఆమె గురించే తాను తిరిగి కథలు రాయడంలో పడ్డానని రావిశాస్త్రి అంటాడు. ఆ తరువాత రాసిన కథలు ఆమె చదవడం కోసమే రాశానని కూడా అంటాడు. అలా రాసిన కథల్లో 'దయ్యాలకు ద్వేషాల్లేవు' అన్న కథ ఒకటి. మత కలహాలు వస్తువుగా రాసిన కథ అది. మనుష్యులు ద్వేషాలు వదలరని, మనుషులకంటే దెయ్యాలే నయమని ఆ కథలో నీతి. అలా పాదాపీదాగా పునఃప్రారంభం అయిన ఆయన రచనా వ్యాసంగం సామాజిక స్పృహని సంతరించుకొని, క్రమంగా మార్క్సిస్టు దృక్పథాన్ని కూడా జోడించుకొని డెబ్బయ్యవ పడిలో కొంతకాలం తప్ప జీవితం చివరిదాకా సాగింది. ఎదిగింది. తెలుగు సాహిత్యంలో రావిశాస్త్రికి ప్రత్యేక స్థానాన్ని సంతరింపజేసింది.

రావిశాస్త్రి రచనల్లో కథలు, నవలలు, నాటకాలు, సాహిత్య వ్యాసాలు, ఇతర రచయితల రచనలకు ముందు మాటలు, సంపాదకీయాలు, కరపత్రాలు, రాజకీయ రచనలు, పత్రికలలో 'కాలం' రచనలతోపాటు ఎలిజీలు కూడా ఉన్నాయి. ఆయన వచనంలో కవిత్వంలా సాగే భాగాలు 'ఎన్నెలో ఎన్నెల' కవితా సంకలనంగా వచ్చింది. రావిశాస్త్రి వివిధ పత్రికలలో రాసిన కథలన్నీ వివిధ సంకలనాలుగా వచ్చాయి. 1941 వరకు రాసిన కథలను వదిలేసి సంకలనాలలో వచ్చిన కథలను లెక్కవేస్తే సుమారు అరవైనాలుగు కథలు తేలాయి. మిత్రులకు మాత్రం చెప్పి రాయకుండా ఉండిపోయిన కథలెన్నో. మధ్యతరగతి మనస్తత్వాన్ని చిత్రించడంతో ప్రారంభమైన ఆయన నవలారచన బడుగువర్గాల జీవితాన్ని చిత్రిస్తూ విస్తరించింది. రావిశాస్త్రి నవలలు మొత్తం ఎనిమిది. నాటకాలు మూడు. ఆయన వ్యాసాలు, సంపాదకీయాలు మొదలైన కల్పనా సాహిత్యేతరమైన రచనలన్నీ 'రావిశాస్త్రీయం' పేరిట సంకలనంగా వచ్చాయి. చివరి రోజులలో 'ఏడోచంద్రుడు' అన్న రచన ప్రారంభించాడు. మొదటి విడత 'రచన' అన్న సాహిత్య మాసపత్రికలో పడింది. రెండో విడత రాకుండానే రావిశాస్త్రి తనువు చాలించాడు. శాస్త్రి సప్తమినాడు పుట్టాడు. అందువల్ల తను రాయదలచుకున్న రచనకి 'ఏడో చంద్రుడు' అని పేరు పెట్టాడు. తన బాల్య జీవితం మొదలుకొని తనకు హితులు, సన్నిహితులు అయినవారిని గురించి ఇందులో రాయదలచుకున్నానని మిత్రులతో చెప్పాడు. చివరి రోజులలోనే ఆయన చిన్నప్పుడు రాసుకున్న డైరీలు, జాస్మిన్ పేరుతో రాసిన 'ఆడదాని సాహసం' నవల చిత్తుప్రతి పాతకాగితాల్లో మిత్రులకు దొరికాయి. డైరీలు రెండు మూడు నెలల పాటు 'రచన'లో వచ్చాయి. 'ఆడదాని సాహసం' నవల కూడా ఆ పత్రికలోనే (ఈ పుస్తకం రాస్తున్ననాటికి) సీరియల్‌గా వస్తున్నది. బహుశా అది రావిశాస్త్రి తొలి నవల అయి ఉండాలి.

రావిశాస్త్రి స్కూల్లో ఉన్ననాడే ఇంగ్లీషు నవలలు విరివిగా చదివేవాడు. రష్యన్ రచయిత చెహోవ్, ఇంగ్లీషు రచయిత డికెన్స్ ఆయన అభిమాన రచయితలు. డికెన్స్ అంటే ఆయనకు ఆరాధన. "దేవుడంటే ఎవడైనా ఉంటే అతడు డికెన్సే. 'లా ఈజ్ ఎన్ ఏస్' అన్నవాడు నిజంగా దేవుడే" అంటాడు రావిశాస్త్రి. న్యాయవ్యవస్థ మీద తన అనుభవాలు డికెన్స్ వ్యాఖ్యకు దగ్గరగా ఉన్నాయి. జీవితంలో మంచి మనుషుల్నీ, చెడు మనుషుల్నీ కళ్లకు కట్టినట్టు చార్ల్స్ డికెన్స్ చూపించాడని ఆయన అభిప్రాయం. వోడ్‌హౌజ్ నవలలు కూడా చాలా చదివాడు. రావిశాస్త్రికి డికెన్స్, చెహోవ్‌లాంటి వారి రచనలు ప్రేరణనిచ్చాయి. కాని రచనా విధానం, శిల్పం రావిశాస్త్రి సొంతం. రావిశాస్త్రిది ప్రత్యేకమూ, విశిష్టమూ, స్వతంత్రమూ అయిన శైలి.

తెలుగులో గురజాడ, శ్రీశ్రీ రావిశాస్త్రికి అభిమాన రచయితలు. శ్రీశ్రీ తనను ఉగ్రూతలూగిస్తే, గురజాడ ప్రభావితం చేశాడు అంటాడు. గురజాడ కన్యాశుల్కం ప్రభావం మాత్రం రావిశాస్త్రిమీద కనిపిస్తుంది. వ్యక్తుల స్వభావాలను, ప్రవర్తనను, మాటతీరును చాలా నిశితంగా పరిశీలించడం గురజాడకు లాగే రావిశాస్త్రికి కూడా అబ్బింది. కన్యాశుల్కం ప్రభావం ఆయన కథలపైననే ఎక్కువగా కనిపిస్తుంది. కన్యాశుల్కం వంటి నాటకాన్ని దేవతలు తప్ప రాయలేరని భావించేవాడు రావిశాస్త్రి. 'కన్యాశుల్కం చదివి ఉండకపోతే సారాకథలు రాసి ఉండేవాణ్ణికాదు' అని కూడా అంటాడు. తాను రాసేటప్పుడు శ్రీశ్రీ, కొడవటిగంటి కుటుంబరావు, కాళీపట్నం రామారావులను పాఠకులుగా దృష్టిలో పెట్టుకొని రాసేవాణ్ణని అంటాడు. శ్రీశ్రీ 'ఋక్కులు' కవితలో ఏదైనా కవితామయం కాగలుగుతుందని చెప్పి నిర్దేశించిన తొమ్మిది వస్తువులను తీసుకొని వాటిని ఎనిమిది కథలుగా, ఒక నవలగా మల్చాడు రావిశాస్త్రి.

మొదట తనకు కవిత్వం రాయాలని ఉండేదనీ, మహాకవుల స్థాయిలో కవిత్వం రాయలేనని తెలిసి వచనంలోకి దిగాననీ, 'తానొక ఫెయిల్డ్ పొయెట్' అని రావిశాస్త్రి చెప్పుకున్నాడు. కాని వచనానికి కవిత్వ స్థాయి తీసుకువచ్చినవాడు శాస్త్రి. వచనానికి, కవిత్వానికి మధ్య ఆయన సరిహద్దులు చెరిపేశాడని విమర్శకులంటారు. 1965లో రాసిన 'ఎందుకు రాసేను?' అన్న వ్యాసంలో తన రచన పరిణామక్రమాన్ని సవివరంగా ఆయన తెలియజేశాడు. తాను సన్నిహితంగా చూసి పరిశీలించి అర్థం చేసుకున్న వస్తువు, జీవితం సారాంశరూపంలో ఆయన రచనల్లో కనిపిస్తాయి. "నేనెప్పుడూ చూసింది చూసినట్టు రాయనేలేదు. టిపికల్ పాత్రల్ని ఎంచుకొని రాశాను. నేను జనం మాటలు నోట్ చేసుకోను. వాళ్లెలా మాట్లాడతారో, వాళ్ల వ్యక్తీకరణ ఎలా ఉంటుందో గ్రహించి రాస్తా. అలాగే నేను డబ్బు కోసమో, మరేదో ప్రయోజనం కోసమో నా పుస్తకాలు అంకితం ఇవ్వలేదు.

నా బంధువులకి, నా స్నేహితులకి మాత్రమే ఇచ్చేను" ఇదీ రావిశాస్త్రి సాహిత్య జీవితం. "ప్రజలకు, పేద ప్రజలకు పనికొచ్చే రచనలు నాకు బాగా నచ్చుతాయి. రచయితలు ప్రజల పక్షం వహించాలి. వారిని సమర్థిస్తూ రాయాలి" అన్నది ఆయన నినాదం.

# 3. రచనా ప్రపంచం

1949 తరువాత రావిశాస్త్రి కథలు వివిధ పత్రికలలో ముద్రితమయ్యాయి. ఆ తరువాత అవి సంకలనాలుగా వచ్చాయి. వీటిలో తొలి కథలు చాలా వరకు జాస్మిన్ పేరుతో వచ్చాయి. 'ఆరుసారో కథలు' సంకలనంలో మెరుపు మెరిసింది (1951), విలువలు (1949/50), కిటికీ (1953), జరీ అంచు తెల్లచీర (1953), ఇద్దరు పిల్లలు (1954), నీడలు (1954) అన్న ఆరు కథలు ఉన్నాయి. ఇది మొదటి భార్య శ్రీమతి లక్ష్మీసోదెమ్మకి అంకితం. 'ఆరుచిత్రాలు' (1963)లో, అధికారి (1959), కష్టార్జితం (1950), మామిడిచెట్టు (1961), లక్ష్మి (1955-56), ఆకలి (1961), ' "మంచి" "చెడ్డ"ల్లో ఏ కథ' (1962) అన్న కథలున్నాయి. ఇది తల్లిదండ్రులు సీతామహాలక్ష్మి, నారాయణమూర్తులకు అంకితం. 'మరో ఆరు చిత్రాలు' లో ఆఖరిదశ (1950), కోర్టుకు రాని సాక్షులు (1952), కార్నర్ సీటు (1953), మగవాడు-ఆడమనిషి (1953), పువ్వులు (1955), మూడు స్థలాల్లో (1954/55) కథలున్నాయి. ఇది ఆప్తమిత్రుడు, లాయరు శ్రీగణపతిరాజు అచ్యుతరామరాజుకి అంకితం. 'ఆరు సారో కథలు', 'మరో ఆరు చిత్రాలు' కథలన్నీ రాచకొండ విశ్వనాథశాస్త్రి కథల పేరిట కూడా అచ్చయినాయి. 'ఆరోసారో కథలు' 'మరో ఆరు చిత్రాలు' కథలలో 'నీడలు', 'మూడుస్థలాల్లో' తప్ప తక్కిన పదికథలు 'రాచకొండ విశ్వనాథశాస్త్రి కథలు' పేరిట 1963లోనే సంకలనంగా వచ్చింది. దానికే 1965లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు వచ్చింది.

'ఆరు సారా కథలు'లో పాపి, మాయ, న్యాయం, మోసం, పుణ్యం, మోక్షం అన్న కథలున్నాయి. ఈ కథలు విశాలాంధ్ర దినపత్రిక ఆదివారం సారస్వతానుబంధంలో 1961వ సంవత్సరం ఏప్రిల్, మే నెలలలో వరుసగా వచ్చాయి. ఈ ఆరుకథలలోను ప్రధానమైన వస్తువు సారా, సారా వ్యాపారం, ఈ పద్మవ్యూహంలో తమకు తెలియకుండానే చిక్కుకుపోయిన అలగాజనం. రావిశాస్త్రి మహాకథా రచయితగా నిలబడడానికి తక్కిన రచనలు లేకపోయినా 'సారా కథలు' చాలు. ఈ కథలకి ప్రస్తుత రూపం రావడానికి రెండు మూడుసార్లు తిరగ రాయాల్సి వచ్చింది. సమగ్రత వచ్చేంతవరకు రచనను తిరగ రాయడం గురజాడ ఒరవడి. ఈ కథలు రాయడం ప్రచురించడంలో వాసిరెడ్డి వెంకటప్పయ్య ప్రోత్సాహం ఉంది. ఈ కథల్ని విశాలాంధ్రలో చదివి శ్రీశ్రీ "I was amused and bemused" అని ఉత్తరం రాశాడు. సారా కథల్ని పరిచయం చేస్తూ శ్రీశ్రీ రసన అన్న సాహిత్యాస్వాదన భావనను ప్రవేశపెట్టాడు. 'ఆరుసారా కథల'ను మిత్రుడూ, డెంటిస్టూ అయిన రౌతు సింహాచలానికి రావిశాస్త్రి అంకితం చేశాడు.

'బాకీ కథలు' (1972) సంకలనంలో పిపీలికం (1969), వెన్నెల (1967), పక్కింటి అబ్బాయి (1967), బుద్బుదం (1968), తప్పు (1968), జాతకకథ (1968), పాతదే కథ (1968), బెదురు (1968), షోకుపిల్లి (1971), వేతనశర్మ కథ (1971), ద్వైతాద్వైతం (1970), రవ్వ (1979) అన్న పన్నెండు కథలున్నాయి. బాకీ కథలకి చిత్రమైన చరిత్ర ఉంది. విశాఖ రచయితల సంఘం నడిపిన 'విశాఖ' అనే పత్రిక ఆంధ్రజ్యోతి పత్రిక ప్రెస్‌లో అచ్చయ్యేది. రావిశాస్త్రి మిత్రుడు బ్రహ్మ సామాజికుడు, విశాఖ రచయితల సంఘం ప్రముఖ కార్యకర్త ఎమ్.జి.కె.మూర్తి పత్రిక ప్రచురణ బాధ్యతలు వహించాడు. ప్రచురణకు సంబంధించిన డబ్బును అతను ఇవ్వలేకపోయాడు.తరువాత చనిపోయాడు. ఆ బాకీ తీర్చడానికి రావిశాస్త్రి ఆంధ్రజ్యోతికి ఈ కథలు రాసిపెట్టాడు. అందువల్ల ఈ కథలకి బాకీ కథలని పేరుపెట్టారు. బాకీ కథల సంకలనం జూనియర్ మిత్రుడు శ్రీరంగం రాజేశ్వర రావుకి అంకితం.

'కలకంఠి' (1969) సంకలనంలో సృష్టిలో (?), నల్లమేక (1953), సూరిబాబు నవ్వు (?), ది స్మోకింగ్ టైగర్ అను పులివూజ (1965), ముగ్గురు గుమాస్తాల కథ (1963), ఎండ (1963), వర్షం (1959), కలకంఠి (1969), సైగల్ (1954) అన్న తొమ్మిది కథలు ఉన్నాయి. వీటిలో కలకంఠి అన్న కథ విశాఖ రచయితల సంఘం 'ఓ పేదవాడూ ధనికుడూ ఒకే స్త్రీని కాంక్షించడం' అన్న ఇతివృత్తంపైన కథ రాయమని సభ్యులలో పోటీ పెట్టినప్పుడు రాసిన కథ. మిత్రుడు, బంధువు అయిన పోపూరి శ్రీకృష్ణమూర్తికి ఈ సంకలనం అంకితం.

శ్రీశ్రీ 'ఋక్కులు' కవితలో చెప్పిన వస్తువులు అగ్గిపుల్ల, కుక్కపిల్ల, సబ్బుబిళ్ల, రొట్టెముక్క, బల్లచెక్క, అరటి తొక్క, తలుపుగొళ్లెం, హారతిపళ్లెం శీర్షికలుగా ఎనిమిది కథలు రాశాడు రావిశాస్త్రి. 1962-65 సంవత్సరాల మధ్య 'యువ' మాస పత్రికలో ఇవి వరుసగా వచ్చాయి. తొమ్మిదవ వస్తువు 'గుర్రపుకళ్లెం'(1973) మాత్రం నవలగా వచ్చింది. ఎనిమిది కథలూ 'ఋక్కులు' (1973) అనే పేరుతోనే సంకలితం అయ్యాయి. ఇది మహాకవి శ్రీశ్రీకి అంకితం. 1995లో రాచకొండ ప్రచురణలు వరుసలో కూడా ఈ సంకలనం వచ్చింది.

'ఓ మంచివాడి కథ' (1982) సంకలనంలో ఓ మంచివాడికథ (1964), అలనాటి డాన్(జు)వాన్ (1975), ఈ ప్రేమలోకంలో (1972), గుంటూరు (1953), ఉదయం (1957), రచ.ఇ.త(1968), కొంగల దేముడు (1972), రక్షకులు(1957), ఈ ప్రశ్నకెవ్వరూ జవాబు చెప్పరు(?) అన్న తొమ్మిది కథలు న్నాయి. ఈ సంకలనం రెండవ భార్య రామం, కొడుకులు లక్ష్మీ నారాయణ ప్రసాద్, ఉమాకుమారశాస్త్రిలకు అంకితం.

రాచకొండ ప్రచురణల పేరుతో ఆరుసారా కథలు, ఆరుచిత్రాలు, ఆరు సారో కథలు, మరో ఆరుచిత్రాలు కథలన్నీ ఒక సంపుటంగా 1995లో ప్రచురితమయ్యాయి. రాచకొండ ప్రచురణలు పేరుతోనే బాకీ కథలు, కలకంఠి, ఓమంచివాడి కథ, మరోరెండు కథలు వెలుగు (1954), అభాగిని లలిత(?) కలిపి ఒక సంపుటంగా వచ్చాయి.

రావిశాస్త్రి 'స్వాతి' పత్రికలో 1978లో పొట్టి పిట్టకథలు కొన్ని రాశాడు. ఈ కథలలో కూడా ఇతర రచనలలో కనిపించే వస్తువులే ప్రధానంగా కనిపిస్తాయి. ప్రతికథకిందా గూఢచారి 666 అన్న సంకేతం ఉంటుంది. ఆకలి, అహింస, ప్రభుత్వ విధానాలైన కుటుంబ నియంత్రణ, మనిషి స్వార్థం, క్రౌర్యం, దోపిడీ, భగవంతుడిపేర జరిగే అన్యాయాలు మొదలైన అనేక విషయాలను వ్యంగ్యం గాను, సూటిగాను చెప్పిన కథలివి. జీవితపుటంతరాంతరాల్లోకి వెళ్లి రహస్యాలను బయటకి తీసిన గూఢచారిగా రావిశాస్త్రి ఈ కథల్లో కనిపిస్తాడు.

'ఆడదాని సాహసం' రావిశాస్త్రి మొదటి నవల అని చెప్పవచ్చు. 'అల్పజీవి' రావిశాస్త్రికి పేరు తెచ్చిన మొదటి నవల. మొదట శాస్త్రి దీనికి పెట్టిన పేరు 'అయ్యారే బాబారే'. దాన్ని భారతి పత్రికకు పంపాడు. భారతిలో వి.డి.ప్రసాదరావు అనే సబ్ ఎడిటర్ 'We have been following your stories with quite some interest' అని ప్రోత్సహిస్తూ ఉత్తరం రాశాడు. ఈ నవల 'అల్పజీవి' పేరుతో భారతి మాసపత్రికలో 1953లో నాలుగు నెలలు సీరియల్‌గా అచ్చయింది. అది రాచకొండ విశ్వనాథశాస్త్రి పేరుతోనే వచ్చింది. తెలుగు సాహిత్యంలో రావిశాస్త్రి స్థానాన్ని పదిలం చేసిన నవల అల్పజీవి. ఈ నవల శ్రీశ్రీ

వంటి వారిని ఆకర్షించింది. ఈ నవల వచ్చిన తరువాత వారి మధ్య పరిచయం, సాన్నిహిత్యం ఏర్పడింది.

రావిశాస్త్రి రెండవ నవల 'రాజు-మహిషి' మొదట 'జయశ్రీ' పత్రికలో 1967-68మధ్య సీరియల్‌గా వచ్చింది. 1971లో పుస్తక రూపంలో వచ్చింది. ఇది అసంపూర్ణం. అసంపూర్ణమైనా క్లాసిక్‌గా గుర్తింపు పొందిన నవల ఇది. నిబద్ధుడుగా ఎదిగి, నిలిచిన రావిశాస్త్రి ఈ నవలలో కనిపిస్తాడు. ఆర్థిక, రాజకీయ, సామాజిక, న్యాయవ్యవస్థలపైన స్పష్టమైన, సమగ్రమైన అవగాహన, అట్టడుగు ప్రజలపైన రాజీలేని పక్షపాతం 'రాజు-మహిషి' నవలలో కనిపిస్తుంది. ఈ నవల రచనా కాలానికి విప్లవ రాజకీయాలకు నిబద్ధుడయ్యాడు రావిశాస్త్రి. ఈ నవలను అంకితం చేసిన పద్ధతి దీన్ని స్పష్టం చేస్తుంది. "ప్రజా సేవకులూ, పీడిత ప్రజానాయకులూ, వీరులూ, అరివీర భయంకరులూ, విమల హృదయులూ, త్యాగమూర్తులూ అయిన వెంపటాపు సత్యనారాయణ, ఆదిభట్ల కైలాసం, సుబ్బారావు పాణిగ్రాహి, పంచాది కృష్ణమూర్తి, పంచాది నిర్మల, తామాడ గణపతిగార్లకీ, 'నరుడో భాస్కరుడికీ', వారితో సముడూ, సమాన హృదయుడూ సచ్ఛీలుడూ అయిన శ్రీడబ్బీరు నాగభూషణ పట్నాయక్‌గారికీ భక్తితో అంకితం"...... "తప్పులైతే అందరూ చేస్తారు, త్యాగాలు మాత్రం కొందరే చేస్తారు" అన్న నినాదం ఈ అంకిత వచనంలోనే ఉంది.

నవలా శిల్పంలో కూడా రావిశాస్త్రి ముద్రను స్థిర పరచింది 'రాజు-మహిషి'. సంక్లిష్ట కథన శిల్పం, దేనికది ప్రత్యేక నమూనా అయిన పాత్ర కల్పన, జీవితాన్నే చదువుతున్నామనిపించే సంభాషణలు, సన్నివేశాలను, పాత్ర స్వభావాలను విశదపరచే వర్ణనలు, అలంకారాలు మొదలైన రావిశాస్త్రి రచనాశిల్పానికి 'రాజు-మహిషి' ప్రతినిధిగా నిలుస్తుంది. పూర్తికాకపోయినా ఇది గొప్ప నవలల కోవలోకి చేరిపోయిందని, క్లాసిక్ రచనగా నిలుస్తుందని శ్రీశ్రీ ఈ నవలకు 'అపరిచయం' రాశాడు.

'గోవులొస్తున్నాయి జాగ్రత్త' (1973) నవలకు 'మరిడీ మహాలక్ష్మి కథ', 'గుర్రపు కళ్లెం' అన్నవి నామాంతరాలు. శ్రీశ్రీ 'ఋక్కులు' అన్న కవితలో చెప్పిన తొమ్మిది వస్తువులలో 'గుర్రపు కళ్లెం' ఒకటి. తక్కిన ఎనిమిది వస్తువులకు ఎనిమిది కథలు రాశాడు. 'గుర్రపు కళ్లెం' మాత్రం పెరిగి పెద్దదయి నవలా రూపం ధరించింది. 'రాజు-మహిషి' అసంపూర్ణం కాబట్టి ఎలా పూర్తి అయ్యేదో తెలియదు కాని 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' మాత్రం తిరుగు బాటుతో పూర్తవుతుంది.

'రత్తాలు-రాంబాబు' నాలుగు భాగాలుగా అచ్చయిన నవల. అయినా పూర్తికాని నవల. శాస్త్రి దీన్ని మొదట సినిమా స్క్రిప్టుగా రాశాడు. ఎమర్జెన్సీలో జైల్లో ఉన్నప్పుడు అది నవలా రూపం ధరించింది. మొదట ఆంధ్రజ్యోతి వారపత్రికలో

1976-77 మధ్య సీరియల్‌గా వచ్చి సంచలనం కలిగించింది. అప్పటికే మరణించిన మిత్రులు వాసిరెడ్డి వెంకటప్పయ్య, ఎన్నెస్ ప్రకాశరావులకి ఈ నవల అంకితం. 'సొమ్ములు పోనాయండి' (1981) 'స్వాతి' మాసపత్రిక అనుబంధ నవలగా వచ్చిన అరవై పేజీల చిన్న నవల. చిన్నదైనా తనదైన విశిష్టతను సంతరించుకున్న నవల. గ్రామీణ భూసమస్యపైన ఆధారపడ్డ ఈ రచన ఇతర నవలలతో పోల్చినప్పుడు భిన్నమైన పద్ధతిలో నడుస్తుంది.

'మూడుకథలబంగారం' (1982) మరో విశిష్టమైన నవల. స్వయం సమగ్రమైనది కూడా. ఈ నవల కూడా 'ఆంధ్రజ్యోతి'లో సీరియల్‌గా వచ్చింది. మానవ జీవితాన్ని నడిపిస్తున్న, శాసిస్తున్న డబ్బు కరాళ నృత్యాన్ని, వికృత రూపాన్ని బీభత్సంగా చిత్రించిన నవల ఇది. వాస్తవ జీవితాన్ని ఉత్కంఠ భరితంగా చిత్రించిన నవల కూడా ఇది. సన్నిహితులు, హితులు అయిన తుమ్మల వేణుగోపాలరావు, చలసాని ప్రసాద్‌లకు ఈ నవల అంకితం ఇల్లు (1993) రావిశాస్త్రి చివరి రోజులలో రాసింది. మొదట 'స్వాతి' వారపత్రికలో సీరియల్‌గా వచ్చింది. ఇది పుస్తక రూపంలో రాకముందే రావిశాస్త్రి మరణించాడు. 'ఆస్తి' అన్న భావన చుట్టూ తిరిగే ప్రతీకాత్మక నవల 'ఇల్లు'. ఈ నవలను ప్రొఫెసర్ టి.హనూరావుగారి కుమార్తె రమాజ్యోత్స్నకు, తన రెండవ భార్య రామానికి అంకితం చేశాడు. నవల అచ్చయ్యే కాలానికి ఇద్దరూ మరణించారు. 'ఏడోచంద్రుడు' ఆయన మరణంవల్ల తొలి విడతతోనే ఆగిపోయింది.

రావిశాస్త్రి రూపకాలు మూడు. నిజం, తిరస్కృతి నాటకాలు. విషాదం నాటిక. 'నిజం' (1962) ఆరు అంకాల నాటకం. 'ఈ వ్యవస్థలో పేదవాడికి న్యాయం దొరకడం కష్టం' అని ఈ నాటకం ద్వారా రావిశాస్త్రి చెప్పదలచుకున్నాడు. సుమారుగా వందసార్లు ఈ నాటక ప్రదర్శన జరిగింది. గురజాడ కళాకేంద్రం సభ్యులకు ఈ నాటకం అంకితం. 'తిరస్కృతి' నాలుగు అంకాల నాటకం. ఇది 1957 మార్చి, ఏప్రిల్ నెలల భారతిలో 'వచ్చేకాలం' అనే పేరుతో అచ్చయింది. విడిగా 'తిరస్కృతి' అన్న పేరుతో 1964లో అచ్చయింది. ఈ నాటకం కూడా చాలాసార్లు ప్రదర్శితమైంది. స్త్రీపురుష సంబంధాలు, స్త్రీపురుషాధిక్యసంస్కృతిని ఎదుర్కోవడం 'తిరస్కృతి' నాటకంలో వస్తువు. ఇది మిత్రుడు, కీర్తిశేషుడు బొడ్డు లక్ష్మణరావుకి అంకితం. విషాదం 'సాహితి' మాస పత్రికలో 1962, 63 సంవత్సరాలలో సీరియల్‌గా వచ్చింది. 1969లో విడిగా అచ్చయింది. సాటివాళ్ల బతుకులోని విషాదాన్ని తోటివాళ్లు గుర్తించలేకపోవడం అన్న విషయాన్ని ఒక యువతి విషాద జీవితం ఆధారంగా చిత్రించడం ఈ నాటికలోని ప్రధాన వస్తువు. మిత్రుడు, నటకోవిద చాగంటి సన్యాసిరాజుకి అంకితం.

రావిశాస్త్రి తనను గురించి రాసుకున్న వ్యాసాలు, కథానిక మొదలైన

అంశాలపైన రాసిన వ్యాసాలు, అనుభవాలు, సంపాదకీయాలు, పత్రికలలో ప్రత్యేక శీర్షికలుగా రాసిన రచనలు, వివిధ రచయితల రచనలకు ముందు మాటలు, రాజకీయ ప్రకటనలు, వ్యాసాలు, ఇతర వచన రచనలు, ఎలిజీలు 'రావిశాస్త్రీయం' పేరుతో సంకలనంగా విరసం ప్రచురించింది. మరికొన్ని చేర్చి అనంతం 1982లో పునర్ముద్రించాడు. సృజనాత్మక రచనలలో లాగే ఈ వచన రచనలలో కూడా రావిశాస్త్రి ప్రత్యేక శైలి ప్రదర్శితమవుతుంది. ఈ సంకలనం ప్రముఖ విప్లవ కవి, చాలా కాలం జైల్లో ఉండి బ్రైన్ కాన్సర్‌తో మరణించిన చెరబండరాజుకి అంకితం.

# 4. కథాలోకం

1949 తరువాత రాచకొండ విశ్వనాథశాస్త్రి రాసినవి, సంకలనాల రూపంలో వచ్చినవి మొత్తం అరవై నాలుగు కథలున్నాయి. ఇటీవలే లభించిన 'ఆడదాని సాహసం'తో పాటు ఎనిమిది నవలలున్నాయి. సాధారణంగా చాలా గొప్ప రచయితలుగా పేరుపొందిన వారి రచనల సంఖ్యలతో పోలిస్తే ఇవి చాలా తక్కువే. ఆ మాటకు వస్తే ఆధునిక తెలుగు సాహిత్యానికి నవయుగ వైతాళికుడుగా చెప్పుకునే గురజాడ రచనల పరిమాణం కూడా తక్కువే. కాని గుణాత్మకంగా చూచినప్పుడు ఇద్దరి రచనలూ తెలుగు సాహిత్యంలో అగ్రశ్రేణికి చెందుతాయి. వీరి ప్రతి రచనా చక్కగా చెక్కిన శిల్పంలా నిలుస్తుంది. వీరి రచనల ప్రతి పఠనమూ కొత్త అర్థాలనిస్తుంది. కొత్త అనుభవాల కాంతిపేటికలను తెరుస్తుంది. 'సాహిత్య రంగంలో ఇప్పుడు నేను కావిస్తున్న కృషికి సమతుల్యమైన కృషి భారతదేశంలో మరెక్కడా కనిపించదు' అంటాడు గురజాడ. అలాగే రావిశాస్త్రి కథలకి, నవలలకి వస్తురీత్యా, శిల్పరీత్యా సమకాలిక భారతదేశ సాహిత్యంలో ప్రత్యేకత ఉందని గట్టిగా చెప్పవచ్చు. గురజాడ మేధావి. ఆయన రచనా పద్ధతిలో సంయమనం ఎక్కువ. నిరాడంబర, నిరలంకార శైలి ఆయనది. వ్యంగ్యం ఆయన శైలికి అలంకారం. రావిశాస్త్రి రచనా పద్ధతిలో ఉద్వేగం ఎక్కువ. విషాదాశ్రువులు, కన్నీటి జలపాతాలు, ఆక్రోశాల సముద్ర ఘోషలు, నిర్వేదపు లోతులు రావిశాస్త్రి రచనల్లో భాషారూపాన్ని తొడుక్కొని దర్శనమిస్తాయి. ఇద్దరూ భిన్న చారిత్రిక కాలాలకు సంబంధించినవారు కావడం, వస్తు భేదం, విస్తృతి వీరి

రచనా పద్ధతిలో భేదానికి కారణం కావచ్చు. కన్యాశుల్కం బీభత్స రసప్రధాన నాటకం అన్నారు విమర్శకులు. ఈ వ్యాఖ్య అంతకంటే ఎక్కువగా రావిశాస్త్రి చాలా రచనలకు అన్వయిస్తుంది. గురజాడ సంధిదశలో పైస్థాయి జీవితంలోని బీభత్సాన్ని దర్శించాడు. రావిశాస్త్రి జీవితం అట్టడుగు స్థాయిలో విషాదకర బీభత్సాన్ని చూశాడు. అటువంటి జీవితాన్ని చూసిన హృదయమున్న వారెవరైనా చలించక, తీవ్రంగా స్పందించక మానరు. ఈ తీవ్రస్పందనే రావిశాస్త్రి రచనాశైలికి రూపం ఇచ్చింది.

రావిశాస్త్రి కొన్ని నవలలతో పోలిస్తే ఆయన కథానికలు స్వయం సమగ్రాలు. నవలల్లో లాగా కథానికలలో సన్నివేశాలు, పాత్రలు, వర్ణనలు అదుపు తప్పిపోవు. ఆద్యంతాలు, కథనరీతులు, సంభాషణలు, పాత్రలు, వర్ణనలు మొదలైన విషయాలలో కథ ఎన్ని రకాల పోకడలు పోగలదో అన్ని రకాల పోకడలూ ఆయన కథలలో కనిపిస్తాయి. ఏవో కొన్ని పెద్ద కథలు తప్ప సంక్షిప్తత, సాంద్రత రావిశాస్త్రి కథల ప్రత్యేక లక్షణాలు. ఈ లక్షణాలే ఆయన కథలను కావ్యస్థాయికి తీసుకొని వెళ్లాయి. ఆయన కథాశిల్పం పరిణామక్రమంలో జీవితాన్ని గురించిన అవగాహనతోపాటు, బలపడుతూ వచ్చిన నిబద్ధతతోపాటు మెరుగుదేరుతూ వచ్చిందేకాని తరగలేదు. ఒక్కొక్క కథను గురించీ ప్రత్యేకమైన విమర్శ వ్యాసాలు వచ్చాయంటే ఆయన కథలకున్న శక్తిని ఊహించవచ్చు. 1949 తరువాత తొలిదశలో రాసిన కథలలో మధ్యతరగతి జీవితం, ఉదాసీన తాత్త్విక దృక్పథం, సాదాసీదాగా ఉండే కథనపద్ధతులు ఉంటాయి. రెండవ దశలో న్యాయాన్యాయాలు, ధర్మాధర్మాలు, సంప్రదాయతాత్త్వికభావాలను విమర్శనాత్మకంగా చూడటం, స్పష్టమైన సామాజిక స్పృహ కనిపిస్తాయి. తరువాత దశలో మరీ ముఖ్యంగా ఆరుసారా కథలతో జీవితపు లోతుల్లోకి, సమాజపు చీకటికోణాల్లోకి ఆయన కథ ప్రవేశించింది. ఆధునిక బూర్జువా రాజ్యం, రాజ్యాంగం, పరిపాలనాయంత్రాంగం, న్యాయవ్యవస్థ సామాన్యుల జీవితాన్ని ఎంతగా సంక్లిష్టం చేసిందో, దయనీయంగా మార్చిందో ఈ కథలలో చెప్పడానికి రావిశాస్త్రి ప్రయత్నం చేశాడు. ఆ తరువాత వచ్చిన కథలలో మార్క్సిస్టు అవగాహన, విప్లవస్ఫూర్తి, శ్రామికపక్షపాతం స్పష్టంగా కనిపిస్తాయి. అయితే ఎక్కడా సిద్ధాంత పరిభాష ఏరికోరి తెచ్చుకొని రాసినట్టు మాత్రం కనిపించదు. ఆయన కథావస్తువులన్నీ జీవితంనుంచి, అనుభవంనుంచి వచ్చినవి. సైద్ధాంతిక అవగాహన జీవితాన్ని తరచి చూడడానికి పరికరంగా ఉపయోగించింది. అనుభవం దృక్పథానికి పదును పెట్టింది. ఆయన ఒక్కొక్క కథా అనర్ఘరత్నం. కొన్ని కథలు అమోఘమణులు.

స్థూలంగా కాలక్రమాన్ని, కథావస్తువుని దృష్టిలో పెట్టుకొని రావిశాస్త్రి కథలని పరిచయం చేసుకుందాం.

## తొలి కథలు - కొన్ని మలికథలు

'మెరుపు మెరిసింది' కథలో నీరజ ప్రైవేట్ స్కూల్లో టీచరు. పెళ్లి చేసుకోవడానికి, పై చదువు చదవడానికి డబ్బు, స్తోమత లేక ఇంటర్ పాస్ కాగానే స్కూల్లో టీచర్‌గా చేరుతుంది. ఆమెకి ముప్పై అయిదేళ్లు. ఒక రోజున స్కూలుకి బయలుదేరగానే పెద్ద వర్షం. స్కూల్‌కి ఆలస్యం అవుతుందేమోనని భయపడుతుండగా నలభై యేళ్ల యువకుడు బస్‌స్టాండ్ దగ్గర నీరజకు కారులో లిఫ్ట్ ఇస్తాడు. మరుసటి రోజు కూడా అలాగే లిఫ్ట్ ఇస్తాడేమోనని ఆశపడుతుంది నీరజ. కాని రెండో రోజు ఆ యువకుడు నీరజను చూసీచూడనట్టు కారు నడుపుకు వెళ్లిపోతాడు. అంతకుముందు అతనితో తన భవిష్యత్తును ఊహించు కున్న నీరజ నిరాశతో తన ముప్పై అయిదేళ్ల జీవితంలో ఇలాంటి ఎన్నో మెరు పులు కనిపించి మాయం కావడాన్ని తలచుకుంటుంది.

ఈ కమర్షియల్ సివిలిజేషన్లో అరఘుడియ సుఖమిచ్చినందుకుగాను మగవాడు స్త్రీకి ఇచ్చిన విలువ రూపాయిన్నర. బజార్లో ప్రతి వస్తువు కొనటానికి 'ఫిక్స్‌డ్ ప్రైసెస్' ఉన్నాయి. కాని వెలలేని దాని విలువ రూపాయిన్నర అయినా తన సహజ స్త్రీ లక్షణాలతో తనను క్షమించినట్టు కౌగిలించుకుని వెళ్లిపోతుంది ఆ స్త్రీ స్త్రీ ఔన్నత్యానికి వెలకట్టి అవమానించినందుకు కథ లోని మగవాడు తను కిందికి దిగజారిపోయినట్టు బాధపడతాడు. ఇది 'విలువలు' కథ సారాంశం. కథనంలో కాస్త చలం శైలి కనిపిస్తుంది.

'కష్టార్జితం' ఉత్తమ పురుష కథనంలో ఉన్న కథ. కొత్తగా దిగిన పక్కింటి ముసలాయనతో పరిచయం ఏర్పడుతుంది తనకు. అతనే ఇంటి యజమాని అని తెలియక ఏదో మాట్లాడి ఇబ్బందిలో పడతాడు. ఒక రోజు ముసలాయన ఇంట్లో దొంగలుపడి సమస్తం దోచుకు పోతారు. పోయిన సొమ్ముని తగ్గించి చెప్తాడు పోలీసులకు. నిజంగా పోయిన సొమ్ము ఎంతో చెప్తే ఎక్కడి నుంచి వచ్చిందనే ప్రశ్న వస్తుంది. అవినీతితో సంపాదించిన సొమ్మును తన కష్టార్జితంగా చెప్తాడు ముసలాయన. దొంగకూడా చాలాకష్టపడిచెమటోడ్చి సొమ్ము దోచుకుపోయాడు. ఈ రెండింటికి తేడా ఏమిటనేది ప్రశ్న.

'ఆఖరిదశ' చరిత్రలోని భిన్న దశలను తీసుకుని విమర్శనాత్మకంగా వ్యాఖ్యానించిన కథ. శ్రీకృష్ణుడు విష్ణువు అవతారం. రాజకీయవేత్తగా అధర్మంగా భీముడితో దుర్యోధనుణ్ణి చంపిస్తాడు. అర్జునుడితో యుద్ధం చేయిస్తాడు. అధ ర్మంతో అన్యాయకాలం దాపురించిందనుకుంటారు శైవులు. శంకరాచార్యులతో బ్రాహ్మణ మతం మళ్లీ పునరుద్ధరణ పొందింది. ఇక ప్రపంచానికి చివరి దశే అనుకుంటారు బౌద్ధులు. కాఫర్ల విజృంభణతో, తెల్లవాళ్ల ఆగమనంతో మొగల్

సామ్రాజ్యానికే కాదు ప్రపంచానికే ఆఖరి రోజులు వచ్చాయనుకుంటారు మొగల్ రాజ్యం అండతో బ్రతికినవాళ్లు. భారతదేశంలో తమ రాజ్యం పోవడంతో ఇక ప్రపంచమంతా కుక్కల, నక్కల పాలవుతుందని, ప్రపంచానికి ఆఖరి దశ సమీపించిందని అనుకుంటారు ఇంగ్లీషువాళ్లు. 'ప్రపంచం సాగుతూనే ఉంది ఇన్ని వేలసంవత్సరాలనుంచీ, ఇన్ని యుగాల నుంచీ' అన్న వ్యాఖ్యతో కథ ముగుస్తుంది.

'కోర్టుకురానిసాక్షులు' న్యాయవ్యవస్థ స్వరూపాన్ని చిత్రించిన రావిశాస్త్రి మొదటి కథ. అగ్నిసాక్షిగా పెళ్లాడిన భార్య తనతో కాపురానికి రావాలని కేసు వేస్తాడు ఒక మగవాడి. తను అసలు పెళ్లాడలేదంటుంది ప్రతివాది. వాది తరఫున పెళ్లి జరిగినట్టు పురోహితుడూ, పెద్ద మనుషులూ సాక్ష్యం ఇస్తారు. ప్రతివాదికి నిజానికి వాదితో పెళ్లికాలేదు. ఒక షావుకారు పోషణలో ఉంటూ పిల్లవాణ్ణి కూడా కన్నది ఆ షావుకారు వచ్చి ఈ విషయంలో సాక్ష్యం చెప్పలేదు. తన సాక్షిగా పెళ్లి జరగలేదని అగ్ని కూడా వచ్చి సాక్ష్యం చెప్పలేదు. వాదితో కాపురం చేయవలసిందే అని కోర్టువారి తీర్పు. ఇది ఆమెను వదిలించుకోవడానికి షావుకారు చేసిన ఏర్పాటు. ప్రతివాది కోర్టునీ, లోకాన్ని, దేవుణ్ణీ బండబూతులు తిడుతుంది. ప్రయోజనం?

'కార్నరుసీటు' కథలో అత్యవసరంగా బయలుదేరి రద్దీగా వున్న రైలు కంపార్ట్‌మెంట్‌లో కార్నర్ సీటు కోసం ప్రయత్నం చేస్తాడు రాజు. అప్పటికే పచ్చకోటు తొడుక్కున్న ఆసామీ ఒకడు అక్కడ కూర్చుని ఉంటాడు. రాజు అతణ్ణి గురించి పలు విధాలుగా ఆలోచిస్తూ చికాకు పడుతుంటాడు. పచ్చకోటు ఆసామీ మధ్యలో దిగి రైలు కింద తల పెట్టి ఆత్మహత్య చేసుకుంటాడు. ఒక కూలి మనిషి వెక్కి వెక్కి ఏడుస్తుంటే 'నీకతను ఏమౌతాడ'ని ప్రశ్నిస్తారు జనం. 'ఏమవుతాడు బాబూ? మీకేమవుతాడో నాకూ అదే అవుతాడు. నిండు ప్రాణమా మరేమన్నానా? పోతే ఏడ్పురాదూ' అని ఆమె వాళ్ళని అడుగుతుంది.

జీవితం జంక్షన్‌లో నిలబడి ఎటుపోవాలో తెలియక ఆగిపోయిన మూర్తి కథ 'మగవాడు ఆడమనిషి'. ఉద్యోగం కోసం మద్రాసు వచ్చి మేనమామ ఇంట్లో దిగిన మూర్తికి అనుకోకుండా ఒక అమ్మాయి తటస్థపడుతుంది. ఆమె పోస్ట్‌గ్రాడ్యుయేట్ విద్యార్థిని. ఒకసారి ఆమె ఉత్తరం పోస్ట్ చేసి, మరోసారి వెంటాడుతున్న పోకిరీలకు బుద్ధిచెప్పి ఆమెకు సహాయం చేస్తాడు. కృతజ్ఞతగా మూర్తిని ముద్దుపెట్టుకొని అభినందిస్తుంది ఆ అమ్మాయి. దీనితో తనమీద తనకు విశ్వాసం లేని మూర్తికి ఆత్మవిశ్వాసం ఏర్పడుతుంది. మేనమామ, మేనమామ కూతురు మూర్తిలో వచ్చిన మార్పుకి ఆశ్చర్యపోతారు.

తనకు ఆరేళ్లప్పుడు ఎవరో కట్టుకోగా చూసిన 'జరీ అంచు తెల్లచీర'మీద మోజు కలుగుతుంది విశాలాక్షికి. పదహారేళ్లు వచ్చినా ఇదిగో, అదిగో అని

అమ్మానాన్నలు చెప్పడమేకాని ఆమె కోరిక తీరదు. సంసారాన్ని కష్టంగా ఈడుస్తున్న నాన్న సంగతి ఆమెకు తెలుసు. తీరా నాన్న కష్టంమీదయినా జరీ అంచు తెల్లచీర కొనడానికి సిద్ధమయినప్పుడు ఇంటి పరిస్థితీ, జీవితాల్లోని విషాదాలు జ్ఞాపకం వచ్చి విశాలాక్షి తనకు చీర అవసరం లేదంటుంది. ఇదీ 'జరీ అంచు తెల్లచీర' కథ.

కళ్లు చూడగలవు, కిటికీ చూడలేదు కానీ చూపించగలదు. రావిశాస్త్రి ఒకరోజు అనుభవం నుంచి వచ్చిన కథ 'కిటికీ'. ఊరి చివర, రోడ్డు చివర ఎడమవైపు ఒక పాతడాబా. కుడివైపున కూలిన పెంకుటిల్లు. అంతా అంధకారం. పాతమేడ కిటికీ లోపల్నుంచి మాత్రమే వెలుతురు. రోజూ సాయంత్రం ఒక ముసలాయన కూలిన పెంకుటిల్లు వరండాలో కూర్చుని కిటికీ చూపించీ చూపించని జంట జీవితాన్ని గురించి ఊహించుకుంటాడు. చితికిపోయిన తన జీవితాన్ని తలచుకుంటున్న అతనికి కిటికీ స్వప్నాలు చూపిస్తూ ఉంటుంది. ఒక రోజు చలిగాలికి కిటికీ తలుపులు మూసుకోవడమూ, వెలుతురు పోయి ముసలాయన జీవితం ముగిసిపోవడం జరుగుతుంది.

తోటమాలినీ, డ్రైవర్నీ చుట్టూ మూగిన జనాన్ని ముప్పుతిప్పలు పెట్టి కారు ప్రమాదంలో తోటమాలి చావుకి కారణమైన 'నల్లమేక' కథ కాస్త వినోదాత్మకంగా కనిపించేదే అయినా అందులో ఉన్నత, మధ్యతరగతికి చెందిన రకరకాల జనం మీద రావిశాస్త్రి ధోరణిలో చెణుకులు చాలా కనిపిస్తాయి.

'గుంటూరు' కథలో ఒకే భాషకు చెందినవారిలోకూడా ప్రాంతీయ సంస్కృతులు, స్వభావాలలో ఉండే భేదాలు పరస్పర వైషమ్యాలకు కారణమైన తీరుని రావిశాస్త్రి చిత్రించాడు. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని విశాఖపట్నంనుంచి గుంటూరుకు మార్చారు. ఆ సమయంలో చదువు పూర్తి చేసుకోవడానికి గుంటూరు వెళ్తాడు అప్పల నరసింహం. అక్కడివాళ్లు విశాఖపట్నం జీవితాన్ని, అలవాట్లని హేళన చేస్తూ తనను చిన్నచూపు చూడడంతో గుంటూరు మీద ఘోరమైన ద్వేషం ఏర్పడుతుంది అప్పల నరసింహానికి. చివరికి బరంపురానికి చెందిన తన భార్య ఆమె తండ్రి ఉద్యోగరీత్యా గుంటూరులో ఉన్నప్పుడు అక్కడే పుట్టిందని తెలుసుకున్న అప్పల నరసింహం ఆమెను దూరం చేసుకుంటాడు. ఏదో పనిమీద బరంపురం వెళ్లిన రచయిత కటక్, బరంపురం ఒరియా సంస్కృతుల మధ్య కూడా ఇలాంటి పరిస్థితే ఉన్నట్టు గుర్తిస్తాడు.

ఒకే స్కూల్లో చదివే ఇద్దరు కుర్ర స్నేహితుల మధ్య మానసిక స్థాయిలో జరిగే మైత్రి, ఘర్షణల కథ 'ఇద్దరు పిల్లలు'. ఇరవై సంవత్సరాలు ఒక కంపెనీలో టైపిస్టుగా పనిచేసిన సూర్యం ఆ కంపెనీ మూసివేయడంతో మూడు వందల మైళ్ల

దూరంలో దొరికిన ఉద్యోగం కోసం ప్రయాణం చేయవలసి వస్తుంది. ప్రయాణం కోసం సామానులు, పాత కాగితాలు సర్దుకుంటున్న సూర్యానికి బాల్యం, విద్యార్థి దశ, తన తండ్రి జైలుకెళ్లడం, తన చదువు ఆగిపోవడం మొదలైన జ్ఞాపకాలన్నీ నీడల్లా కదలాడతాయి. ఇదే 'నీడలు' కథ. డబ్బుకోసం దేనికైనా సిద్ధపడే రామారావు, మోసాలతో డబ్బూ, ఆస్తీ పెంచుకున్న రామారావు నిర్మలమైన సైగల్ పాటలు విని పశ్చాత్తాపం చెందడం 'సైగల్' కథ ఇతివృత్తం. సైగల్ పాటలకుండే మనసును కరిగించే శక్తిని వర్ణించడానికి, సైగల్ పాటలపైన తనకుండే అభిమానాన్ని ప్రకటించడానికి రావిశాస్త్రి ఈ కథ రాసినట్టుంది. కష్టాలను ఎదుర్కోలేక సన్యాసి అయిన మనిషి నలుగురికి ఆశ్రయమిచ్చి నీడనిచ్చే మర్రిచెట్టును, స్పృహ కోల్పోయిన తనకు ప్రాణం పోసిన కాపుపిల్లని చూచి వ్యక్తి విముక్తికన్నా సంఘ విముక్తి ప్రధానమని జ్ఞానోదయం పొంది బుద్ధుడైనట్టు చెప్పిన కథ 'వెలుగు'.

పెద్దమేడను ఆనుకుని ఉన్న గెస్ట్‌హౌస్‌లో అద్దెకుంటాడు బ్యాంకు గుమాస్తా అవతారం. మేడగలవాళ్లు సంవత్సరానికి ఒకసారి ఎప్పుడో వస్తుంటారు. అవతారం పెద్దమ్మాయి కమల, తక్కిన పిల్లలు ఇంటిముందు బంతి పూల చెట్లు పెంచుతారు. పూలను వాళ్లు కోయరు. కాని ఒకసారి సెలవులకని వచ్చిన మేడగలవారి అమ్మాయి పూలన్నీ తెంపుకుంటే చూచి ఊరికే ఉండడం తప్ప ఏమీ చేయలేకపోతారు అవతారం పిల్లలు. ఇది 'పువ్వులు' కథ.

తొలిదశలో 'కోర్టుకురాని సాక్షులు'తోపాటు న్యాయ వ్యవస్థపై రాసిన మరోకథ 'మూడుస్థలాల్లో'.వరుసగా ఆడమనుషులను చంపుతున్న ఒక హంతకుణ్ణి పట్టుకోవడానికి వ్యభిచార వృత్తిలో పట్టుకున్న ఒక చిన్నమ్మాయిని ఎరగా వేస్తారు పోలీసులు. పులి చిక్కుతుందిగాని ఎరగా వెళ్లిన అమ్మాయి దక్కదు. ఆమె మరణ వాఙ్మూలంతో సెషన్ కోర్టులో హంతకుడికి ఉరిశిక్ష పడుతుంది. తరువాత కస్టడీ నుంచి తప్పించుకున్న హంతకుడు బాగా దెబ్బతిని మళ్లీ పోలీసులకి చిక్కిపోతాడు. అతణ్ణి ఎలాగైనా బ్రతికించాలని ఇన్‌స్పెక్టర్ ఆసుపత్రిలో డాక్టర్ని బతిమిలాడుతాడు. పోలీసు జవాను రక్తం కూడా ఇస్తాడు. కోలుకొని బాగుపడ్డ హంతకుడికి కోర్టు తీర్పు ప్రకారం సెంట్రల్ జెయిల్లో ఉరివేస్తారు. అతణ్ణి బతికించిన డాక్టరే అతడి ప్రాణాలు పూర్తిగా పోయాయో లేదో పరీక్షిస్తాడు. ఈ రెండు పనులు డాక్టరు డ్యూటీగానే చేస్తాడు.

'అధికారి' కథ అధికారం ఏమైనా చేయించగలదని చెప్పిన కథ. దిక్కూమొక్కూ లేని ఒక అమ్మాయిని పట్టణంలో కూలిపని చేసుకొనే నూకరాజు చేరదీస్తాడు. పోలీసు జవాను రవ్వలకొండ ఆ అమ్మాయిని ఏదో నేరంలో తోసి, తానే చెయ్యిచ్చి ఆదుకొని వశం చేసుకుంటాడు. రవ్వలకొండ చిన్నప్పుడు ఊళ్లో

కూడా నూకరాజుకి విలనే. అమ్మాయిని విడిపించడానికి తెలిసిన మేస్త్రీ సహాయం కోరితే "ఆడి (పోలీసోడి) చేతిలో పవరుంది. సేతిలో పవరుంటే నెత్తికి పొగరెక్కుతుంది. కాబట్టి పవరున్నవాడితో మనమేం చేయలే"మని చెప్తాడు. "తెల్లోడేటిచ్చాడు మనకి? ఫుల్‌పవర్స్. పులి పవర్లిచ్చేడు" ఇదీ జవాను రవ్వలకొండ ధీమా. కథలు రాయడం గురించి రచయిత వ్యాఖ్యానంతో మొదలైన ఈ కథ ప్రథమపురుషలో సాగుతుంది.

నలుగురితో సంబంధాలు లేక స్వార్థం, తన ఆస్తిపాస్తులు తప్ప మరేమీ ఆలోచించని ఒంటరికి ఒక మార్నింగ్ వాక్‌లో ఎవరో వెంటపడుతున్నట్టు భయం వేస్తుంది. నిస్సహాయుడైన అతనికి 'బతికినప్పుడు అందరితోనూ బతకాలి' అన్న జ్ఞానం కలుగుతుంది. అదే 'ఉదయం' కథ. 'రచ.ఇ.త' కథలో ఇ.త. ఇంబళూర్ తమ్మయ్య. తమ్మయ్య డాబామీద పక్కింటి అమ్మాయిమీద రాయి వేయబోతే ఆమె అమ్మాయి విధవరాలైన మేనత్తె కూర్చుంది. అంతా అల్లరి అవుతుంది. ఆయనకు కోపం ఆగదు. కథలు రాయడం అలవాటుగల తమ్మయ్య విధవరాలైన అమ్మాయి మేనత్తకి అతనిపైన ఉండే అనురాగమే కోపంగా మారినట్టు చిత్రిస్తూ కథరాసి అచ్చు వేస్తాడు. ఆ తరువాత అందరూ తననే అనుమానిస్తున్నట్టు బాధపడ్డ అమ్మాయి మేనత్త ఆత్మహత్య చేసుకుంటుంది.

సొంత ఆస్తి, అనుభవం అన్న ఆలోచన ఆధారంగా 'మామిడి చెట్టు' కథారచన జరిగింది. నీలమణి కాంపౌండులో మామిడిచెట్టు బోదె ఉంది. దానికొమ్మలూ, రెమ్మలూ పక్కఇంటి కాంపౌండ్‌లోకి, వీధిలోకి వ్యాపించి ఉన్నాయి. పక్క ఇంటి వాళ్లు చెట్టుకొమ్మలకి లైట్లు వేలాడదీసి పేకాట ఆడుకుంటుంటారు. కొమ్మకి ఉయ్యాలకట్టి ఊగుతుంటారు. వీధిలో చెట్టుకొమ్మల నీడన ముసలామె మొక్కజొన్నకంకులు అమ్ముకుంటుంటుంది. చెట్టుకొమ్మలని, కొమ్మల నీడల్ని పక్కింటివాళ్లు, ముసలామె ఉపయోగించుకోకుండా నీలమణి రకరకాల ప్రయత్నాలు చేస్తాడు. కానీ ఏమీ చేయలేమని గ్రహించి చెట్టుకొమ్మలన్నీ కొట్టించేస్తాడు. మామిడిచెట్టు ఆకర్షణతో నీలమణి ఇంటి వాటాలో అద్దెకు చేరిన కథలోని 'నేను' ఆ ఇల్లు వదిలేస్తాడు.

'లక్ష్మి' మూడు తరాల కథ. భూమే ఆస్తిగా కలిగి ఇతరుల భూములను కూడా కలిపేసుకొని భూసంపద పెంచుకుని సుఖాలను అనుభవిస్తూ జీవితాన్ని రాజభోగంతో గడిపినవాడు లక్ష్మీనాథరావు. 1910 నాటికి ఆయన చనిపోతాడు. ఆయన పోగానే మార్వాడీవారు దస్తావేజులు తీసుకొని వచ్చి స్థిరచరాస్తులన్నీ స్వాధీనం చేసుకుంటారు. కొడుక్కీ, మనవలకీ ఏమీ దక్కక దుస్థితిలోకి జారి పోతారు. లక్ష్మీనాథరావు సీనియర్ కాలంలో భూమే ఆస్తి. బ్యాంకులు, కమీషన్లు, షేర్లు ఆయన ఎరుగడు. ఆయన భూములనెలా పెంచుకున్నాడో అలాగే వాటిని

అమ్మి, అమ్మి సుఖభోగాలనుభవించి పిల్లల చేతికి చిప్ప ఇచ్చి వెళ్లాడు. 1932 నాటికి జూనియర్ లక్ష్మీనాధరావు జీవితం ప్రారంభం అవుతుంది. ఇంకొకరి శ్రమమీద బ్రతకడం చిన్నప్పటినుంచే అలవాటవుతుంది లక్ష్మీనాధరావుకి. అమాయకుడు, సహాధ్యాయి అయిన సత్తిరాజు మీద జెల్లకొట్టడం, ఏడ్పించటం మొదలైనవాటికి స్వయం దత్తమైన అధికారాన్ని సంపాదిస్తాడు. తనకు సినిమా చూడాలనే కోరిక కలిగి సత్తిరాజు ఏరుకొని తెచ్చిన పాత కాగితాలను తీసుకొని వెళ్లి అమ్ముకుంటాడు. 1962 నాటికి కాంట్రాక్టు వ్యాపారాలు, బ్యాంక్ అకౌంట్లు, షేర్ మార్కెట్లు, అమెరికన్ కారు, ఎమ్.పి, ఎమ్.ఎల్.ఎలపైన పలుకుబడి, మోస్ట్ బ్యూటిఫుల్ మోడర్న్ బిల్డింగులతో ధనస్వామ్య వర్గానికి ప్రతినిధిగా ఎదుగుతాడు. వంద నోట్లలో తప్ప క్యాష్‌ని లెక్కపెట్టడు. రచయిత అడిగే కొన్ని ప్రశ్నలతో కథ ముగుస్తుంది. "సర్! మాస్టారూ! అయ్యా! సత్తిరాజు యేమయ్యేడు? ఎక్కడున్నాడు? ఏం చేస్తున్నాడు? ఉన్నాడా అసలతనూ?". శ్రమను మదుపు పెట్టేవారు ఊరూపేరూ లేకుండా పోవడాన్ని ఈ ప్రశ్నలు జ్ఞాపకం చేస్తాయి.

'ఆకలి' కథలో తమవెంటబడ్డ బిచ్చగాడి ఆకలి కొడుకు రాజబాబుకి అర్థమైనట్టుగా మధ్యతరగతి ఉద్యోగి, తండ్రి అన్నారావుకి అర్థంకాదు. కొడుక్కి ఏదైనా కొనుక్కోవడానికి డబ్బు ఇవ్వడానికి సిద్ధమైన అన్నారావు ఆకలితో వెంటబడినవాడికి కాణీ విదల్చడు. ప్రేమించిన వాణ్ణికాక, తల్లిదండ్రుల మాట విని డబ్బున్నవాణ్ణి చేసుకొని బాధలుపడ్డ లలిత కథ 'అభాగిని లలిత'.

' "మంచి" "చెడ్డ" ' ల్లో ఏకథ కొత్త రకమైన శిల్పంతో రాసిన కథ. అందులో ప్రధాన పాత్ర 'నేను' రచయిత, కథకుడు. రావూ, మూర్తీ అతణ్ణి ఏడ్పించే చదువులో సీనియర్స్, వయసులో జూనియర్స్ అయిన మిత్రులు. రావు, మూర్తులున్న లాడ్జికి దగ్గరగా పేటలో నిప్పంటుకొని ఇళ్లు కాలిపోతాయి. దానిచుట్టూ ఇద్దరూ కథలల్లితే ఎవరు ఏ కథ రాశారో చెప్పుకోగలనంటాడు రచయిత. ప్రధాన కథలో భాగంగా ఇద్దరూ రాసిన రెండు కథలు వస్తాయి. కామయ్య కొడుకు సత్యానికి మేనమరదలు సత్యవతి అంటే ఇష్టం. సత్యవతికీ సత్యం అంటే ఇష్టం. అది ఇష్టం లేని సత్యవతి తల్లిదండ్రులు ఇంకో సంబంధం పెళ్లి ఏర్పాటు చేసి ఆమెను ధాన్యం కొట్టులో వేసి తాళం వేశారు. ఇళ్లు అంటుకున్న హడావిడిలో సత్యం సత్యవతిని బంగారంతో సహా విడిపించుకొని తీసుకొని వెళ్లిపోతాడు. ఇది ఒక కథ. ఇది 'మంచి'. మరో కథ 'చెడ్డ'లో రాజుకి అయిదుగురు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు. పెద్దమ్మాయి గంగాలు. పెళ్లయిన అల్లుడు అలుగుతున్నా ఇంకా అత్తగారింటికి పంపలేదు. డబ్బుకక్కుర్తికి, కోరికలు అణచుకోలేక హోటలాయనతో కడుపుతెచ్చుకుంటుంది గంగాలు.తల్లిదండ్రులు బాధపడ్డారు. సరిగ్గా అప్పుడే ఇళ్లంటుకుంటాయి. గంగాలు నూతిలో దూకుతుంది.

రెండు కోసుల దూరంలో ఉన్న రైల్వే స్టేషన్‌లో కలకత్తాకు వెళ్లే రైలు అందుకోవడానికి భోరున కురిసే వర్షంలో బస్సుకోసం టీకొట్టు పక్కన ఎదురు చూస్తున్న మధ్యతరగతి యువకుడు పురుషోత్తం కథ 'వర్షం' వర్షాన్ని లెక్కచేయకుండా ఎంతో దూరం నుంచి బొగ్గులు మోసుకొని వచ్చిన కుర్రాడు, కుర్రాడు వచ్చేవరకు నిప్పు ఆరిపోకుండా చూసిన టీకొట్టు తాత రైలు అందుకోవడానికి సతమతమవుతున్న పురుషోత్తంలో ఆత్మవిశ్వాసాన్ని చైతన్యాన్ని కలిగిస్తారు. చివరికి వస్తుందో రాదో తెలియని బస్సుకోసం ఎదురు చూడకుండా వర్షంలోనే నడిచి రైలు స్టేషన్ చేరుకోవడానికి సిద్ధపడతాడు పురుషోత్తం. గాలి, వెలుతురు లేని ఇంట్లో కష్టంగా జీవితం గడుపుతున్న కుటుంబం కథ 'ఎండ'. ఒక మిల్లులో పనిచేసే తన భర్త ఒక ఖూనీ కేసులో ఇరుక్కొని జైలుపాలవగా అప్పడాలమ్మి తన పిల్లల్ని పోషిస్తుంటుంది శారదమ్మ. తనూ, పిల్లలు భవిష్యత్తు కోసం, భర్త కోసం ఎదురుచూసే ఎదురు చూపులను ఎండకోసం ఎదురు చూడడంగా ప్రతీకాత్మకంగా, కవితాత్మకంగా వర్ణించడం 'ఎండ' కథ ప్రత్యేకత.

'ముగ్గురు గుమస్తాల కథ'లో కుటుంబ అవసరాలను తీర్చలేక బాధపడే గుమాస్తా జగన్నాథం. హాయిగా బతకలేమని పెళ్లి చేసుకోని మరో గుమస్తా సుధాకర్. జీతాల రోజు ఆఫీసుకెళ్లని మరో గుమస్తా బాబులు. వీళ్లవి ఎదిగీ ఎదగని బతుకులు. నిర్వేదంతో జగన్నాథం అనే మాటలివి. 'మనల్ని యిలా వుంచిన వాళ్లు మనుషులైతే వాళ్లు మనుషులు కారు. మనకు ఈ చావు చాల్నని యిలా వుండిపోతే మనం పశువులం కూడా కాము."

స్త్రీ జీవితంలోని అసహాయతను చిత్రించే కథ "ఈ ప్రశ్నకెవ్వరూ జవాబు చెప్పరు?" ఒక దిక్కులేని ఆడది అయిదేళ్ల కూతురితో అప్పటికే ముగ్గురు భార్యలు చనిపోయిన ఒకాయన ఇంట్లో వంటమనిషిగా చేరుతుంది. మకాం కూడా అక్కడికే మార్చవలసి వస్తుంది. తాను గర్భవతియై ఎవరికీ చెప్పుకోలేక ఆత్మహత్య చేసుకుంటుంది. ఇంటి ముందు గుడ్డకప్పిన శవాన్ని చూసి 'అదెవరు? అలా దార్లో బజ్జున్నా'రని అయిదేళ్ల ఆమె కూతురు ప్రశ్నిస్తే దానికి సమాధానం చెప్పేవాళ్లెవరు? 'రక్షకులు' కథలో కొత్త ఊళ్లో టెలిఫోన్ ఆపరేటర్‌గా చేరుతుంది సరళ. తనను అల్లరి పెడుతున్న రత్తమ్మకొడుకు బారినుంచి రక్షించి గొప్పతనం చూపించుకుంటాడు జాన్‌లూయీరావ్. కొంతకాలం తరువాత తనను దగ్గరకు తీసుకోబోయిన జాన్‌లూయీరావ్ బారి నుంచి రక్షించేవాడిగా వస్తాడు అప్పటికే మిలటరీలో చేరి సెలవులకు వచ్చిన రత్తమ్మ కొడుకు. ఈ కథ కూడా సమాజంలో స్త్రీ పరిస్థితిని తెలియ జేస్తుంది. అణచివేసేవాడూ పురుషుడే రక్షకుడిగా ముందుకొచ్చేవాడూ పురుషుడే.

వర్గస్వభావాలు తమంతట తాము వదలవని చెప్పే కథలు 'కొంగల దేముడు',

'ఈ ప్రేమలోకంలో'. 'కొంగల దేముడు' కథలో ఒక కొంగ ఆహారం కోసం దేవుణ్ణి ప్రార్థిస్తుంది. చిరుచేప కొంగకు ఆహారం కాకుండా చేయమని దేవుణ్ణి ప్రార్థిస్తుంది. కాని చిరుచేప కొంగకు ఆహారం కాక తప్పలేదు. 'ఈ ప్రేమలోకంలో' కథలో కప్ప పాముల ప్రేమను కీర్తిస్తుంది. అయినా పాము కప్పను తినక మానదు. తూనీగ కప్పల ప్రేమను పొగుడుతుంది. అయినా కప్పకు తూనీగ ఆహారం అవుతుంది. మేక పులితల్లికి పురుడుపోసింది. ఆ పులికే ఆ మేక ఆహారం అయింది. తన శ్రమతో చక్కెర మిల్లు యజమాని సంపదను పెంచిన కార్మికులు అదే యజమాని అణచివేతకు గురవుతారు.

'కలకంఠి'లో కమల బాగా పాడుతుంది. అందమైంది కూడా. పక్కింటి సూరిబాబుకి జబ్బుపడ్డ తల్లి, పెళ్లి కావలసిన అయిదుగురు అక్కాచెల్లెళ్లు, ఇంటిభారం మొదలైన బాధ్యతలు నెత్తిపైన ఉన్నాయి. మరోవైపు దారిద్ర్యం. కమలను ప్రేమిస్తాడు సూరిబాబు. అది తెలిసిన అక్కాచెల్లెళ్లు తమ గతి ఏమిటని బాధపడి పోతారు. కమలకీ సూరిబాబంటే ప్రేమే. కాని ఇన్ని బాధ్యతలుగల సూరిబాబుతో పెళ్లివల్ల సుఖం లేదని అనుకుంటుంది. సినిమా రంగానికి చెందిన రాఘవరావు కమల కంఠం విని పెళ్లి చేసుకుంటాడు. ఆమె సినీ గాయకురాలవుతుంది. దీనివల్ల వాళ్లకి బాగా డబ్బు వస్తుంది. ప్రేమకంటే డబ్బుకి, సుఖానికి ఉండే విలువ ఎంత ఎక్కువో ఈ కథ చెప్తుంది. ఒక ఆఫీసులో చిన్న ఉద్యోగం చేస్తూ నీతిగా బతుకుతూ కాక కాక పెళ్లయిన మనిషి కథ 'ఓ మంచివాడి కథ'. డబ్బు తేలేని మంచివాడితో సుఖం లేదని భార్య వదలిపెట్టి వెళ్లిపోతుంది. కల్పించిన చార్జీలతో అతడి ఉద్యోగం పోతుంది. లోకం అతణ్ణి వ్యాపారానికి, దొంగతనానికి, దున్నటానికి దేనికి పనికిరావంటుంది. తీరా చావడానికి వెళ్తే చావు కూడా చావడానికి పనికిరావంటుంది. చివరికి జెండాలతో సాగే ఒక ఊరేగింపులో కలసిపోతాడు మంచి లోకాన్ని నిర్మించడానికి. ప్రత్యేకంగా ఉద్యమాలను దృష్టిలో పెట్టుకొని రాసిన కథ ఇది.

మనుషుల మంచితనం మీద నమ్మకం పోయినవాడు గిరిబాబు. అతనికి ఇబ్బందులు వచ్చినప్పుడల్లా తన తెలివితో ఆదుకొని నిలబెట్టినవాడు సూరిబాబు. వీళ్ల కథే 'సూరిబాబు నవ్వు'. గిరిబాబుని ఇబ్బంది పెట్టిన మామని, తనను అనుమానించి, అవమానించి వెళ్లిపోయిన భార్య సుశీలను, స్కాండల్స్‌లో ఇరికించిన కాలేజీ సహాధ్యాపకుల్ని, విద్యార్థుల్ని అందరినీ తోవకి తెస్తాడు సూరిబాబు. సముద్రపుటొడ్డున కూర్చుని లోకం పైన తన అసహ్యాన్ని ప్రకటిస్తాడు గిరిబాబు. సముద్రపు కెరటాల్ని, వెన్నెల కెరటాల్ని చూచి చిరునవ్వు నవ్వుతాడు సూరిబాబు. సూరిబాబు ఎందుకు నవ్వాడనేది రచయిత పాఠకులకు వేసిన ప్రశ్న. బతకడానికి కొంత గడుసుతనం కూడా కావాలనేది దీని అర్థం కావచ్చు.

అలనాటిడాన్(జు)వాన్' ఉత్తమ పురుషలో సాగే కథ. అలనాటి స్నేహితు డొకడు ఎఱ్ఱగా బుఱ్ఱగా ప్రిన్స్‌లాగా ఉండే డబ్బుగల స్నేహితుడు పిచ్చయ్యని పరిచయం చేస్తాడు. పిచ్చయ్య హవుస్ సర్జన్ డా॥ కోమట్రావుని పరిచయం చేస్తాడు తనకు. కోమట్రావు ఇంట్లో అందమైన అమ్మాయిని చూస్తాడు. భార్య కావచ్చని ఊహిస్తాడు. పిచ్చయ్య ఆమెతో తిరగడం చూసి పరోక్షంగా కోమట్రావుని మందలిస్తాడు తను. ఇది తెలిసిన పిచ్చయ్య ఆ అమ్మాయి కోమట్రావు చెల్లెలని, ఇద్దరం ప్రేమించుకుంటున్నామని, పెళ్లి చేసుకోబోతున్నా మని చెప్తాడు. అనవసరంగా అనుమానించినందుకు బాధపడతాడు తను. తరువాత మరో మిత్రుడి ద్వారా తెలుస్తుంది ఆ అమ్మాయి కోమట్రావు భార్యే అని. తను నిర్ఘాంతపోతాడు. డబ్బున్న జల్సారాయుళ్ల స్వభావాన్ని చెప్తుందీ కథ.

'సృష్టిలో', 'ది స్మోకింగ్ టైగర్ అను పులిపూజ' కథలు ఒక రకంగా రాజకీయ కథలు. గ్రామస్థాయి నుంచి అంతర్జాతీయ స్థాయి దాకా వివిధ స్థాయిలలో జరిగే దోపిడి కథని నాలుగు పేజీల్లో కుదించి చెప్తుంది 'సృష్టిలో' కథ. రావిశాస్త్రి వాక్యాలలోనే ఈ కథాసారాన్ని తెలుసుకోవడం వీలవుతుంది. "వీరినాయుడి కోడి పెట్టల్ని వీరన్న ఎత్తుకుపోయాడు. వాటిలో రెండింటిని వీరన్న ఇంటి నుంచి దొంగనక్క కరుచుకుపోయింది. నూకనాయుడి పదిసెంట్ల భూమిని, వీరినాయుడు తన పది ఎకరాల్లోనూ కలిపేసుకున్నాడు. అందుగురించి నూక నాయుడు దావా తేగా ప్లీడరు గుమాస్తా అతని డబ్బంతా ఎగేసేడు. ప్రతివాదైన వీరినాయుడి దగ్గర పెద్ద ప్లీడరుగారు అయిదు వందలు (పది సెంట్ల ఖరీదే అంత) ఒడికేసేరు. వీరినాయుడి బంజరు భూమిని వీరరాజుగారు ఆక్రమించేరు. ఆక్రమించుకున్న ఆస్తులన్నీ వారు తన చిన్న భార్యావారి పేర్న పెట్టి ఉంచేరు. వాటివల్ల వచ్చే రాబడి అంతా ఆవిడ తన తమ్ముడి ఇంటికి నడిపేసింది. ఆ తమ్ముడు సొమ్మంతా తన ఉంపుడుకత్తెకి ఇచ్చేసేడు. ఆ ఉంపుడుకత్తె ఆ డబ్బంతా తనకి నచ్చినవాడికి ఇచ్చేసింది. ఆ నచ్చినవాడు సినిమా చిత్రం కోసం మెడ్రాస్ వెళ్తే తారలూ, డైరెక్టర్లూ కొంత డబ్బు తినేసేరు. మిగతాది ఓ నాటుకోటి చెట్టియారు లాక్కున్నాడు. ఊరివారి డబ్బునీ, కార్మికుల కష్టాన్నీ దోచుకున్న చెట్టియార్‌గారిచేత ఓ మార్వాడి దివాలా తీయించేడు. మార్వాడీగార్ని ఓ తాబీతర్లావారు తమ ధృతరాష్ట్రపు కౌగిట్లో కలుపుకున్నారు. తాబీతర్లావార్ని ఓ ఇంగ్లీషు కంపెనీ రాజ్యంవారు లాగుదామని చూస్తున్నారు. వీరందర్నీ ఓ అమెరికన్ సిండికేట్‌సామ్రాజ్యంవారు చెరచడానికి వారి రెక్కలు పట్టుకొని గిజగిజ లాడిస్తున్నారు. సిండికేట్‌వారి కాలికింద ఇసకని కొందరు జపానేయులు దొలుస్తున్నారు. వారి సీటుకింద వేరొకరు గోతులు తవ్వుతున్నారు. వార్ని మరొకరు, మరొకర్ని ఇంకొకరు. ఇంకొకణ్ణి వేరొకడు, వేరొకణ్ణి వీడు, వీణ్ణి వాడు, వాణ్ణి వీడు, వీణ్ణి ఇది, దీన్నివాడు, వాణ్ణి మరొకడు, మరొకణ్ణి వేరొ..... " రావిశాస్త్రి

కథలలో 'సృష్టిలో' ఒక గొప్పకథ.

'ది స్మోకింగ్ టైగర్ అను పులిపూజ' కథ సామ్రాజ్యవాదపు భయంకర స్వరూపాన్ని, వివిధ రూపాలలో దాని పరిణామాన్ని చిత్రిస్తుంది. గొర్రెమార్కు సిగరెట్టు బ్రిటీష్ కాలం నాటి కంపెనీ ఉత్పత్తి. పులి మార్కు సిగరెట్టు అమెరికన్ సంస్థల ఉత్పత్తి. గొర్రెమార్కు కంపెనీ వాళ్లు కాణీ ఖరీదుగల సరుకుని అణాకి అమ్మేవాళ్లు. పులి కంపెనీ వాళ్లు దమ్మిడీ సరుకుని అణాకి అమ్ముతున్నారు. వ్యాపార ప్రకటనలు, ప్రయిజులు, లాటరీలు, ప్రశ్నలు-జవాబులు, బొమ్మలు, కాలండర్లు, అందగత్తెలు పులిని ముద్దు పెట్టుకుంటున్న బొమ్మలు, చుట్టూ సిగరెట్లతో 'ది స్మోకింగ్ టైగర్'. వీటితో గొర్రె పూర్తిగా దెబ్బతింది. అవి అడ్వర్టయిజుమెంట్లు కావు. పిడుగుల వర్షాలు. పులిపంజా దెబ్బలకి గొర్రె తట్టుకొనే ప్రశ్నే లేదు. అమెరికన్ సామ్రాజ్యవాదం పులిలాంటిది. ఆధునిక జీవితంలో అన్ని స్థాయిలలోను పులి న్యాయమే నడుస్తున్నది "అడవిలో అయితే పులిదే రాజ్యం. కాని మనిషి జీవితంలో కూడా అదే పెత్తనం చేస్తే ఎలాగ? మనిషి న్యాయం వేరు, పులి న్యాయం వేరు. పులయితే దొంగదెబ్బ తీస్తుంది పెద్ద జంతువుని. జబర్దస్తీ చేస్తుంది చిన్న జంతువుని. దాని కడుపు కోసం, దాని స్వార్థం కోసం పాపపుణ్యాలతో సంబంధం లేకుండా అది ఏంచేసినా చేస్తుంది. మానవ జీవితంలో మనిషి నెగ్గాలన్నా అవే పద్ధతులా! చేస్తే మోసం, కాకపోతే జులుం-ఇవేనా మానవ కల్యాణానికి మార్గాలు?" ఇవీ రచయిత ప్రశ్నలు.

## ఆరు సారా కథలు

రావిశాస్త్రి "ఆరు సారా కథలు" తెలుగులో ఎప్పటికీ క్లాసిక్స్‌గా నిలిచే కథలు. వీటిలో ఒక్కొక్కటీ ఒక్కొక్క కథాకావ్యం. రావిశాస్త్రి కథాశిల్పం పరాకాష్ఠకు చేరిన కథలివి. రాజ్యాంగం, పరిపాలన యంత్రాంగం, న్యాయవ్యవస్థల వికృత రూపాన్ని ఇంత విశదంగా చిత్రించిన కథలు తెలుగులో లేవు. బహుశా భారతీయ భాషలలోనే లేవేమో? బ్రిటిష్ వారి కాలంలో వారి కోసం ప్రవేశపెట్టిన చట్టాలు నేరాలను తొలగించడానికి కాక నేరస్తులను తయారుచేయడానికే ఎక్కువగా దోహదం చేస్తున్నాయి. ఈ వ్యవస్థ మాయాజాలంలో తమకు తెలియకుండా నేరస్తులైన వాళ్ల యాంత్రిక జీవితాన్ని ఈ కథలు చిత్రిస్తాయి. వాళ్ల మాటల వల్ల పుట్టే నవ్వూ, దాని వెనక ఉన్న విషాదం, బీభత్సంగా కనిపించే వాళ్ల జీవితం ఆరుసారా కథల్లోని వస్తువులు. ఆరుసారా కథలకు పీఠిక రాస్తూ ఆరు కథలను ఆరు కళాఖండాలుగా కీర్తించాడు శ్రీశ్రీ. ఏకకాలంలో అనేక రసాలను ఉప్పొంగింపజేసే కళాఖండాలవే ఉత్కృష్ట రచనలుగా, కళాఖండాలుగా పేర్కొంటా డాయన. చార్లీ చాప్లిన్ సినిమాలలో, పికాసో చిత్రాలలో, డికెన్స్ నవలలలో, గురజాడ రచనలలో ఇలాంటి రసస్పందనలున్నాయని, ఇటువంటి రసస్పందనే

ఆరు సారా కథల్లో కూడా కలుగుతుందని, అటువంటి రసానుభూతికి 'రసన' అని పేరు పెట్టవచ్చని శ్రీశ్రీ ప్రతిపాదిస్తాడు.

పాపి, మాయ, న్యాయం, మోసం, పుణ్యం, మోక్షం అన్న ఆరు కథలకి సారాయే నేపథ్యం. ఈ కథల రచన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తెలంగాణేతర ప్రాంతాలలో మద్య నిషేధం అమలులో ఉన్న రోజులలో జరిగింది. స్వాతంత్ర్యం రాకముందే ఆనాటి మద్రాసు ప్రెసిడెన్సీలో మద్య నిషేధ చట్టాన్ని ప్రవేశపెట్టారు. కోస్తా, రాయలసీమ ప్రాంతాలు అప్పుడు మద్రాసు ప్రెసిడెన్సీలో భాగం. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తరువాత కూడా 1969 వరకు ఆ ప్రాంతాలలో మద్య నిషేధం కొనసాగింది. ప్రత్యేక తెలంగాణా ఉద్యమం ఆంధ్ర ప్రాంతంలో మద్య నిషేధం ఎత్తివేయడానికి కారణమైంది. మద్యనిషేధచట్టం ప్రకారం సారా తయారు చేయడం, అమ్మడం, కొనడం, సేవించడం నేరాలు. ఈ నేరాలు చేసినవాళ్లను పట్టుకోవడం, కోర్టులు, కేసులు, ప్లీడర్ల వాద ప్రతివాదాలు, జామీనులు, తీర్పులు ఒకవైపు. మరోవైపు దొంగ సారా వ్యాపారం సజావుగా జరుగుతూనే ఉంటుంది. సారా కథలు రాసిన కాలంలో మద్య నిషేధం అమలులో ఉన్న ప్రాంతాలలో అన్నిచోట్లలాగే విశాఖ పట్టణం, ఆ నగరం చుట్టుపట్ల కూడా దొంగసారా వ్యాపారం విస్తరించిపోయి ఉండింది. సారా వ్యాపారం చేసేవాళ్లు, అధికారవర్గం అందరికీ పాత్ర ఉన్న సంకీర్ణ కార్యక్రమం ఇది. కొందరు షావుకార్లు వంటసారా తయారు చేసి టోకున అమ్ముతారు. వీళ్లదగ్గర కొని అమ్మే చిన్నతరహా వ్యాపారులుంటారు. వాళ్లదగ్గర కూలీలు. వాళ్లకి పైలట్లు. నేరస్తులను పట్టుకోవడం ఒకవైపు యథావిధి కార్యక్రమంగా జరుగుతూనే ఉంటుంది. కేసులు పట్టుకుంటే జైలుకెళ్లటానికి సిద్ధపడే కుర్రాళ్లుంటారు. వాళ్లు జైల్లోకెళ్లిన కాలంలో వారి కుటుంబాలను పోషించే ఏర్పాట్లు ముందే జరుగుతాయి. ముట్టవలసిన వాళ్లకి ముడుపులు, మామూళ్లు మామూలే. షావుకారులు, వ్యాపారులు కొన్ని కొన్ని ప్రాంతాలను పంచుకుంటారు. ఒకరి ప్రాంతంలో మరొకరు వ్యాపారం చేయడానికి వీల్లేకుండా కట్టుబాట్లు. ఈ కట్టుబాట్లు దాటినప్పుడే కొన్ని నేరాలు బయటకు వస్తాయి. అన్ని కాలాల్లో, అన్ని సమయాల్లో కార్లలో, లారీలలో, రిక్షాలలో, బళ్లల్లో, సైకిళ్లపైన, టైరుట్యూబుల్లో, ఆడవారి బట్టల మాటున సారా ప్రవహిస్తూనే ఉంటుంది. వీటికి జట్టుగా వ్యభిచార గృహాలు. సారా లాభాలు ఎవరికి ఎంత చెందాలో సజావుగా చెందుతూనే ఉంటాయి. ఇది కొందరు కుర్రాళ్లకి స్వయం ఉపాధిని కల్పించింది. ఈ సారా ప్రపంచంలో పుట్టి పెరిగిన వాళ్లే లంపెన్ వర్గం. ఈ ప్రపంచంలోనే అదొక ప్రత్యేకమైన సమాంతర ప్రపంచం. బయటి ప్రపంచంతో పోలిస్తే పరస్పర విశ్వాసంతో నడిచే ప్రపంచం. ఈ విశ్వాసం ఉన్నంతకాలం ఈ ప్రపంచం స్వయంగానే శాంతిభద్రతలు కాపాడుకొనే ప్రపంచం. అదొక స్వయం సంపూర్ణ ప్రపంచం. ఈ ప్రపంచపు

కథలే సారా కథలు. అమాయకులైన నేరస్తుల పక్షాన వకాల్తా పుచుకొన్న రావిశాస్త్రి అనుభవాల నుంచి వచ్చిన కథలు.

'పాపి' కథలో రామదాసు ఒక పేటకు సారా మండలాధిపతి. రిటైలర్‌గా సారా అమ్మడంతో మొదలు పెట్టి, టోకు సారా వ్యాపారిగా ఎదిగి, లాభాలను వడ్డీలకు తిప్పి, వ్యభిచార గృహాలు నడిపి మండలాధిపతి స్థాయికి చేరుకున్నాడు. నీలయ్య జేబులు కొట్టేవాడిగా జీవితం ప్రారంభించి, పోలీస్ ఇన్‌ఫార్మర్‌గా కొంతకాలం సాగి, దొంగ సాక్ష్యాలు చెప్పి, బ్రోకర్‌గా కొంతకాలం బతికి, సారా వ్యాపారం చేసే స్థాయికి ఎదిగాడు. నూకాలమ్మ దాసుకి భార్యకాని సహధర్మచారిణి, సలహాదారు కూడా. పోలీసులు చేసిన రాజీతో దాసు, నీలయ్యలు తూర్పు, పడమట ప్రాంతాలను పంచుకున్నారు. దాసు నీతిగల మనిషి. మాటకు కట్టుబడి ఉంటాడు. నీలయ్యకు ఆ పేరు లేదు. నీలయ్య దాసు ప్రాంతంలో జరిగిన జాతరలో సారా అమ్మకం పెట్టడంతో గొడవ మొదలవుతుంది. నీలయ్యను ఈ నేలపై నుంచి పంపించి వేసే ఏర్పాట్లు చేస్తారు. నిర్ణయం ఏ రోజు అమలు జరగాలనేది ప్రశ్న. వచ్చే శుక్రవారం శివరాత్రి. ఆ రోజు అమలు చేయడానికి వీల్లేదంటాడు దాసు. శివరాత్రి నాడు చనిపోయినవాడు నేరుగా కైలాసానికి వెళ్తాడని దాసు నమ్మకం. కాని అదే శివరాత్రి రోజు నీలయ్య ఒక లాడ్జిలో ఒక అమ్మాయితో ఉండి తప్పతాగి చనిపోతాడు. ఇది తెలిసిన రామదాసు కోపంతో మండిపోతాడు. "మరైతే ఆడు... ఆడు... ఆ లంజికొడుకు, ఆ నీలయ్య గాడు! ఆడి పాపాలన్నీ ఏటైనట్టు?" అన్నది రామదాసు ప్రశ్న.

'మాయ'లో కొత్తగా పట్టాపుచ్చుకున్న లాయరు మూర్తి. సీనియర్ లాయరొకాయన మూర్తికి సలహా ఇస్తూ దేశంలో ప్రస్తుత న్యాయ వ్యవస్థను, చట్టాలను ప్రవేశపెట్టిన ఇంగ్లీషు వాళ్లని మెచ్చుకుంటాడు. తమకు నష్టం లేకుండా ఏర్పాట్లన్నీ చేసి దేశాన్ని వదిలిన మాయగాడు ఇంగ్లీషువాడని పొగుడుతాడు. కూలీగా జీవితం ప్రారంభించి, సారా వ్యాపారం చేసే స్థాయికి ఎదిగి పోలీసులకి, ప్లీడర్లకి, తదితరులకు దోసిళ్లతో పోసి పోషించి చితికిపోయిన మనిషి ముత్యాలమ్మ. మూర్తి మొదట తీసుకున్న కేసు ఒక చిన్న సారా కేసులో ఆమెను జామీను మీద విడిపించటం. తరువాత అసలు కేసును కూడా అతణ్ణే తీసుకో మంటుంది. ఏభై రూపాయల ఫీజుకి బేరం కుదురుతుంది. అదికూడా ఇవ్వలేకపోతే... "కసేరీల నువ్వు పడ్డగంట కష్టానికి నీ యింట్లో అర్నెల్లు అంట్లు తోమి మరీ నీ రుణం తీర్చుకుంటాను" అంటుంది. నిజానికి ముత్యాలమ్మ మీద కేసు అబద్ధాల కేసు. మామూళ్లు ముట్టలేదని పెట్టిన కేసు. విచారణలో మూర్తి గట్టిగా వాదించాననుకుంటాడు. జవాను, హెడ్డూ సాక్షులు. క్రాసు పరీక్షలో ముఖ్యసాక్షి హెడ్డును బోల్తా కొట్టించాననుకుంటాడు మూర్తి. కేసు గెలుస్తాడు. తరువాత ముత్యాలమ్మ ద్వారానే తెలుస్తుంది మూర్తికి. హెడ్డు కావాలనే కేసును

తేలగొట్టాడు. ముత్యాలమ్మ ముందే హెడ్డుతో చేసుకున్న ఏర్పాటు అది. కేసంతా అంత సులభంగా ఎందుకు విడిపోయిందో అప్పుడుగానీ తెలిసింది కాదు మూర్తికి. అంతా మాయ. "సారా, అసలు దొరకలేదు. దొరికిందని కేసు పెట్టారు. దొరకలేదని తిరిగి తేలగొట్టేశారు. విషయం జరగలేదు. జరగని విషయం జరిగిందన్నారు. జరిగినదని చెప్పబడిన జరగని విషయం జరగలేదన్నారు. లేదు. ఉంది. లేదు. అంతా మాయ చేసేరు" అనుకుంటాడు మూర్తి. ఇందులో ముత్యాలమ్మ బాధ గురించి బాధపడతాడు. 'మాయ' కథలో ముత్యాలమ్మ ప్రసంగం ఒక సాహితీ శిఖరం అంటాడు శ్రీశ్రీ.

"గుప్పున సారా కంపు
కోర్టు
గొల్లున సంతగోల
కోర్టు
అబద్ధాలకి పాముల పుట్ట
కోర్టు
బందిలదొడ్డి రాచబాట
కోర్టు"

ఇలా మొదలవుతుంది 'న్యాయం' కథ. అది కోర్టు సీను. యువకుడైన మేజిస్ట్రేట్. ఇన్‌స్పెక్టర్ వెనక గోడకి బల్లిలా చేరబడి నిలచిన ఒక స్త్రీ. గేలన్ సారాతో పట్టుబడినట్టు ఆ స్త్రీపైన కేసు. ఇన్‌స్పెక్టర్, హెడ్డూ కొందరు జనం ట్రాఫికింగ్ మీద, నేరాల మీద రకరకాల అనాగరికమైన వ్యాఖ్యానాలు. నీ మీద కేసు ఉంది. నేరం ఒప్పుకుంటున్నావా!' అని మేజిస్ట్రేట్ ప్రశ్న. ఎన్నిసార్లు అడిగినా ఒకటే సమాధానం. "కేసుకొప్పేసుకుంటానండి" అని. "మరి నేరం చేశావా?" "నేరం చేయలేదండి. కాని కేసుకొప్పేసుకుంటాను బాబుగారూ". మేజిస్ట్రేట్ రచయిత. చాలా సున్నితమైన మనసు. మేజిస్ట్రేటు వ్యభిచార కంపెనీలను ఎందుకు ఎత్తించివేయరూ? అని అడిగితే "దిక్కుమాలిన ముండల్ని యెవరు చేరతీస్తాడు బాబూ? మరింక పొట్ట పోషించుకుందికి ఈ పన్లు మానమంటే చస్తే మానరు వీళ్లు. అది వాళ్ల బతుకు! వాళ్లను పట్టుకోవడం మా బతుకు. ఏ బతుకు బతికేవాళ్లు ఆ బతుకు బతకాలికదా బాబుగారూ!" అంటాడు హెడ్డు ఫిలసాఫికల్‌గా. బతుకు బతుకు అనేమాట వినగానే ఏడుస్తూ ముద్దాయి చేసిన ఆక్రందన ఉత్తమ సాహిత్య ఖండం. రాత్రి వచ్చిన అమరికన్ షిప్ నుంచి బ్యాచ్ బ్యాచ్‌గా దిగినవారు తాము తాగి, ఆమెను తాగించి జల్సాచేసి జీవచ్ఛవంలా రోడ్డుమీద వదిలేసి వెళ్లిపోయారు. ఒళ్లు తెలియక గొడవ చేస్తుంటే ఆమె మీద సారా కేసు పెట్టారు. కోర్టులో నాకొద్దీ బతుకని ఆమె ఆక్రందిస్తుంది. ఒక్కరాత్రి అంత మంది అలా కరిచేసి, రక్కేసి, రక్తం తాగేసి ప్రాణాలు తీసేస్తే ఇందరు

ప్లీడరు బాబులు, ఇందరు జవాను బాబులు, ఇందరు ధర్మ ప్రభువులు ఎవరొచ్చి అడ్డుకున్నారని ప్రశ్నిస్తుంది. జరిమానా కట్టడానికి ఆమె కంపెనీవాడు రాడు. నెల జైలుశిక్ష పడుతుంది.

'మోసం' కథలో గురవయ్య మొదట సారాకూలీలకు పైలట్. జవానుల్ని, మనుషుల్ని పోల్చుకోలేక అతని కింది కూలీలు చాలా మంది జైలుకెళ్లారు. సారా షావుకార్లు దెబ్బతిన్నారు. కొంత కాలం సారా కూలీగా ఉండి సొంతంగా వ్యాపారం కూడా పెట్టి నష్టపోయాడు. రాకెట్ అప్పారావు మరోరకం. తాను ఎవరి దగ్గర కూలీగా ఉన్నాడో ఆ గురవయ్యనే మోసం చేసి డబ్బులాగి, వ్యాపారం చేసినవాడు. పోలీసుల కళ్లల్లో కూడా కారం కొట్టడానికి ప్రయత్నం చేసినవాడు. రాకెట్ అప్పారావు ఒక రూట్‌లో గురవయ్య సారా వస్తున్నట్టు పోలీసులకు సమాచారం ఇచ్చి, తన సారాని మరో రూట్లో రప్పించేస్తాడు. రాత్రంతా చలిలో దొంగ సారా కోసం కాపలా కాసిన హెడ్డు పోలీసు బతుకులను గురించి చేసిన ఉపన్యాసం ఒక కళాఖండం. రాకెట్ అప్పారావు మీద అన్యాయమైన ఏదో ఒక కేసు పెట్టిస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు గురవయ్య.

'పుణ్యం' కథలో పోలమ్మ కూడా సారా వ్యాపారం చేసి చితికిపోతుంది. నాలుగు గేలన్ల సారాతో ఒకసారి ఆమె పట్టుబడింది. పోలీసులు దయదలచి ఆ సారాను నలభై రూపాయలకు అమ్మించి ఇరవైరూపాయలు జరిమానా కట్టించి మిగతావి తాము తీసుకుంటారు. అందుకోసం "పోలీసుల్లో కూడా పుణ్యాత్ము లుంటారు" అంటుంది పోలమ్మ. బాగా ప్రాక్టీసు ఉన్న ఒక యువలాయర్‌కి లోకంలో మనుషులున్నారు కాని పుణ్యాత్ములంటూ ఎవరూ లేరని నమ్మకం. అలాగే లోకంలో పాపపుణ్యాలు లేవు, లాభనష్టాలు మాత్రమే ఉన్నాయని కూడా ఆయన విశ్వాసం. అతని దృష్టిలో పాపపుణ్యాలను గురించి మాట్లాడేవాళ్లు, ఆలోచించేవాళ్లు, కేసుల్లో ఇరుక్కునేవాళ్లు, లాభాన్ని చూసుకోలేనివాళ్లు, పతితులు అందరూ వెర్రి వెంగళప్పలు. దానికి స్పందిస్తూ ప్రాక్టీసులేని మరో యువలాయర్ హెచ్చరిస్తాడు. "యెల్లకాలం వాళ్లు అలా వెంగళప్పల్లాగా ఉండిపోరు. ఎప్పుడో అప్పుడు ఏదో రోజున వాళ్లందరూ ఒక్కసారిగా గప్పున తెలివి తెచ్చుకుంటారు.... అప్పుడు పుణ్యం వర్ధిల్లుతుంది. అంచేత అప్పుడు మన్లాంటి పాపులు జాగ్రత్తగా వుండాలి" అని.

ఆరువేల సారా కేసుల్లో తీర్పులు చెప్పి చెప్పి పిచ్చెక్కిన మేజిస్ట్రేట్ కథ 'మోక్షం'. ఆరువేల కేసుల్లో మూడువేల మంది జరిమానా కట్టుకున్నారు. మూడు వేల మంది జైలుకి వెళ్లారు. సుమారు ఏభై మంది కాబోలు శిక్షలు తప్పించుకున్నారు. సారా అమ్మినవాళ్లు, తాగినవాళ్లు రోజుకి ఎన్నో కేసులు. కూలి డబ్బుల కోసం సారా మోసిన ఆడదానికి జైలు. చోరీ కేసులో కుర్రాడు. తాగిన

కేసులో నడిమి వయసు మనిషి. జరిమానా కట్టడానికి సిద్ధంగా లేనివాడికి ఎలాగూ జైలు. జరిమానా కట్టడానికి సిద్ధపడిన వాడికీ జైలు. కేసుకి ఒప్పేసుకొనేవాళ్లు, నేరం చేయలేదనేవాళ్లు, అంతా వేగిరం. వాదం లేదు. ప్రతివాదం లేదు. జెయిలు. జరిమానా. మేజిస్ట్రేటు 'ఆర్నెల్లు' అంటే ఆర్నెల్లు శిక్ష. చివరికి బెంచి గుమస్తాకి కూడా ఆర్నెల్లు. చివరికి పిచ్చాసుపత్రికి తీసుకువెళ్తారు మేజిస్ట్రేట్‌ని. 'గవర్నమెంటు పిచ్చాసుపత్రి' అని బోర్డుమీద అక్షరాలను బిగ్గరగా చదువుతాడు. "గవర్నమెంటు పిచ్చాసుపత్రి! ఓహోహో! మర్చేపోయాను. గవర్నమెంటుకి పాపం పిచ్చెక్కింది కదూ? ఎలా ఉందో ఏమిటో? పదండి చూద్దాం...." అంటూ ఆసుపత్రిలోకి దారితీస్తాడు మేజిస్ట్రేటు. "పాపాలంటూ ఏమైనా ఉంటే తీర్పులు చెప్తారు కాబట్టి ఆ పాపాలన్నీ జడ్జీలవి" అంటాడు ఒక పెద్ద లాయరు. అదే ఈ విషయంలో నిజమవుతుంది.

బుక్కులు

శ్రీశ్రీ 'కాదేదీ కవితకనర్హం' అని ప్రకటించిన తొమ్మిది వస్తువులలో ఎనిమిదింటిని కథలుగాను, ఒకదాన్ని నవల గానూ రావిశాస్త్రి మలిచాడు. కొన్ని కథలు శీర్షికకి, కథకు అతకనట్టు కనిపించినా రావిశాస్త్రి కథాశిల్పం వీటిల్లో కూడా చాలా ఉన్నత స్థాయిలో కనిపిస్తుంది.

'కుక్కపిల్ల' కథలో డబ్బున్నవాడికూతుర్ని పెళ్లి చేసుకోవాలనుకుంటాడు ఒక మధ్యతరగతివాడు. హైక్లాసు కుక్కతో ఒక హైక్లాసువాడు అతనితో పోటీకి దిగుతాడు. అమ్మాయిని, అమ్మాయికి చెందాల్సిన డబ్బుని కొట్టుకుపోతాడు. కుక్కపిల్ల ద్వారా ఆ అమ్మాయిని ఆకర్షించిన హైక్లాసువాడు కుక్క పెద్దదై గుడ్డిదైపోగానే దాన్ని పట్టించుకోడు. ఉపయోగించుకొని మరచిపోయే వర్గ స్వభావాన్ని వర్ణిస్తాడు రచయిత ఈ కథలో.

'అగ్గిపుల్ల' కథలో అన్ని సుఖాలను, హోదాలను అనుభవిస్తూ గొప్పవాళ్లుగా చెలామణీ అయ్యే వర్గానికి ప్రతినిధి శేషగిరి. శేషగిరి తన తండ్రికోసం పట్టణం వచ్చే కామేశం కోరికమీద పల్లెటూరు ఎలా ఉందో చూడాలని అగ్రహారం వస్తాడు. కామేశం కూతుర్ని వశపరచుకోబోయి విఫలం అవుతాడు. బస్తీ జీవితంపైన మోజున్న అమాయకురాలు సముద్రాలుని లొంగదీసుకొని అనుభవిస్తాడు. శేషగిరి ఇంజనీరై ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా ఎదుగుతాడు. సంఘంలో అతనికి బాగా స్టేటస్ పెరుగు తుంది. పద్నాలుగేళ్ల తరువాత అగ్రహారంలో ఉన్న రెండెకరాల భూమిని అమ్ముకోవడానికి వస్తాడు. ఊరి తోవలో కారు చెడిపోయి ఆగిపోతుంది. ఊరికి నడుస్తూ వస్తాడు. ఊరి దగ్గర సముద్రాలు, చెల్లెలు చిన్నమ్మి పుల్లలు ఏరుకుంటూ కనిపిస్తారు. వృద్ధాప్యపు ఛాయలు పడిన సముద్రాలును గుర్తించలేక

చిన్నమ్మిని సముద్రాలు అనుకుంటాడు. అతనిలో కోరికలు మళ్లీ చెలరేగుతాయి. జ్ఞాపకం వచ్చిన అనుభవం సముద్రాలు గుండెను మండిస్తుంది. పాకలో పొయ్యి మండిస్తూ చనిపోతుంది సముద్రాలు.

'సబ్బుబిళ్ల' కథలో డబ్బూ, స్టేటసుకల లక్షింపతికి సబ్బంటే పిచ్చి. ఆయన దృష్టిలో సబ్బు నాగరికతకు గుర్తు. పిల్లలకు సబ్బును గురించి, పరిశుభ్రతను గురించి బోధలు చేస్తుంటాడు. ఇంట్లో ప్రతివాళ్లకి ప్రత్యేకంగా సబ్బులు ఏర్పాటు చేయిస్తాడు. ఇలా ఉంటుండగా పెద్ద కూతురు రమ గదిలో రోజూ ఒక సబ్బు పోతూ ఉంటుంది. దొంగ ఎవరో పట్టుకోవడానికి చాలా హడావిడి చేస్తాడు లక్షింపతి. చివరికి ఒక రోజు చిన్న కూతురు శశి కుష్ఠు రోగులకు సబ్బులు ఇస్తూ కనిపిస్తుంది. లక్షింపతి కూతురికి చెప్పిన పరిశుభ్రత బోధనల పరిణామం ఇది.

'రొట్టెముక్క' కథలో ధనిక వర్గానికి కొమ్ముకాసే ఫిజిక్స్‌లో డాక్టరేట్‌కల విద్యావేత్త, యువ లీడర్‌గా గుర్తింపు గల ఒక రింగ్ లీడర్, సాహిత్యాన్ని కెరియర్‌గా ఉపయోగించుకొనే మూర్తికవి, మందుల వ్యాపారి మందు పార్టీ చేసుకోవడానికి ఏర్పాట్లు చేసుకుంటుంటారు. పార్టీ ఏర్పాట్ల సంబరంలో కులాసాగా మాట్లాడుతుండగా వాళ్లకి అసౌకర్యంగా ప్రవేశించిన ఒక యువ రచయిత చదివి వినిపించిన కథ 'రొట్టెముక్క'. సగంవరకు పార్టీ చేసుకొనే నలుగురి స్వభావాలు తెలియజేయడానికి కథా, సంభాషణలూ నడుస్తాయి. ఆ కథలో కథగా నడుస్తుంది అసలు కథ. భర్తపోయిన కాంతమ్మ నగలబాబు ఇంట్లో వంట మనిషిగా చేరి ఆయన కొడుకు సుఖభోగాలకు బలియై రోగాలు తగిలి ఆ ఇంటికి వెలి అవుతుంది. ఆకలి తప్ప మరేమీ ఎరుగని ఆమె కొడుకులిద్దరు ఒక రొట్టెముక్క కోసం కొట్లాడుకొని చచ్చిపోతారు. యువరచయిత వినిపించిన 'రొట్టెముక్క'లోని కథ ఇది. అవకాశవాద రచయితను, నిబద్ధ రచయితను పోల్చి చూపించడం మొత్తం కథలో కనిపించే ప్రధానాంశం.

'అరటితొక్క' కథలో కష్టాలతో జీవితం పట్ల నిరాశను పెంచుకున్న స్కూలు టీచరు జగన్నాథం, తన వాళ్లకు భోజనం తీసుకొని వెళ్తున్న ముసలావిడ, ఇతర ప్రయాణీకులు ఒక పడవలో నదిని దాటుతుంటారు. ఆమె రోజూ ఫ్యాక్టరీలో పనిచేస్తున్న కొడుక్కి అన్నం తీసుకుని వెళ్తూ ఉంటుంది. సమ్మె జరుగుతుందిగదా ఎవరికి భోజనం తీసుకొని వెళ్తున్నావని పడవవాడు అడుగుతాడు. దొంగ పనోళ్లు లోపలికి పోకుండా కాపలాకాస్తున్న కొడుకుకోసం అని ఆమె సమాధానం చెప్తుంది. ఆమె జీవనోత్సాహానికి జగన్నాథం చాలా ఆశ్చర్యపోతాడు. తరువాత పడవ బోల్తా పడితే అతడు ముసలావిడను రక్షిస్తాడు. తన్ను అభినందిస్తున్న జనాన్ని చూసి అతనిలో తృప్తి, ఉత్సాహమూ పెరుగుతాయి. నిరాశామయులు, క్రియాశూన్యులు అయిన మధ్యతరగతి వారిలో శ్రమవర్గం జీవితంపైన ఆసక్తిని, ఆత్మవిశ్వాసాన్ని

కలిగించినట్టు రావిశాస్త్రి రచించిన కథలలో ఇది ఒకటి. అరటి తొక్క ముసలి తనానికి గుర్తు.

దుర్గాపూర్‌లో కార్పెంటర్‌గా పనిచేస్తున్న సత్యమూర్తి తన మేనమామ కాంతయ్య ఇంటికి వస్తాడు ఇంటి ముందున్న పాత దేవదారు పెట్టెల్ని చూసి వాటి చెక్కలను ఉపయోగించి కుర్చీలు, బల్లలు తయారు చేస్తాడు. కాంతయ్య లాభంలేని ఏ పనీ చెయ్యడు. లాభం అంటే ఏమిటన్నది కూతురు సావిత్రికి అర్థంగాని సమస్య. వచ్చిన రోజే దేవదారుతో చేసిన పాతపెట్టెల్ని నాలుగు రూపాయలకు ఇస్తావా అని అడుగుతాడు సత్యం. లాభానికి తప్ప వాటిని అమ్మనంటాడు కాంతయ్య. కాని సత్యం చేసిన కుర్చీలు, బల్లల్ని అతనికి తెలియకుండా ఏభై రూపాయలకు అమ్మేస్తాడు కాంతయ్య. పది రూపాయలు సత్యానికి ఇవ్వబోతాడు. నా కూలి నాకిస్తున్నావా అంటాడు సత్యం. కూలి అయిదు రూపాయలే, తక్కింది లాభం అంటాడు కాంతయ్య. చెక్క ఖరీదు, కూలీ మొదలైనవి పోతే ముప్పయ్ రెండు రూపాయలు లాభం. అసలు లాభం అంటే ఏమిటి? తన కష్టమే ఆ లాభం అంటాడు సత్యం. 'అదనపు విలువ' అన్న భావాన్ని 'బల్లచెక్క' కథ ద్వారా తెలియజేస్తాడు రావిశాస్త్రి.

బుక్కులు కథల్లో విశిష్టమైన కథ 'తలుపుగొళ్ళెం'. అనాథుడైన పైడిరాజుని మొదట ఒక భిక్షుక దంపతులు, తరువాత దొంగ బిచ్చగాళ్లైన దంపతులు పెంచు కుంటారు. బిచ్చమెత్తుకుంటూ ఎవరూ లేని ఇళ్ల ముందు ఆగి తలుపుగొళ్లెం విరగ్గొట్టి పైడిరాజుతో ఇంట్లో వస్తువులను తెప్పించుకోవడం వాళ్లు దొంగతనం చేసేపద్ధతి. ఆ క్రమంలోనే పెంచిన తల్లి దొరికిపోయి జనం దెబ్బలకి చనిపోతుంది. పెంచిన తండ్రి ఒకసారి దొంగతనం కేసులో జైలుకెళ్తాడు. మరోసారి తాను తెచ్చిన దొంగ సరుకు కొని తనను మోసం చేసిన వ్యాపారి ఇంటికి దొంగతనానికి వెళ్లి ఖూనీకేసులో ఇరుక్కొని జైలుకెళ్తాడు. అన్ని సందర్భా ల్లోనూ అసలు దోపిడీదారులైన పెద్దవాళ్లు ఏ శిక్షలూ లేక హాయిగా ఉండడం చూసిన పైడ్రాజు పథకం ప్రకారం తానూ గొప్పవాడూ, ధనవంతుడూ కావడానికి ప్రయత్నం చేసి సఫలుడవుతాడు. కాంట్రాక్టరుగా ఎదిగి వ్యవస్థను, చట్టాన్ని, న్యాయాన్ని తనకు అనుకూలంగా మలుచుకొని చక్కని సంసార జీవితం గడుపు తుంటాడు. తన కొడుకుని లా చదివించాలని, హైకోర్టు జడ్జిని చేయాలని సరదా పడతాడు. "ఐ కోర్టు జడ్జివై ఏటి జేస్తావురా?" అని బంగారు కొడుకుని అడిగితే ఊరివైపు చూపిస్తూ "ఎదవలందరికీ ఉరేసేస్తాన్" అని ముద్దుగా అంటాడు. పైడ్రాజు కుటుంబం అంతా ఆ మాటకి పరమానందభరిత మవుతుంది.

'హారతి పళ్లెం' అయిదేళ్ల పాప శారద కథ. శారద స్వగతంతో జాలి జాలిగా కథ నడుస్తుంది. శారద నాన్న ఏదో జబ్బుతో పోయాడు. అమ్మ, అన్న కూడా

మంచం మీద ఉన్నారు. తినడానికి తిండిలేదు. అమ్మకు, అన్నకు మందు తీసుకొని రావడానికి వెళ్లి లారీకింద పడి చనిపోతుంది శారద. దేవుడికి ప్రతీకగా తీసుకున్న హారతి పళ్లెం కథ మనిషి బాధల్ని దేవుడు తీర్చలేడని చెప్తుంది.

## బాకీ కథలు

'బాకీ కథలు' ప్రత్యేక సందర్భంలో, ప్రత్యేక అవసరం తో రాసిన కథలు. సారా కథలకున్న సమానమైన సామాజిక నేపథ్యంలాగ, ఋక్కులకు ఉన్న సాహిత్య నేపథ్యంలాగా ఈ కథలన్నిటికీ సమానమైన నేపథ్యం లేదు. రావిశాస్త్రికిగల నిబద్ధతే వీటిలో చాలా కథలకు ఏక సూత్రతనిస్తున్నాయి. 'షోకుపిల్లి', 'పాతదే కథ', 'వేతన శర్మ కథ', 'పిపీలికం', 'రవ్వ' కథలలో నిర్దిష్టమైన మార్క్సిస్టు అవగాహన, విప్లవ చైతన్యం కనిపిస్తాయి. 'బుద్బుదం', 'జాతక కథ'లలో ఉదాసీన తాత్త్విక ధోరణి మీద, నమ్మకాలపైన సున్నితమైన వ్యంగ్యం ఉంది. శ్రామిక వర్గంలో ఉండే మానవత్వాన్ని గురించి చెప్పే కథ 'తప్పు'.

వర్గ స్వభావాన్ని అతి సునిశితంగా చిత్రించే కథ 'షోకు పిల్లి'. వెస్ట్‌జర్మనీ, గ్రేట్ బ్రిటనూ, అమెరికా సంయుక్త రాష్ట్రాలలో మదుపు సంపాదించడం కోసం వెళ్లి ఆ రోజు ఉదయమే ప్లేన్ దిగేడు రావుగారు. ప్రపంచాన్నేకాదు, ప్రపంచ సాహిత్యాన్ని కూడా చుట్టి వచ్చాడాయన. డైనింగ్ టేబుల్ దగ్గర కుర్చీలో కూర్చుని రావుగారు భోజనం చేస్తున్నారు. ఎదురుగా రావుగారి భార్య. ఒక అంచున కూతురు మాలినీరావు. ఇరవై అయిదేళ్ల కొడుకు నందూబేబీగురించి మాట్లాడుతున్నది రావుగారి భార్య. నందూ బేబీ ఈ మధ్య పతితులూ, భ్రష్టులూ అని ఏదో ప్రేలాపిస్తున్నాడు. రచయితలని చెప్పి ముష్టి వెధవలతో తిరుగుతున్నాడు. ఎవరో సరూ అనే అమ్మాయితో తిరుగుతున్నాడు. రావుగారి భార్య కనిపించినప్పుడు హైసొసైటీలో దాన్ని గురించే గుసగుసలు. దానివల్ల ఆమెకు కొన్ని కమిటీలలో రావలసిన మెంబర్‌షిప్ కూడా పోయింది. దీనికంతా డ్రైవరే బాధ్యుడంటుంది రావుగారి భార్య. ఇదంతా వింటూ కూర్చున్న మిస్ మాలినీరావు నందూని డ్రైవర్ పాడుచేస్తే లూసీని నువ్వు పాడుచేశావని తల్లితో అంటుంది. అలా అనడానికి కారణం పార్కులో కాపలావాడి కోడిని చూచి తాను పెంచుకున్న పిల్లి లూసీ బెదిరిపోవడం. లూసీ 'అహింస పిల్లి' అని, 'వెజిటేరియన్ పిల్లి' అని, 'సోషలిస్ట్ పిల్లి' అని నానా వెక్కిరింతలూ వెక్కిరించారు తోటి అమ్మాయిలు. దీనికంతా కారణం తల్లి అని ఆమె కంప్లైంట్. తనతోపాటు థియో సాఫికల్ కాన్ఫరెన్సని, నానా రకాల మతాల కాన్ఫరెన్సులని వద్దంటే తీసుకొని వెళ్లింది లూసీని తల్లి. అహింస, ప్రేమ, శాంతి అన్న మాటలు చెవిలోపడి లూసీ అలా అయి పోయిందని మాలినీరావు తల్లిమీద విరుచుకుపడింది. అంతా విని రావుగారు నవ్వుకున్నారు. "ప్రతి మనిషి కూడా పుట్టగానే తను పులిలా బతకాలో, ఆవులా బతకాలో, మేకలా బతకాలో

తేల్చుకోడు. జ్ఞానం వచ్చాక తేల్చుకుంటాడు. పెద్దయ్యాక తనదేజాతో స్థిరపర్చుకుంటాడు.... నందుబేబీ ఇంకా ఆ విషయం తేల్చుకోలేదు. రేపో మాపో తేల్చుకుంటాడు" అన్న విషయం రావుగారికి తెలుసు. సరూ అనే అందాన్ని కొంతకాలం కారుమీద ఊరేగించిన నందూబేబీ తన జాతేమిటో స్థిరపరచుకున్నాడు. వారం రోజుల్లో బొంబాయి వెళ్లిపోతున్నాడు. డాడీక్కూడా తెలియదు తనకి ఎన్టర్‌ప్రయిజింగ్ రెక్కలొచ్చాయని. నందూబేబీ తను ఎలా బతకాలో నిర్ణయించుకోవడం, రావుగారు డ్రైవరు ద్వారా, పోలీసు సూపరింటెండెంట్ ద్వారా పన్నిన వ్యూహం - అంతా కలసి సరూ ఒక బ్రోతల్ కేసులో బుక్కయిపోయింది. లూసీ పూలతోట్లో కనిపించిన మైనగోరును కరుచుకొని చోటా పులిలా గర్వంగా నిలుచుంది. రావుగారు హాబీగా ప్రపంచ సాహిత్యాన్నంతా చుట్టేసినా, రావుగారి భార్య అహింస, శాంతి ప్రవచనాలు విన్నా, నందూ బేబీ సోషలిజం, ~~ఈక్వాలిటీ~~, ఇగాలిటేరియన్ మొదలైన విషయాలు ఎన్ని మాట్లాడినా అవన్నీ వాళ్లకి సోషల్ స్టేటస్‌లో భాగమే, అవన్నీ షోకు కోసమే. అందుకే వాళ్లంతా షోకు పిల్లులు. కథానిర్మాణంలో, పాత్రల స్వభావాలను చిత్రించడంలో, సంభాషణావైఖరిలో 'షోకుపిల్లి' ప్రపంచ స్థాయిలో మొదటి శ్రేణిలో నిలబడగలిగిన కథ.

అనగనగా ఒక రాజు. ఆ రాజుకి ఏడుగురు కొడుకులు అన్న బాల జానపద కథ చట్రంలో రాసిన కథ 'పాతదే కథ'. అనగనగా ఒక భూకామందుకు ఏడుగురు వ్యాపారం చేసుకునే కొడుకులు. బండరాళ్లు అమ్మే వ్యాపారంలో పనిచేయడానికి ఏడుగురు కూలీలను తీసుకుని వస్తారు. కూలీగా ఇచ్చే మంచినీళ్లు చాలక, వరుసగా కూలీలందరూ చచ్చిపోతారు. వాళ్లకి ఎక్కువగా కూలీ ఇస్తే తమ లాభాలు తగ్గుతాయి. ఏం చేయాలో తండ్రిని సలహా అడుగుతారు. "కూలీ జనం చస్తే వ్యాపారికసలు లాభం లేదు. అందువల్ల చావకుండాను, బతకకుండాను కొనవూపిరితో పనిచేసి పెట్టడానికి వీలుగా వాళ్ల బతుకుదెరువులు కొనసాగిస్తూ ఉండాల"ని సలహా ఇస్తాడు తండ్రి. అంతేకాదు. మరీ చస్తారనిపిస్తే తినడానికి ఇంకాస్త వేయండికాని వాళ్లకు చదువు మాత్రం ఏ పరిస్థితులలోను రానివ్వవద్దని, కావాలంటే తాగడానికైనా డబ్బులివ్వమని చెప్తాడు. ఆ సలహా ప్రకారం కొడుకులు వ్యాపారం పెంచుకొని లాభాలు సంపాదిస్తారు.

మధ్యతరగతి గుమాస్తాల అవకాశ వాదాన్ని, తాత్కాలిక ప్రయోజనాలకోసం రాజీపడడాన్ని చిత్రించే కథ 'వేతనశర్మ కథ'. జానపద కథా ధోరణిలో రాసిన కథ ఇది. మగధ దేశాన్ని పరిపాలించే సుందరసేన మహారాజు అవసరానికి తనకు, బంధువులకు భారం లేకుండా పన్నులు పెంచుతూ రాజ్యం చేస్తుంటాడు. చిన్నా చితకా పన్నుల భారం భరించలేక చితికిపోతారు. ఒకసారి క్షామంకూడా వచ్చి చాల మంది చనిపోతారు. ఓరోజు మార్కండేయుడనే మహర్షి వచ్చి ప్రజలే

పాలకులైతే తప్ప లాభంలేదని, రాజునీ, అనుయాయుల్ని పారదోలమని బోధిస్తాడు. సాధారణ ప్రజలు తిరుగుబాటు చేస్తారు. చిన్నజీతాలమీద బతికే కరణాలు వాళ్లతో చేరతారు. రాజు మార్కండేయుణ్ణి ఏదోనెపం మీద చంపించి తిరుగుబాటుని అణచివేస్తాడు. కరణాల నాయకుడు వేతనశర్మ రాజు దోపిడి రాజ్యమైనా, ప్రజారాజ్యమైనా తమకు ఒకటేననీ, సరైన జీతాలు లభిస్తే తమకు ఏఇబ్బందీ ఉండదు కాబట్టి జీతాలు పెంచడంకోసం పోరాడుదాం అని తోటి కరణాలకు బోధిస్తాడు. వేతనాలు పెరిగితే తమకురాజ్యమూ మారనవసరం లేదు, రాజ్యాంగమూ మారనవసరం లేదని అంటాడు. పిడికెడు గింజలకోసం కరణాలు సమ్మె చేస్తారు. మంతనాల తరువాత చిటికెడు గింజలు పెంచడానికి రాజు ఒప్పుకుంటాడు. జీతాలు కాక పారితోషికాలు పొందే హక్కుకూడా వారికిస్తాడు. అది వేతనశర్మ సాధించిన ఘనవిజయం. వేతనశర్మలే కార్మిక నాయకులూ అవుతారు. తత్ఫలితంగా ప్రభువులు ధనకనకవస్తువాహనాలతో తులతూగుతూ ప్రశాంతంగా జీవిస్తుంటారు.

'పిపీలికం' జానపద కథా చట్రంలో రాసిన మరోకథ. 'బలవంతమైన సర్పము చలిచీమల చేతజిక్కి చావదే సుమతీ' అన్న పద్యపాదాలలోని సారాన్ని తిరుగుబాటుకి, విప్లవానికి అన్వయించి ఈకథను రాశాడు రావిశాస్త్రి. పూర్వం ఒక చీమకు తానెవరో తెలుసుకోవాలనే జిజ్ఞాస కలిగింది. కొంత దూరంలో ఉన్న ఊళ్లో నిగమశర్మ అనే బ్రాహ్మణ్ణి ఆశ్రయించింది. కొన్ని రోజుల చదువు పూర్తయిన తరువాత 'నువ్వు చీమవు' అని నిర్ధారణ చేసి పంపాడు బ్రాహ్మణుడు. తృప్తి లేని చీమ మరికొంత దూరంలో ఉండే చతుర్వేది అనే పండితుణ్ణి ఆశ్రయించింది. కొన్ని రోజులు అధ్యయనం చేసిన తరువాత 'సోऽహం' అన్న తత్వాన్ని చీమకు బోధించి పంపాడు పండితుడు. తను బ్రహ్మ అని తెలుసుకుని వెళ్లిన చీమకి సందేహాలు ఇంకాపెరిగాయి. సందేహనివృత్తి కోసం ఇంకా దూరంలో ఉన్న ఋషిపుంగవుడి శుశ్రూష చేస్తుంది. మోక్షం సాధించడమె పరమార్థం, అది తపస్సు ద్వారా సాధ్యం అని ఉపదేశిస్తాడు ఋషి. అసలు జన్మరాహిత్యం ఎందుకు అన్న చీమప్రశ్నకు సమాధానం చెప్పలేక మౌనముద్రాలంకృతుడవుతాడు. అసంతృప్తితో కొన్ని రోజులు అడవులు, కొండలు దాటి తనపుట్ట దగ్గరకు చేరుకోబోతుండగా తోటి చీమలు చిందరవందరగా చెదరిపోయి వస్తుండడం కనిపిస్తుంది. ఏంజరిగిందని అడిగితే ఎవరో ఒక రాక్షసుడు తమయింట్లో చేరి అక్రమంగా ఆక్రమించుకున్నాడని చెప్తాయి చీమలు. చీమ ఒంటరిగా పుట్టలోకి వెళ్లి ఒక భయంకరమైన ఆకారాన్ని చూసి నువ్వు ఎవరివని అడుగుతుంది. దానికి ఆ ఆకారం నవ్వి తాను సుఖభోగినని, చీమ తుచ్ఛమైన కష్టజీవి అని, అదే న్యాయం, ధర్మం అని చెప్తుంది. ఇంత వరకూ ఈ సత్యం ఎవరూ చెప్పలేదు. ఏతత్త్వశాస్త్రమూ బోధించలేదు. ఒకడు తనేమిటి అంటే చీమ అన్నాడు. ఇప్పుడు

నిజమైన జ్ఞానోదయం అయింది. తాను కష్టజీవిని అన్న సత్యం తెలుసుకుంది. తోటికష్టజీవులందరినీ చేరదీసి రాక్షసాకారాన్ని హతమారుస్తుంది. శత్రువే మనకు పాఠాలు నేర్పుతాడన్న సూక్తికి నిదర్శనం ఈ కథ.

ఇటువంటి అవగాహనతోనే రాసిన మరో చిన్న కథ 'రవ్వ' ఒక ఊళ్లో కనకయ్య వ్యవసాయకూలీ కొడుకు రవ్వలరాజా కూలితో గడవక ఊరికవతల కొండల దగ్గర మూడు సంవత్సరాలు కష్టపడి బండలు కొట్టి నేలచదును చేసి పంటలు పండించుకుంటాడు. సరిగ్గా అంతా చేసుకున్న తరువాత ఆ ఊరి కామందు కామయ్య రాజు, రాజసేవకులు, న్యాయపాలకులు, తనకుగల పలుకుబడి అండదండలతో ఆ భూమి తనదిగా నిరూపించి ఆక్రమించు కుంటాడు. కనకయ్య గుండె ఆగి చనిపోతాడు. ఇది అన్యాయమని ఒకతను కామయ్యను, రాజభటుల్ని అడ్డగించి రాళ్లు రువ్వుతాడు. అతనికి రాజభటులకి ఘర్షణ జరిగి అందులో అతడు మరణిస్తాడు. రవ్వలరాజాకి తొమ్మిదేళ్లు నిండిపోతాయి. కామయ్యగారి వారసులే ప్రస్తుతం జిల్లా అధికార్లంతాను అని కథముగిస్తాడు రచయిత.

జీవితం నీటి బుడగ లాంటిది అని గుళ్లో శాస్త్రులుగారు బోధిస్తే జ్ఞానోదయం పొందినట్టు భావించిన వాళ్లలో పదేళ్ల శ్యాంబాబు కూడా ఉన్నాడు. నాన్న అందర్నీ వదలి ఎక్కడికో వెళ్లిపోయాడు. తాను పరీక్ష తప్పానని అన్న కోపంగా ఉన్నాడు. అమ్మ జబ్బుతో మంచం మీద ఉంది. పురాణశ్రవణానికి రోజూ వెళ్తున్న శ్యాం బాబుని ఆరోజు తొందరగా రమ్మంటుంది అమ్మ. దేవుడిప్రసాదం తీసుకొని వచ్చేసరికి ఆరోజు ఇంకా ఆలస్యం అయింది. వచ్చేసరికి అమ్మ చనిపోయి ఉంది. ఇకముందు బుద్ధిగా ఉంటానని, నాన్నని వెదకి పట్టి తెస్తానని, పరీక్షలకు తప్పక చదువుకుంటానని ఆక్రోశిస్తాడు శ్యాంబాబు. "నీటి బుడగ పోయినపుడు నీటిబుడగలేడుస్తాయో లేదో భగవంతుడికే తెలియాలి. కాని, మనిషి పోతే మాత్రం మనుషులేడుస్తారు.శాస్త్రిగారూ చావు నిజం కాదని మీకు బాగా తెలిసి ఉండవచ్చు. కాని బాధ నిజమని మాత్రం శ్యాంబాబుకి మీకంటే బాగా తెలుసు" అని రచయిత వ్యాఖ్యానంతో 'బుద్బుదం' కథ ముగుస్తుంది.

'జాతకకథ' జ్యోతిషానికి సంబంధించినకథ.ఒక జ్యోతిష్కుడు వెంకటసత్యం జాతకాన్ని చూసి చప్పరిస్తాడు. ఒక సాయంత్రం అమ్మ దగ్గర జాతక చక్రాన్ని అడిగి తీసుకొని ఒక మిత్రుడితో కలిసి వెళ్లి జాతకచక్రాల పిచ్చి ఉన్న మరో మిత్రుడు చలపతి చేతిలో పెడతాడు. చలపతి సత్యం జాతకచక్రం తిరగేసి అతడు ఇంజనీరు అవుతాడని, ఇరవై అయిదేళ్లకి పెళ్లి అవుతుందని, తొమ్మిదిమంది సంతానమని చెప్తాడు. చాలాకాలం బతుకుతాడని కూడా చెప్తాడు. భవిష్యత్తు సుమారుగా ఉంటుందని చెప్తాడు. కాస్త నిరుత్సాహంగా

తిరిగివెళ్లి జాతకచక్రం అమ్మ చేతిలో పెడ్తాడు అప్పుడు అమ్మ చెప్తుంది. తను ఇచ్చిన జాతక చక్రం తనదికాదని, తనపేరేగల పెద్దనాన్న కొడుకుదని, అతడు తనకంటే ఒకరోజు ముందు పుట్టాడని, పేరుచూసి తనదే అనుకొని ఇచ్చానని. వెంకట సత్యం ఇంజనీరు కాలేదు. ఇంజనీరు ఆఫీసులో గుమాస్తా అయ్యాడు. ముప్ఫై అయిదేళ్లకుగాని పెళ్లి కాలేదు. ముగ్గురే సంతానం. అందులో ఒకడు చనిపోయాడు. ఇద్దరు అమ్మాయిలే మిగిలారు. పెదనాన్న కొడుకు వెంకటసత్యం చిన్న వయస్సులోనే చనిపోయాడు.

ఆపదలలో అమానుషంగా ప్రవర్తించి తనని, తన కుటుంబాన్ని ఆదుకోని వారినికూడా ప్రమాదంలో ఆదుకొన్న శ్రమజీవి కథ 'తప్పు' ఒకరాత్రి నలభైఏళ్ల స్త్రీ ఇరవయ్యేళ్ల కొడుకుతో లాయరు శ్రీకంఠరావు ఇంటికి వస్తుంది తాను చేయని ఖూనీకేసులో ఇరుక్కున్న తన భర్తని రక్షించమని. తగిన ఫీజు లేనిది ససేమిరా కేసుపట్టడానికి ఒప్పుకోడు రావు. రావుగారి కూతురు శ్రీలక్ష్మి నాన్నని ఒప్పించలేకపోతుంది మరోపదేళ్లకి ఒకరాత్రి డాక్టర్ మూర్తి ఇంటికి ముప్ఫయ్యేళ్ల మనిషొకడు వచ్చి సీరియస్‌గా ఉన్న అమ్మకు ఆపరేషన్ చేసి బతికించమని బతిమిలాడుతాడు. తగినఫీజు ఇచ్చుకొనే తాహాతులేదని చికిత్స చేయడానికి నిరాకరిస్తాడు డాక్టర్‌మూర్తి. భార్య శ్రీలక్ష్మి మూర్తికి ఏదోచెప్పబోయి కూడా ఒప్పించలేక పోతుంది. ఊళ్లో దాసుగారి కళ్లంలో పనిచేస్తున్న నరసయ్య భోరున కురుస్తున్న వర్షంలో పశువులను తీసుకువెళ్లి కట్టివేసే ప్రయత్నంలో ఉండగా దగ్గరగా ఉండే రోడ్డుమీద ఒకకారు చెట్టుకు గుద్దుకోవడం చూస్తాడు. నరసయ్య వెళ్లి ఆకారులో చిక్కుకున్న ముసలాయనను, నలభైయేళ్ల వయసున్నతణ్ణి, అతని భార్యని బయటకి లాగి కాపాడతాడు. ముసలాయన శ్రీకంఠరావు, నడిమి వయసతను డాక్టర్ మూర్తి, ఆమె రావుకి కూతురు, మూర్తికి భార్య. వాళ్లు నరసయ్యను గుర్తిస్తారు. ఋణం తీర్చుకోలేం ఏంకావాలో అడగమంటాడు శ్రీకంఠరావు. వాళ్లు పోయిన తండ్రిని, చచ్చిన తల్లిని ఇవ్వలేరు కదా!

పైపైకి వెళ్లాలనే కోర్కెలతో అసహనం పెంచుకున్న నిరంజనరావు కథ 'పక్కింటి అబ్బాయి'. నిరంజనరావు పక్కన ఏంజరుగుతున్నా పట్టించుకోడు. సహాయానికి వెళ్లడు. పక్కగదిలోవాళ్లు ఖాళీచేసి వెళ్లిపోతే పిల్లవాడికి ఏమయిందో కూడా తెలుసుకోడు. నిరంజనరావు పన్నుల శాఖలో పెద్ద ఉద్యోగం సంపాదించి గొప్పవాడవుతాడు.

కష్టాల్లో, సుఖాల్లో, పుట్టుకలో, మృత్యువులో, ఆశలో, నిరాశలో, చీకట్లో కూడా బయట వెన్నెలే అని కవితాత్మకంగా చెప్పిన కథ 'వెన్నెల'. పేదవారికి, కష్టాల్లో ఉన్నవారికి వెన్నెల భయంకరంగానే ఉంటుంది. శక్తివంతమైన యంత్రాంగం, ఆయుధాలు గల వ్యవస్థని ఎదుర్కోలేవని చెప్పిన, పోరాటానికి పూనుకున్న

సామాన్యులను గురించిన చిన్నకథ 'బెదురు'. 'ద్వైతాద్వైతం' కథలో రెండు కథలున్నాయి. మొదటికథ పెద్దపులిది. రెండవకథ నల్లమేకది. రెండు కథల్లోనూ ఒక కుటుంబం దాహంతీర్చే నీరుకోసం మొరపెట్టుకోవటం ప్రధాన వస్తువు.

కథాసారాంశం

రావిశాస్త్రి కథలలో అబ్బాయి అమ్మాయిని కలుసుకునే ప్రారంభయౌవనపు టాకర్షణలు లేవు. వివాహ ప్రారంభజీవితంలోని ప్రణయకోపాలు, తాపాలు లేవు. కుర్రకారుని పక్కతోవ పట్టించే శృంగార చేష్టలు, కామక్రీడలు లేవు. తీరిక వర్గం పాఠకులను గిలిగింతలుపెట్టే హాస్యపు జల్లులు లేవు. వ్యక్తిపూజకు మూలమైన, సర్వగుణసంపన్నులైన ఆదర్శనాయకులు లేరు. ఆయన కథల్లో జీవిత వాస్తవం ఉంది. సజీవమైన మనుషులున్నారు. దారిద్ర్యపు భయంకర రూపాలున్నాయి. ఆకలి బాధలున్నాయి. వేదనలున్నాయి. ఓటమిని ఆత్మవిశ్వాసంతో ఎదుర్కొని జీవన పోరాటం చేసే సామాన్యులున్నారు. శ్రామికవర్గం ఉంది. నైరాశ్యపు చీకట్లను పారదోలే ఆశావాదం ఉంది. తమ జీవిత సోపానాలు, సొంతప్రయోజనాలు తప్ప మరొకటి ఎరుగనిచదువుకున్నవారున్నారు. ఉన్నవాని కొమ్ముకాసే రచయితల ఆత్మ వంచనలున్నాయి. డబ్బుకోసం వేసేవేషాలు, చేసేమోసాలు, డబ్బు ఆడించే లీలావినోదాలు ఉన్నాయి. స్థానికస్థాయి నుంచి, అంతర్జాతీయస్థాయి వరకు కొనసాగుతున్న దోపిడి స్వరూప స్వభావాలున్నాయి. హోదాలతో పెరిగే కుహనా సంస్కారాలున్నాయి. ఉన్నతవర్గం దుర్మార్గాలు, దగాకోరు తనాలు ఉన్నాయి. అధికారంతో తలకెక్కేపొగరు చేయించే దురాగతాలున్నాయి. పల్లెటూరి అమ్మాయిల అమాయకత్వంతో చెలగాటమాడే పట్టణబాబుల మదం ఉంది. జల్సారాయుళ్లైన భూలోకరంభల్ల అవకాశవాదాలున్నాయి. లాభాలుతప్ప మరొకటి ఎరుగని మానవ ప్రవృత్తులున్నాయి. నేరాలు పెరగటానికి తప్ప తరగటానికి పనిచేయని చట్టాలున్నాయి. చెవులు తప్ప కళ్లులేని న్యాయాన్యాయాలున్నాయి. డబ్బుకి, అధికారానికి, నేరప్రవృత్తికి, రాజకీయాలకు కుదిరిన దోస్తీలున్నాయి. పెద్దలకోనీతీ, చిన్నలకోనీతీ పాటించే కుహనా విలువలున్నాయి. మనిషి బాధల్ని తీర్చలేని 'దేముడు'న్నాడు.

రావిశాస్త్రి కథలలో సంప్రదాయ జానపదకథారీతులు, ఆధునికకథన పద్ధతుల సుందర సమ్మేళనం ఉంది. కవితాత్మకమైన కథన రీతులున్నాయి. అలంకారాల స్వేచ్ఛాక్రీడ ఉంది. సన్నివేశాల్ని, పాత్రల్ని దృశ్యమానం చేసే ఉపమానాలున్నాయి. పశుపక్ష్యాదులూ కొన్ని కథల్లో పాత్రలయ్యాయి. కవిత్వంలో శ్రీశ్రీకిలాగే, కథారంగంలో రావిశాస్త్రికి భాషమీదా, పురాణ కథల మీదా అధికారం ఉంది.

# 5. నవలా దర్శనం

రావిశాస్త్రి కథలు ఒక్కొక్కటి జీవితంలోని ఒక్కొక్క కోణానికి ప్రాతినిధ్యం వహిస్తాయి. నవలలు అంతకంటే లోతుగా వెళ్లి మానవ స్వభావాలను, జీవన సంక్లిష్టతను, సమాజంలోని వివిధ వర్గ స్వరూపాలను సూక్ష్మాతి సూక్ష్మ వివరాలతో చిత్రిస్తాయి. రావిశాస్త్రి నవలలలో కథా కథనం మాత్రమే ప్రధానంగా కనిపించదు. జీవిత వాస్తవాలను ముందుంచటం, వాటి ఆధారంగా వ్యవస్థపైన సునిశిత విమర్శ ఈనవలల్లో ప్రధానంగా కనిపిస్తాయి. 'ఆడదాని సాహసం' మినహాయిస్తే రావిశాస్త్రి తక్కిన ఏడు నవలలలో రెండు పూర్తికాని నవలలు. పూర్తికాని నవలలు పూర్తయిన నవలలకంటే పరిమాణంలో పెద్దవి. అవి పూర్తికావడం, పూర్తికాకపోవడం వల్ల పెద్దగా తేడా ఏమీ కనిపించదు. కథ చెప్పడమే రావిశాస్త్రికి ప్రధానం కాదు కనుక, జీవితపుటంతరాలను తరచి చూడడమే ఈ నవలల ధ్యేయం కనుక. ఏడు నవలలలో రెండు నవలలు పూర్తిగా, ఒక నవల పాక్షికంగా ఉత్తమ పురుష కథనంలో సాగుతాయి.

'ఆడదాని సాహసం' రావిశాస్త్రి చివరి రోజులలో పాత చిత్తురాత ప్రతులలో బయటపడ్డ నవల. ఈ రచన విషయంలో రావిశాస్త్రికే అసంతృప్తి ఉండి ఉండాలి. అందువల్ల దాన్ని అచ్చుకి ఇచ్చి ఉండడు. ఈ నవలలో కాస్త సెక్స్ వర్ణనలెక్కువ. రచనా శిల్పంలో, భావాలలో తరువాత నవలల స్థాయికి ఇది చేరకపోయినా రావిశాస్త్రి సొంత శైలికి సంబంధించిన ముద్ర ఈ నవలలోను కనిపిస్తుంది.

రాజేశ్వరమ్మ కూతురు గిరిజ తను ప్రేమించిన ఉమాకాంతాన్ని మగవేషంలో కలుసుకోవడానికి వెళ్లడంతో నవల ప్రారంభం అవుతుంది. ఉమాకాంతం తన అక్క సీతమ్మ ఇంట్లో ఉంటున్నాడు. గిరిజాశంకర్ పేరుతో మిత్రుడుగా వెళ్లి ఉమాకాంతంతో కలుస్తుంది గిరిజ. ఉమాకాంతం బావ వెంకటేశం స్త్రీలోలుడు. కాని భార్య అంటే బెదురు. గిరిజ ఆడదని తెలుసుకున్న వెంకటేశం ఆమెపైన కన్ను వేస్తాడు. ఇంట్లో పనిమనిషి గంగమీద ఎప్పుడూ కన్ను ఉండనే ఉంటుంది. గిరిజ గంగ సహాయంతో వెంకటేశానికి బుద్ధి చెప్తుంది. తన విషయాన్ని బయటపెట్టటానికి వీల్లేకుండా చేస్తుంది. గిరిజ అన్న జగన్నాథం వెంకటేశం చెల్లెలు రమాదేవిని ప్రేమిస్తాడు. గిరిజకు, ఉమాకాంతానికి లాగే తల్లి రాజేశ్వరమ్మ అంటే జగన్నాథానికి కూడా భయం. నౌకరుగా మారువేషంతో రమాదేవితోపాటు కొంచెం స్వేచ్ఛగా కలుసుకోవడానికి వీలుంటుందని వెంకటేశం ఇంటికి వెళ్తాడు. తాను ఊళ్లో లేనప్పుడు గిరిజ ఉమాకాంతాన్ని కలుసుకోవడానికి వెళ్లిందని తెలుసుకున్న రాజేశ్వరమ్మ వెంటనే అక్కడికి బయలుదేరుతుంది. స్టేషనులో టిక్కెట్టు తీసుకుంటుంటే ఆమె గొలుసు జారి కిందపడుతుంది. అది మురళీ బాబు చేతిలో పడుతుంది. మురళీబాబు రాజేశ్వరమ్మ తమ్ముడే. రాజేశ్వరమ్మ, ఆమె అన్నా కలిసి తమ్ముడు మురళీబాబుకి వారసత్వపుఆస్తి దక్కనివ్వకుండా పంచుకుంటారు. చిన్నచిన్నపనులు చేసుకుంటూ బతికిన మురళీబాబు దొంగగా మారుతాడు. మురళీబాబుకి గంగపైన మనసు. గొలుసుతో వెంకటేశం ఇంటి పెరట్లో గంగను కలుసుకుంటాడు. గంగ ఇకముందు దొంగతనాలు చేయనని మురళీబాబుతో ఒట్టు వేయించుకుంటుంది. గిరిజ మురళీబాబుని గుర్తిస్తుంది. రాజేశ్వరమ్మ అక్కడికి చేరుతుంది. ఇదీ 'ఆడదాని సాహసం'లో నడుస్తున్న కథ. పురుషులకంటే స్త్రీలను ధైర్యంకలవాళ్లనుగా ఈ నవలలో చిత్రించాడు రావిశాస్త్రి.

## అల్పజీవి

రావిశాస్త్రి ఇంకా ప్రత్యేక సిద్ధాంత ప్రభావాలలోకి రాకముందు రాసిన నవల 'అల్పజీవి'. స్పష్టమైన సామాజిక అవగాహన, స్పృహ అప్పటికే రావిశాస్త్రికి ఉన్న విషయం 'అల్పజీవి' తెలియజేస్తుంది. 'అల్పజీవి' నవలలో రచనా శిల్పం, కథన విధానం ఆనాటికి నూతనం. అందులోని శైలి పాఠకుణ్ణి ఇట్టే వశపరచు కుంటుంది. మధ్యతరగతి ఆత్మన్యూనతా భావం 'అల్పజీవి' నవలలో ప్రధానంగా చిత్రిత మయింది. దీనికి చైతన్య స్రవంతి శిల్పం తోడయింది. పాశ్చాత్య సాహిత్యంలో జేమ్స్ జాయిస్ వంటి వారితో విస్తరించిన చైతన్య స్రవంతి శిల్పం శ్రీశ్రీ 'కోనేటిరావు కథల'తో తెలుగులోకి వచ్చింది. వీళ్ల ప్రభావాలు రావిశాస్త్రి మీద కొంతవరకు ఉన్నట్టు కనిపించినా ఆయనది పూర్తిగా స్వతంత్రమైన మార్గం. ఆత్మన్యూనతా భావాన్ని చిత్రించడానికి చైతన్య స్రవంతి శిల్పం చక్కగా

పరిపోయింది. రావిశాస్త్రి కొంత కాలం గుమాస్తా గిరీ చేశాడు. మధ్యతరగతికి చెందినవాడుగా రావిశాస్త్రి వాళ్ల మనస్తత్వం, స్వభావం పరిశీలించినవాడు.

సుబ్బయ్య అల్పజీవి నవల కథానాయకుడు, అధీరుడు ఒక ఆఫీసులో గుమాస్తా. జీవితంలో అనేక అనుభవాల వల్ల అతనిలో ఆత్మ విశ్వాసం పోయింది. నాన్నను దొంగలు కొడుతుండగా చూసినప్పుడు ఏర్పడ్డ భయం అతనిలో ధైర్యాన్ని పూర్తిగా చంపివేసింది. చితికిపోయిన జమీందారీ కుటుంబానికి చెందిన భార్య సావిత్రి, ఆమె అన్న వెంకటరావుల ఆధిక్యతాభావం అతనిలో న్యూనతా భావాన్ని పెంచింది. అది ప్రపంచం అంటేనే ఒక విధమైన భయానికి కారణం అయింది. ఆఫీసులో ఆఫీసరన్నా అమితమైన భయం. భయం నుంచి బయటపడటానికి, ఆత్మన్యూనతాభావాన్ని, అభద్రతాభావాన్ని అధిగమించటానికి సుబ్బయ్య చేసిన విఫలయత్నమే నవలలోని ప్రధాన కథ.

అల్పజీవి నవల ఇలా ప్రారంభం అవుతుంది. ఈ ప్రారంభం తెలుగులో ఉత్తమ సాహిత్య ఖండికగా నిలుస్తుంది. చాలామందికి ఈ భాగం కంఠస్థం అయిందంటే దాని విలువను గుర్తించవచ్చు. ఈ భాగం సుబ్బయ్య వ్యక్తిత్వాన్ని, తదితర పాత్రల స్వభావాలను పరిచయం చేస్తుంది.

> "సుబ్బయ్య సుందరుడు కాడు" అది సుబ్బయ్య అభిప్రాయం.
> "సుబ్బయ్య పొట్టి చచ్చుపెద్దమ్మ" అదీ సుబ్బయ్య అభిప్రాయమే.
> "సుబ్బయ్యకు జమిందారీ లేదు" అది అతని భార్య సావిత్రికి కోప కారణం.
> "సుబ్బయ్య వట్టి సింగి పింగిరిగాడు" - అని సావిత్రి అన్నగారైన వెంకటరావు అంటూ ఉంటాడు.
> "నాన్న చాలా మంచివాడు" - సుబ్బయ్య ప్రథమ పుష్పం కమల అలా చెపుతుంది.
> "నాన్నకు అమ్మను చూస్తే భయం" - సుబ్బయ్య కొడుకు కృష్ణుడు కనిపెట్టిన విషయం అది.
> "సుబ్బయ్య ఈజ్ వెరీ ఇనెఫిషెంట్" - సుబ్బయ్యను గురించి ఆఫీసులో హెడ్‌క్లార్కు పాస్‌చేసే రిమార్కు అది.
> "సుబ్బయ్య వట్టి భయస్తుడు" - ఇది అనేక మంది అనే మాట.

- ఇదీ నవల ప్రారంభం.

సావిత్రి అన్న వెంకటరావుకు వెంటనే కొంత డబ్బు అవసరం వచ్చి చెల్లెలితో సుబ్బయ్యను అడిగిస్తాడు. గవరయ్య ఒక కాంట్రాక్టరు. అతని బిల్స్ అన్నీ సుబ్బయ్య దగ్గరికి వస్తాయి. సుబ్బయ్య దగ్గర వెంకటరావుకి కావలసిన డబ్బు ఉండదని తెలుసు. కాబట్టి గవరయ్య దగ్గర డబ్బు అప్పుగా తెమ్మని అడిగిస్తాడు. గవరయ్యని అడగడం సుబ్బయ్యకు ఇష్టంలేదు. భార్య మెప్పు పొందడానికి ఇదే అవకాశం. అందువల్ల గవరయ్య దగ్గర అయిదు వందలు అప్పు అడుగుతాడు. ఏదో ఒక రూపంలో తన బిల్లు తొందరగా పాస్ చేయించుకోవచ్చని గవరయ్య అడిగిన డబ్బు ఇస్తాడు. ఈలోగా సుబ్బయ్యకు అకౌంట్ సెక్షను నుంచి డిస్పాచ్ సెక్షనుకు బదిలీ అవుతుంది. వెంకటరావు తీసుకున్న డబ్బు ఇవ్వడు. గవరయ్య డబ్బు కోసం వత్తిడిచేసి చివరికి సుబ్బయ్యతో వెయ్యి రూపాయలు బాకీ ఉన్నట్టు ప్రోనోటు రాయించుకుంటాడు. ఆ ప్రోనోటు సుబ్బయ్యకు సమస్య అయి కూర్చుంటుంది. దీనివల్లా, హెడ్‌క్లార్క్ రామస్వామి చేసిన వ్యాఖ్యల వల్లా తన ఉద్యోగం కూడా ఊడి పోతుందేమో అని భయం పట్టుకుంటుంది సుబ్బయ్యకి. ఈ పరిస్థితిలోనే మనోరమ అన్న స్కూలుటీచరుతో పరిచయం ఏర్పడుతుంది సుబ్బయ్యకు. సాన్నిహిత్యం కూడా ఏర్పడుతుంది. లైంగికంగా తన ఆధిక్యతా భావాన్ని చూపించుకోవడానికి ఈ సంబంధం తోడ్పడుతుంది. మనోరమకు గవరయ్య తల్లితో సాన్నిహిత్యం ఉంది. గవరయ్యకూ ఆమె తెలుసు. మనోరమ గవరయ్య తల్లి సహాయంతో ప్రోనోటును సుబ్బయ్యకు తిరిగి ఇప్పించేస్తుంది. తోటి గుమాస్తా అవధాని మాటలు అతనిలో అప్పుడప్పుడు ధైర్యాన్ని కలిగిస్తుంటాయి. ఒక దశలో నేను డబ్బు ఇవ్వనవసరం లేదని చెప్పి గవరయ్య మనుషులతో ఘర్షణకూడా పడతాడు సుబ్బయ్య. మనోరమతో ఉండే సంబంధం అతనికి ఎక్కువవుతుంది. ఒకవైపు ఈ విషయం లోకానికి తెలిస్తే ఏమవుతుందో నన్న భయం, మరొకవైపు ఆమెతో సంబంధాన్ని వదులుకోలేకపోవడం, ఏం చేయాలో తెలియక, తోచక సతమతమవుతుంటాడు సుబ్బయ్య. తన బలహీనతలను అధిగమించడానికి సుబ్బయ్య ప్రయత్నాలు చేస్తూనే ఉంటాడు. కాని సఫలం కాడు. వెంకటరావు,గవరయ్యలనుకూడా స్వతస్సిద్ధంగా చెడ్డవారు కాని వారుగాను, వాళ్లు అలా కావడానికి వాళ్ల జీవిత నేపథ్యమే కారణమైనట్లుగాను చూపిస్తాడు రావిశాస్త్రి.

అల్పజీవి మనస్తత్త్వచిత్రణ ప్రధానమైన నవల. తరువాతి నవలలు దీనికి పూర్తిగా భిన్నమైనవి.

### రాజు - మహిషి

ఇటువంటి నవల తెలుగులో అంతవరకు రాలేదని కొందరు విమర్శకులు,

ఇరవయ్యో శతాబ్దపు క్లాసిక్‌గా నిలుస్తుందని శ్రీశ్రీ మెచ్చిన పూర్తికాని నవల 'రాజు-మహిషి'. రావిశాస్త్రి జీవిత దృక్పథంలో వచ్చిన మార్పు, క్రమంగా పదునుదేరుతూ వచ్చిన నిశిత పరిశీలనశక్తి, స్పష్టమైన సైద్ధాంతిక అవగాహన మొదలైనవాటికి సమగ్రప్రాతినిధ్యం వహించే నవల ఇది.మనుష్యుల స్వభావాలను పట్టుకోవడం, వాటిని అద్భుతంగా చిత్రించడం ఒక్క రావిశాస్త్రికే చెల్లుతుందని నిరూపించే నవల 'రాజు-మహిషి'. ఇందులోని రచనా శిల్పం పాఠకుల్ని మంత్ర ముగ్ధుల్ని చేస్తుంది. ఇందులోని పాత్రలు వేటికవే నమూనాలు. కొన్ని పాత్రలకు పెట్టిన పేర్లే పాత్రల స్వరూప స్వభావాలను సగం తెలియ జేస్తాయి. నవల పూర్తిగాకపోయినా ఉన్నంతలోనే నవలను అల్లిన తీరులో రావిశాస్త్రి ప్రతిభ పూర్తిగా కనిపిస్తుంది. ఫ్లాష్‌బ్యాక్ పద్ధతిని నవలలో ఇంత గొప్పగా ఉపయోగించుకున్నవారు తెలుగులో లేరేమో అని పిస్తుంది. ఇందులో శిల్పం వస్తువును పూర్తిగా మింగి వేసిందన్న విమర్శ కూడా లేకపోలేదు. శిల్పం చెప్పవలసిన విషయాన్ని విశదీకరించడానికి, సన్నివేశాలను పాత్రలను దృశ్యమానం చేయడానికే ఉపయోగించిందనడం సబబు. ఒక ప్రఖ్యాత కథాకారుడు చెప్పినట్టు 'అనంతమైన సమాజాన్నీ, వ్యక్తులనీ, స్వభావసిద్ధమైన వైవిధ్యాన్నీ ఎంత క్లుప్తీకరించి, నైశిత్యంతో చెప్పడానికి ఈ రచనలో ప్రయత్నం జరిగిందో చూడగలిగితే' దీనికి సమాధానం దొరుకుతుంది. రావిశాస్త్రిపైన ఆరాధనను పెంచిన రచనలలో ఇది ఒకటి.

ఇరవై రెండు ప్రకరణాలుగా వచ్చిన 'రాజు-మహిషి' ప్రేమ, మనిషి అంతేకాక దైవం, న్యాయం, ధర్మం, సత్యం కథ కూడా. ఒక్కొక్క ప్రకరణానికి ముందు ఆ ప్రకరణంలో వచ్చే కథకు సంబంధించిన ప్రణాళికను ఇవ్వడం ఈ నవలలోని ప్రత్యేకత. ప్రణాళికలోని భాష గ్రాంథిక భాష కావడం విశేషం. బహుశా ఇతిహాస, పురాణాలలోని పద్ధతి కావడంవల్ల అటువంటి భాషను వాడి ఉండవచ్చు. దీన్నిబట్టి చూస్తే 'రాజు-మహిషి' నవలకు సంబంధించిన బృహత్ప్రణాళిక ఒకటి ఆయన ఆలోచనల్లో ఉండి ఉంటుంది అనిపిస్తుంది. అసంపూర్తి రచనగానే ఈ నవల సుమారు మూడు వందల పేజీలు ఉంది. ఇరవై రెండవ ప్రకరణం చివర ఒక పాత్రతో "ఇంతటితో అయిపోలేదు, ఆడవలసిన నాటకం ఇంకా చాలా ఉంది" అని అనిపించడం వల్ల ఈ నవలా రచన కొనసాగితే వేల పేజీలలో సాగి ఉండేదేమో అనిపిస్తుంది. రచయిత వివినమూర్తి చేసిన గణాంక వివరాల ప్రకారం వచ్చినంతవరకు నవలలో ఉన్నవి పేజీల పాత్రలు ముప్పై రెండు, పేరాల పాత్రలు ముప్పై, చిన్నా పెద్దా వాక్యాల పాత్రలు మరో యాభై. మొత్తం నూట పన్నెండు పాత్రలు. అందులో యాభై స్త్రీ పాత్రలు. నలభై యేళ్లపైబడిన పాత్రలు ఎక్కువ. వృత్తుల సంఖ్య సుమారు ఇరవై అయిదు. ఇరవైయొకటి చావులు. గేదెల రాజమ్మ, గంగరాజు, మందులభీముడు, భీమసేనరావు, మిస్ ప్రేమ, భవానీశంకర

ప్రసాదు మొదలైనవి విశిష్టమైన పాత్రలు.

'రాజు-మహిషి' నవలలో ప్రధాన వస్తువు మున్సిపల్ రాజకీయాలు. పట్టణ వ్యవహారాలు నడిపించే పెద్దలు, వాళ్ల అంగబలం, ధనబలం, పలుకుబడి - వీటిచుట్టూ, వీటికి అధీనమై తిరిగే వివిధ వర్గాలవాళ్ల జీవితాలు, వీటికి తోడుగా కోర్టులు, న్యాయాధిపతులు, న్యాయవాదులు, వీళ్ల మధ్య సంబంధాలు, వాళ్లను కూడా ప్రభావితం చేయగల పెద్దల పలుకుబడి, అవి సామాన్యులను, వారి కేసులను ప్రభావితం చేసే విధానం నవలలో కనిపించే వివిధ అంశాలు.

రాజు కాని రాజు గంగరాజు. భార్య పోగా పంచన చేరి రాణిగా మారిన రాజమ్మ. వీళ్లను పరిచయం చేయడంతో నవల మొదలవుతుంది. రాజుకి ఆవులు, గేదెలు ఉన్నాయి. ఆయనకు గేదెల రాజు అని పేరు. రాజమ్మకి గేదెల రాజమ్మ అని పేరు. గేదెల రాజమ్మ పాల వ్యాపారం చేసి, పిండిమిల్లు పెట్టి కాస్త గడించింది. ఆమె ఆ పట్టణం మున్సిపల్ కౌన్సిలర్ మందుల భీముడు అనబడే భీమసేనరావుకి సపోర్టరు. ఆ విధంగా ఊళ్లో ఆమెకి పలుకుబడి ఉంది. పూర్వం చాలా పెద్ద వ్యాపారాలు చేసి 1920 లలో అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ పెట్టిన ఒకాయన బతికి చెడిన కుటుంబానికి చెందిన మంచి పర్సనాలిటీగల భీమసేనరావును మేనేజర్‌గా పెట్టుకుంటాడు. ఇష్టంలేని పెళ్లి చేసుకున్న భీమసేనరావు భార్య ఒక ఆడపిల్లని కని చనిపోతుంది. ఆ అమ్మాయే ప్రేమ అనబడే పద్మజ. భీమసేనరావు మున్సిపల్ రాజకీయాలలో ప్రవేశించి క్రమంగా చైర్మన్ అవుతాడు. అతడికి సన్నిహితుడే కౌన్సిలర్ మందుల భీముడు. ఒక మందుల కంపెనీకి మేనేజరుగా ఉండి ఆ కంపెనీని దివాలా తీయించి బాగుపడ్డ మరో భీమసేనరావే మందుల భీముడు. ఎత్తులు ఎలా వేయాలో లాభాలు ఎలా సంపాదించాలో, ఆడవాళ్లను ఎట్లా ఉపయోగించుకోవాలో తెలిసినవాడు మందుల భీముడు. అతడి కొడుకు రంగారావు. సోనా ప్యారీ అనే కంపెనీలో గుమాస్తా. ఎత్తులు, జిత్తులు బాగా తెలిసినవాడు. భీమసేనరావు ఏకైక పుత్రిక పద్మజని వశపరచు కోవటానికి ప్రయత్నాలు చేస్తాడు రంగారావు. తండ్రి భీముడు దాన్ని ప్రోత్సహిస్తాడు. బీద కుటుంబంలో పుట్టి పెరిగిన శంకరం అనే భవానీ శంకర ప్రసాద్ రంగారావుకి కొలీగ్. పద్మజకు శంకరం మీద మనసుంది. ఈ విషయం రంగారావుకి తెలుస్తుంది. శంకరానికి ఎలాగయినా పారం చెప్పాలనుకుంటాడు రంగారావు.

రంగారావు ఉన్న వీధిలోనే ఒక ఖాళీ జాగాలో చిన్న తాటాకు ఇల్లు కట్టుకుని ఉంటాడు శంకరం. చుట్టూ చెట్లు పెంచుకుంటాడు. దానిచుట్టూ గేదెలు కడ్తుంది రాజమ్మ. మున్సిపల్ హెల్త్ ఆఫీసరుకి ఫిర్యాదు చేస్తాడు శంకరం. రాజమ్మ శంకరంతో ఏదో నెపం మీద తగాదా తెచ్చుకొని గంగరాజుతో సహా వెళ్లి ఆసుపత్రిలో పడేట్టు బాదుతుంది. రాజమ్మ అంటే ఆ ఏరియా హెడ్

కానిస్టేబులుకి పడదు. హెడ్డు రాజమ్మ మీదా, గంగరాజు మీదా హత్యా ప్రయత్నం నేరం పేరిట కేసు పెడ్తాడు. గంగరాజు అరెస్టు అవుతాడు. రాజమ్మ కౌన్సిలర్ మందుల భీముడిని ఆశ్రయిస్తుంది. ఆయన ముకుందరావు అనే ప్లీడరు దగ్గరికి పంపుతాడు బెయిల్ పిటిషన్ పెట్టించడానికి తన జూనియర్‌ని పంపుతాడు ముకుందరావు. జూనియర్‌ని పంపినందుకు అహం అడ్డంవచ్చి మేజిస్ట్రేట్ గంగరాజుకి బెయిల్ మంజూరు చేయడు. దీనివల్ల ముకుందరావు అహం దెబ్బతింటుంది. బార్‌లో మేజిస్ట్రేట్‌పైన నిరసన తీర్మానం ప్రవేశపెట్టడానికి ప్రయత్నిస్తాడు. నిరసన తీర్మానాన్ని సమర్థించేవాళ్లూ, వ్యతిరేకించేవాళ్లుగా లాయర్లు రెండు గ్రూపులుగా విడిపోతారు. కౌన్సిలర్ మందుల భీముడు మున్సిపల్ ఛైర్మన్ భీమసేనరావు పలుకుబడిని ఉపయోగించి బార్ అసోసియేషన్ ప్రెసిడెంట్ రాజశేఖరాన్ని తీర్మానానికి అనుకూలంగా అయ్యేట్టు చేస్తాడు. జిల్లా జడ్జి శ్రీధరరావు మేజిస్ట్రేట్‌కి, లాయర్ ముకుందరావుకి రాజీ చేస్తాడు. నిరసన తీర్మానం పోయినందుకు మేజిస్ట్రేట్‌కి బరువు తగ్గినట్టయినా ముకుందరావుని ఒక పట్టు పట్టాలని నిశ్చయించు కుంటాడు. ఆ సాయంత్రం రాజమ్మ క్లినిక్‌లో అడ్మిట్ కావడానికి వెళ్తుండగా ఒక పంతులు కుర్రాడు వస్తాడు. రాజమ్మని కూడా కోర్టులో హాజరయిపొమ్మని, లాయర్‌ని మార్చుకొమ్మని సలహా ఇస్తాడు. రాజమ్మ ముకుందరావుని మార్చి ఆయన బదులు సూర్యచంద్రరావును లాయర్‌గా పెట్టుకుంటుంది. రాజమ్మకి, గంగరాజుకి ఇద్దరికీ బెయిలు మంజూరవుతుంది. ఇదీ నవల రాసినంతవరకు జరిగిన కథ.

'రాజు-మహిషి' నవలనుంచి రచనాశిల్పానికి, సన్నివేశకల్పనకి, పాత్ర చిత్రణకి, సంభాషణకౌశలానికి కొన్ని ఉదాహరణలు ఇవ్వాలని బయలుదేరితే ప్రతి పంక్తి, ప్రతి పేరా, ప్రతి సంభాషణా, ఒక చిన్న మార్పుని కూడా సహించని అల్లికా, నిర్మాణం వేరు చేయలేకుండా ఉండి మొత్తం రచనే ఉదాహరణ అయ్యే పరిస్థితి ఏర్పడుతుంది. ఇంతకంటే ఈ నవల రచనాసంవిధానాన్ని గురించి చెప్పడానికి అవకాశం లేదు.

## *గోవులొస్తున్నాయి జాగ్రత్త*

శ్రీశ్రీ బుక్కులలో తొమ్మిదవది 'గుర్రపుకళ్లెం'. ఇది నవలగా 'గోవులొస్తున్నాయి జాగ్రత్త'గా విస్తరించింది. భూస్వామ్య కుటుంబం నుంచి వచ్చి పెట్టుబడిదారుగా మారిన కిరీటిరావు అంతరంగ కథన రూపంలో సాగిన నవల 'గోవులొస్తున్నాయి జాగ్రత్త'. ఉపన్యాస ధోరణిలో సాగిన ఈ కథనం రావిశాస్త్రి శైలీ, శిల్పాలకు ప్రతీకగా నిలుస్తుంది. పెట్టుబడిదారుల కోసం, పెట్టుబడిదారుగా మనసు విప్పి మాట్లాడుతున్న మాటలుగా కిరీటిరావు కథనం ప్రారంభిస్తాడు.

కిరీటిరావు పెట్టుబడిదారుల ప్రయోజనాన్ని, పరపీడనను సమర్థించడానికి చేసిన వాదన, రచయిత ఆయనతో మాట్లాడించిన తీరు, శ్రుతి మించిన వ్యంగ్యం పాఠకుడు ఆ వాదన సరైందని భావించే విధంగా ఉండడం వల్ల వ్యతిరేక ఫలితాలేర్పడే అవకాశం ఉందని విమర్శకులంటారు.

ఈ నవల శ్యామసుందర కిరీటిరావు అనే పాత్ర చెప్పినట్టుగా ఉత్తమ పురుష కథనంలో సాగుతుంది. కిరీటిరావు బెంగాల్‌లో సబ్ డివిజనల్ మేజిస్ట్రేట్‌గా ఉండే వాడు. ఒక కాల్పుల కేసులో ప్రమోషన్ కోల్పోయి, కోర్టుకి వెళ్లి గెలిచి, ప్రొమోషన్ పొంది కొంతకాలం పనిచేసి, స్వచ్ఛంద పదవీ విరమణ చేసి వ్యాపారంలో ప్రవేశిస్తాడు. కిరీటిరావుకి ఒక కొడుకు. ఐ.ఎ.ఎస్ చేసి సెంట్రల్ సెక్రటేరియట్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. ఒక కూతురు. అల్లుడు ఇంజనీరు. కిరీటిరావు బంధువర్గం, ఆప్తవర్గం అంతా రాజకీయాల్లోనూ, వ్యాపారాల్లోనూ ఉన్నారు. వాళ్ల సంక్షేమం ధ్యేయంగా చిన్నప్పుడు రాజయోగి పెదనాయన గారి ఆశ్రమంలో జరిగిన కథను తన వారందరికి వివరిస్తాడు కథకి 1920,30లలోని సత్యాగ్రహ ఉద్యమ కాలం నాటి నేపథ్యం ఉంది.

రాజయోగి సువర్ణసుందరిపురం జమీన్‌దారు. ఆయనకు మూడు పెళ్లిళ్లు జరిగాయి. భార్యలు చనిపోయారు. వారితో వచ్చిన జాగీర్లు మాత్రం మిగిలాయి. ఒకరోజు వేటకు వెళ్లి తిరిగి వస్తూ జాగీరులోని ఒక గ్రామంలో విశ్రమించినప్పుడు పాలేరు కూతురు లచ్చయ్యమ్మను చూస్తాడు. లచ్చయ్యమ్మను తన ఉంపుడు కత్తెగా పంపమని పాలేరుకు కబురు చేస్తాడు. బంధువులు లచ్చయ్యమ్మకు మేనబావతో పెళ్లి నిశ్చయం అయిపోయిందని చెప్పి పంపిస్తారు. మేనబావ నష్టపోకుండా అతనికి కొంత డబ్బు ఇస్తానంటాడు రాజయోగి. లచ్చయ్యమ్మ కుటుంబం దీనికి ఒప్పుకోదు. చదువుకున్న పెద్దవారు చేయవలసిన పనికాదని కుటుంబ సభ్యులంటారు. లచ్చయ్యమ్మ శీలాన్ని మేనబావ శంకించే విధంగా రాజయోగి కుట్రపన్నుతాడు. ఎలాగూ లాభం లేదని కనీసం పదిమందిలో లచ్చయ్యమ్మను పెళ్లి చేసుకొమ్మని అడుగుతారు లచ్చయ్యమ్మ బంధువులు. దానికి ఒప్పుకోని రాజయోగి లచ్చయ్యమ్మను ఎత్తుకొచ్చేస్తాడు. పాలేరు కుటుంబంగాని, లచ్చయ్యమ్మగాని దీన్ని ఎదిరించలేకపోతారు. ఈ ఘోరాన్ని నిరసిస్తూ గాంధీ సత్యాగ్రహ ఉద్యమ ప్రభావం ఉన్న యువకులు కొందరు పోలీసులకు ఫిర్యాదు చేస్తారు. ఈ యువకులలో చాలా మంది రాజయోగి జమీందారీలోని చిన్న భూస్వాముల పిల్లలు. చిన్న భూస్వాములను పిలిపించి యువకులకు అండగా నిలవకుండా ఏర్పాట్లు చేస్తాడు రాజయోగి. కాంగ్రెసు నాయకులపైనా బ్రిటిష్ యంత్రాంగంపైనా తన పలుకుబడి ఉపయోగిస్తాడు. ఆ నాడు కాంగ్రెసులో ఉన్న కేశవరావు వంటివారు ఆయనకు తోడ్పడతారు.

లచ్చయ్యమ్మను స్వాధీనం చేసుకున్న రాజయోగి ఆమె కుటుంబాన్నంతా ఎవరికీ తెలియకుండా నాశనం చేస్తాడు. లచ్చయ్యమ్మను ప్రతిఘటించలేని స్థితిలో పెట్టి బంధించి అనుభవిస్తాడు. ఆమెకు కొడుకు పుడ్తాడు. అంతకుముందు భార్యల ద్వారా పిల్లలులేనిరాజయోగి కనీసం అచ్చయ్యమ్మకు జన్మించిన కొడుకును తనకు వారసుడుగా చేయడు. పైగా ఆ పిల్లవాణ్ణి మాయం చేసి కిరీటిరావుని పెంచుకుంటాడు. ఈ దుర్మార్గానికి వ్యతిరేకంగా గోవులన్నీ తిరుగుబాటు చేస్తాయి. శ్రామిక జనానికి సంకేతంగా ఇక్కడ గోవులను తీసుకున్నాడు రచయిత. సత్యమూర్తి, గోదాసు అన్నవాళ్ల సహాయంతో నిర్బంధం నుంచి బయటపడ్డ లచ్చయ్యమ్మ తమవారిని కలుసుకుంటుంది.

*రత్తాలు - రాంబాబు*

సినిమా స్క్రిప్టుగా ప్రణాళిక వేసుకుని మొదలు పెట్టిన రచన 'రత్తాలు-రాంబాబు' నవలగా రూపాంతరం చెందింది. ఇది పూర్తిగాని నవల అయినా, అయిన భాగం వెయ్యి పేజీలకు మించిపోయి నాలుగు భాగాలుగా అచ్చయింది. వచ్చినంతవరకు నవలలో కథ చాలా నెమ్మదిగానే నడిచినా జీవితానికి సంబంధించిన వివిధ కోణాలను వివరంగా, విస్తృతంగా చిత్రించిన నవల ఇది. వేశ్యాగృహాలు, రావిశాస్త్రి పాత్రలు మాట్లాడే మాటలలో 'కంపెనీ' అంటే ముండల కంపెనీ, తమ తమ అవసరాల కోసం వాటిని కాపాడే డబ్బుగల వాళ్లు, రాజకీయనాయకులు, యంత్రాంగం, తమకు తెలియకుండానే వేశ్యావృత్తిలోకి నెట్టబడ్డ యువతులు, మరొక రకంగా బతకలేక శరీరాలను అమ్ముకోవడానికి సిద్ధమైన వాళ్ల దీనచరిత్ర ఈ నవలలో వస్తువులు. ముసలి కొంగ, అడ్డబుర్ర, రిక్షా జోగులు, స్పుత్నిక్, రాకెట్, సూది మందు, కాంపౌండరు, గల్లీపులి రావిశాస్త్రి సృష్టించిన వింత పాత్రలు.

భూమిమీద పడకముందే తండ్రిని, పడగానే తల్లిని పోగొట్టుకున్న రత్తాలు పెద్దమ్మ వరాలమ్మ దగ్గర పెరిగింది. భర్త చనిపోయిన వరాలమ్మ కూతురుకి పెళ్లి చేసి ఊళ్లో కాఫీ హోటలు పెట్టుకొని బతుకుతోంది. వరాలమ్మకు దగ్గరి బంధువుగా చెప్పుకొని వచ్చిన సింహాచలం మాటలకు మోసపోయి పెళ్లి ఆశతో అతనితో పట్నం వచ్చేస్తుంది రత్తాలు. పట్టణంలో సింహా చలం రత్తాలును వెయ్యి రూపాయలకు నరసమ్మ కంపెనీకి అమ్మేస్తాడు. రాత్రి సింహాచలం పంపిన ఒక వ్యక్తి తనపైన అత్యాచార ప్రయత్నం చేయడంతో రత్తాలుకి తాను ఎక్కడకి చేరిందీ అర్థమవుతుంది. ఆ కంపెనీలో అప్పటికే ఉన్న సత్యాలు ఆత్మహత్య చేసుకున్నదన్న హడావిడిలో ముత్యాలు అనే ఆమె సహాయంతో రత్తాలు బయటపడుతుంది. కాని నరసమ్మ అసిస్టెంటు అడ్డబుర్ర రత్తాలుని ఏదో ఒక రకంగా మళ్లీ కంపెనీకి చేరవేస్తాడు.

'రత్తాలు-రాంబాబు' కథంతా బహుశా విశాఖపట్టణం లోని కంపెనీ అంటే వేశ్యాగృహాల చుట్టూ తిరుగుతుంది. నరసమ్మ కంపెనీతోపాటు షేక్ బంగారప్ప కంపెనీ, జాఫర్ కంపెనీ ఇంకా ఎన్నెన్నో. రత్తాలు నరసమ్మ కంపెనీకి చేరేసరికి ఆ కంపెనీలో ఉన్నవారు ముత్యాలు, సత్యాలు, పైడితల్లి, జలజ, జాంబాతి, సరస, సుబ్బులు. బాల్యంలోనే పెళ్లి అయిన ముత్యాలు నాన్న, అమ్మ, భర్త చనిపోగా అన్న పోషణలో బతికింది. పదహారో ఏట ఒకడి మోసానికి, కామానికి బలియై పట్టణం చేరి కూలి చేసుకుని బతుక్కుంటూ చివరికి కంపెనీలో చేరింది. ప్రేమించి పెళ్లి చేసుకున్న భర్త చనిపోగా తన కొడుకును పోషించుకోవడానికి గత్యంతరం లేక కంపెనీలో చేరింది సత్యాలు. ఉన్న కొడుకు కూడా పోగా ఆత్మహత్య చేసుకుంటుంది. పద్నాలుగేళ్లకే కంపెనీలో చేరిన పైడితల్లి వృత్తిలో అలసిపోయి తాగుడుకి అలవాటుపడింది. వేశ్యగా బతుకుతూ తాగుడుకు అలవాటుపడిన మరొక యువతి జలజ. జబ్బుపడిన జాంబాతి, పద్దెనిమిదేళ్ల సరళ, ఇరవై ఏళ్ల సుబ్బులు కంపెనీలో ఉన్నారు. ఒక ఎస్.ఐ సహాయ సహకారాలతో నరసమ్మ కంపెనీ మొదలైంది. చనిపోయిన ఎస్.ఐ ఫోటో ఒకటి నరసమ్మ ఇంటిలో వేలాడుతుంటుంది. తరువాత హెడ్డు సహాయంతో కంపెనీ నడుపుకుంటున్నది. కేసులు అవసరమైనప్పుడు కొంత మందిని పంపి జుల్మానాలు చెల్లించి తక్కిన సమయాల్లో సజావుగా వ్యాపారం నడుపుతూ ఉంటుంది నరసమ్మ. జిల్లా రాజకీయ నాయకులకు, అధికారులకు అవసరం వచ్చినప్పుడు నరసమ్మ కంపెనీ అమ్మాయిలను సరఫరా చేస్తుంటుంది.

అడ్డబుర్ర తిరిగి తీసుకొని వచ్చిన రత్తాలును తిండీ తిప్పలు ఇవ్వక మూడు రోజులు బంధిస్తారు. జ్వరంతో ఆసుపత్రికి వెళ్తుండగా గొడవ చేసిన బంగారప్ప కంపెనీ మనుషుల నుంచి కాపాడిన రాంబాబుతో రత్తాలుకి దగ్గర పరిచయం ఏర్పడుతుంది. అదే రాత్రి సినిమా నుంచి తిరిగి వస్తూ బాగా తాగి పడిపోయిన రాంబాబుని నరసమ్మ కంపెనీకి తీసుకొని వస్తుంది. తరువాత జ్వరంగా ఉన్న అతణ్ణి ఆసుపత్రిలో చేరుస్తుంది. రాంబాబు మిత్రుడు కృష్ణ ఊళ్లో లేకపోవడంతో చివరికి రాత్రి ఒక పురుషుడితో గడిపి వచ్చిన డబ్బుతో చికిత్స చేయిస్తుంది. కృష్ణ తిరిగి వచ్చిన తరువాత రాంబాబును అతనికి అప్పగిస్తుంది రత్తాలు. రాంబాబుది కూడా చాలా బాధాకరమైన చరిత్ర. రాంబాబు తల్లి పెళ్లి చేసుకుంటానని చెప్పిన ఒక మగవాడి మోసానికి బలియై, కన్న పిల్లవాణ్ణి స్వయం కృషితో పెంచి పెద్దచేసి చదివిస్తుంది. కంపెనీ నుంచి తప్పించుకున్న రత్తాలు తన ఊరు చేరుతుంది. తన కోసం, అల్లుడి దుర్మార్గంతో చనిపోయిన కూతురుకోసం బెంగపడి పెద్దమ్మ వరాలమ్మ చనిపోయిందని, ప్రెసిడెంట్ కాఫీ హోటల్‌ని స్వాధీనం చేసుకున్నాడని తెలుస్తుంది. వరాలమ్మకు వారసురాలైన రత్తాలును, ఆమెను తీసుకొని వెళ్లడానికి వచ్చిన సింహాచలానికి అప్పగించేస్తాడు ప్రెసిడెంట్. తిరిగి వస్తుండగా పోలీసులు

పట్టుకున్న రత్తాలును అప్పుడప్పుడే ఐ.ఎ.ఎస్ చేసిన రాంబాబు మిత్రుల సహాయంతో విడుదల చేయిస్తాడు. రాంబాబును ప్రేమించిన చదువుకున్న మధ్యతరగతి అమ్మాయి వసంత అవసరమైన సమయంలో అతనికి సహాయం చేయలేకపోతుంది

కృష్ణ తన అక్క రాధమ్మ ఇంట్లో రత్తాలును వంటమనిషిగా చేరుస్తాడు. రాధమ్మ పిల్లలతోపాటు ట్యూషన్‌మాస్టరు దగ్గర తాను కూడా కొంత చదవడం రాయడం నేర్చుకుంటుంది. రత్తాలు రాధకు అండదండగా ఉంటుంది. ఇంతలో ఏదో నేరంపైన జైలుకి వెళ్లిన రాధ భర్త తిరిగి విడుదలై వస్తాడు. రాంబాబుకి చికిత్స చేయించడానికి డబ్బు కోసం రత్తాలు ఒక రాత్రి గడిపిన మనిషే రాధ భర్త. రాధకు కూడా రత్తాలు పూర్వచరిత్ర తెలుస్తుంది. ఏమీ చేయలేక ఇల్లు వదలడానికి సిద్ధం అవుతుంది రత్తాలు. ఈ దశలో నవల ఆగిపోతుంది. పనిలోంచి తీసేసి వెళ్లమన్న రాధమ్మతో రత్తాలు శాంతంగా అన్నమాటలివి. పూర్తయిన భాగంలో ఇవి చివరి సంభాషణలు.

"లేదండమ్మా! ఇందులో తమరి తప్పులేదు. వసంతమ్మగారి తప్పు లేదు. తప్పంటూ ఏదైనా ఉంటే నేను పుట్టినట్టుగా పుట్టి, నేను పెరిగినట్టుగా పెరిగి, నేను మోసపోయినట్టుగా మోసపోవడం నాది తప్పు. కాకపోతే నాలాంటి వాళ్ల బతుకులిలా మండి తగలడుతూంటే ఊరంతా అంటీ ముట్టనట్టు, ఏఁవీఁ ఎరగనట్టు ఊరుకోవడం ఊరి తప్పు. లేకపోతే, ఇంత మంచి లోకాన్ని పుట్టించి మాలాంటి వాళ్లని మాత్రం మంటల్లో తోసేయడం - భగవంతుడంటూ ఉంటే ఆయన్ది చాలా పెద్ద తప్పు. మరింక భగవంతుడిది కూడా తప్పు కాదంటారా? మరైతే ఈ తప్పులన్నింటికీ ఎవరిత్తప్పు?"

"అంచేత, ఇందులో నా తప్పు లేదంటే తఁవఁరు నమ్మక పోవచ్చు. కాని తఁవఁరి తప్పు మాత్రం లేదని మాత్రం నేను నమ్ముతాను. అంచేత నేను వెళ్తాను.........."

రత్తాలు, రాంబాబుల ప్రధాన కథచుట్టూ వేశ్యాగృహాలలో వేశ్యాజీవితంతో పాటు జిల్లా రాజకీయాలు, కోర్టులు, లాయర్లు, మురాయుద్దాలు, కంపెనీల మధ్య పోటీలు, పోరాటాలు, డబ్బుఆడించేనాటకం, మధ్యతరగతి ఆత్మవంచన-ఆధునిక పట్టణ జీవితానికి సంబంధించిన అన్ని కోణాలను చిత్రిస్తాడు రావిశాస్త్రి. రత్తాలును నరసమ్మ కంపెనీకి వెయ్యి రూపాయలకు సింహాచలం అమ్మి వేసినప్పుడు రచయిత కల్పించుకుని ఇలా వ్యాఖ్యానిస్తాడు.

"బేరాల లోకం చాలా బాగుంది.

అవును, బేరం సెటిలయిపోయింది. సరుకు డెలివరీ అయిపోయింది. డబ్బు

చేతులు మారిపోయింది. మరింక మనిషి బతుకు కాలిపోయిందంటావా? ఎవడిక్కావాలి? హుకేర్స్"

అవును

"నూటికి డెబ్బై మందికి గంజినీళ్లు దొరకనప్పుడు యీ నరసమ్మ కంపెనీలో వయసుపిల్లలకి బిరియానీభోజనం, బ్రాందీపానీయం అమరసుఖాలు లభిస్తుండగా అందుకు తప్పుపట్టే ముష్టి చచ్చినోళ్లెవరుంటారు? మరింక ముండ పాపలు మూణ్ణాళ్లే బతుకుతారంటే అది యిటువంటి సరససమయాల్లో తేవలసిన ప్రశ్నకాదు. అయామ్ వెరీ సారీ! ప్లీజ్ డునాట్ థింక్ ఐయామ్ స్నబ్బింగ్ యూ-కాని సమస్యని మీరు అన్నికోణాల నుంచి పరిశీలించరేం? ముండ పాపలు మూణ్ణాళ్లే బతుకుతారంటే అదొక ఆర్గ్యుమెంటా? నూటికి తొంభై మంది మన దేశంలో మూణ్ణాళ్లే బతుకుతారు. ప్లీజ్ లీవ్‌దట్ ఆస్పెక్ట్. కాని ఓనర్లు చిరకాలం బతుకుతారు. అధికార్లు కలకాలం వర్ధిల్లుతారు. ఆ ఆస్పెక్ట్ మీరెందుకు చూడరు? ఈ సమస్య ఆ కోణాన్నించి ఎందుకు పరిశీలించరు?"

ధనికవర్గం, అధికారవర్గాల తలకిందుల వికృతవాదానికి ఇది ఒక మచ్చుతునక.

రత్తాలు-రాంబాబు ధారావాహికంగా వస్తున్నప్పుడే ఆ రచనపైన విమర్శలనేకం వచ్చాయి. రావిశాస్త్రి కల్పించిన సన్నివేశాలు, సృష్టించిన పాత్రలు అదుపుతప్పి వాటికే రచయిత అధీనం అయిపోతాడనేది ప్రధాన విమర్శ. దానికి రావిశాస్త్రి చెప్పిన సమాధానం "కథ రాసేక, దాన్ని మరింక విడిచిపెట్టక, దానిమానాన్న దాన్ని బతకనివ్వక లేదా చావనివ్వక ఆ రాసినవాడు దాన్ని సాకుతూ, సంరక్షించు కుంటూ, సమర్థించుకొంటూ నెత్తిన పెట్టుకొని తిరగడం నాకిష్టం లేదు" అని.

## సొమ్ములు పోనాయండి

గ్రామీణ భూసంబంధాలు ఆధారంగా రావిశాస్త్రి రాసిన ఒకే ఒక నవల 'సొమ్ములు పోనాయండి'. పార్యంతికంగా నవల రాజ్యాంగయంత్రంమీద విమర్శగానే సాగుతుంది. గ్రామ స్థాయిలో పాలనాయంత్రాంగంలో ప్రెసిడెంటు, మునసబు, కరణం, జిల్లా స్థాయిలో అధికారులు, కోర్టులు, జడ్జీలు, పోలీసులు ఏ స్థాయిలో అయితేనేం హక్కులు, న్యాయం ఇవన్నీ పైవాళ్లు కొందరికి మాత్రమే అనుకూలంగా ఉంటాయని, సామాన్యులకవి అందుబాటులో ఉండేవి కావని నవల చెప్తుంది. ఈ యంత్రాంగపు వలలో చిక్కుకుని బాధలే తప్ప ఇంకేమీ ఎరుగని వాళ్ల కథే 'సొమ్ములు పోనాయండి'. అరవై పేజీల చిన్న నవల ఇది. ప్రధాన పాత్ర దాసరి బోడయ్య చెప్పినట్టుగా ఉత్తమ పురుష కథనంలో సాగుతుంది నవల. నవల ఇలా ప్రారంభమవుతుంది.

సొమ్ములు పోనాయండి
అదండి! అది ఆరాంబఁవండి
జెత పోతులండి!
జెనం నిలబడి సూసీవోరండి.
అలాంటి సొమ్ములండి పోనాయండి.
సొమ్ములు పోనాక, బూదేవత గూడా పోనాదండి. ఆ
యెనకనుంచి సంసారవంతా సల్లారి పోనాదండి.
మనం బోతాంగాని, బూదేవత పోదండి. మరంచేత,
ఏటైనాదన్న మాటండి!
నా బూదేవత ఉందిగానీ, అందుమీద నాను లేనండి,
ఉంకోడున్నాడండి.
ఆడికి నాను అమ్మలేదండి. ఆడు నా బూదేవతని బలివిఁ
ని అక్కర మిచ్చీసుకున్నాడండి".

బోడయ్య పరిస్థితుల్ని ఎదుర్కొంటాననే కృతనిశ్చయంతోటి మాటలతో నవల ఇలా ముగుస్తుంది.

"అయితే నేట్లెండి! జామినిస్తే బైటికి ఎల్తాను. ఇవ్వకపోతే గోడలు గుద్ది బద్దలు కొట్టయినా బైటికెల్తాను. ఎల్తాను!! ఎల్లి ఆ పెసిడెంటుగోణ్ణి నరుకుతాను! నరికీ ఆ నెత్తురు నా పెల్లం నేలకొరిగిన సోటా, నా జగిలీడు పేనాలిడిసిన సోటా నాబూదేవతమీద చల్లుతాను! విందుకు తిరుగు నేదు! విది నా మాట. ఉత్తమాటగాదు. విది చిలాచ్చరాల మాట."

దాసరి బోడి తనకున్న నలభై సెంట్ల భూమిలో వ్యవసాయం చేసుకోవడానికి జత ఎద్దుల్ని కొనడంకోసం ప్రెసిడెంటు దగ్గర మూడు వందల రూపాయలు అప్పు తీసుకుంటాడు. వడ్డీ పాతిక రూపాయలు. ప్రోనోటు మాత్రం ఆరు వందలకు రాయించుకుంటాడు ప్రెసిడెంటు. నోటు రాసినవాడు కరణం. ప్రెసిడెంటుకి బోడిగాడి భూమిని ఎలాగైనా తన భూమిలో కలిపేసుకోవాలని ఉంది. మరో పేద రైతు తన భూమిని తాకట్టుపెట్టి ప్రెసిడెంటు దగ్గర అప్పు తీసుకుంటాడు. అప్పు తీర్చకపోవడంవల్ల ఆ భూమిని ప్రెసిడెంటు స్వాధీనం చేసుకుంటాడు. అలా స్వాధీనం చేసుకున్న భూమికి, ప్రెసిడెంటు భూమికి మధ్య బోడయ్య భూమి ఉంది. దాన్ని కూడా కలిపేసుకోవాలని ప్రెసిడెంటు ఆలోచన. ఒకరోజు బోడయ్య ఎద్దుల్ని ఎవరో తోలుకు పోతారు. మామూలుగా పోతే ఎద్దులు దొరికేవే. కాని ఎవరో కావాలని చేసిన పని. ఎద్దులు పోయిన కొన్ని రోజులకి ప్రెసిడెంటు బోడయ్యను తన అప్పు విషయం అడుగుతాడు. ఎద్దులు పోయినా అప్పు అప్పే. అప్పెంత? అంటే ప్రోనోటు ప్రకారం ఆరువందలు. నోటులో ఎంత ఉంటే అంతే తీర్చాల్సి ఉంటుందంటారు కరణం, ప్రెసిడెంటు. బోడయ్య భార్య ప్రెసిడెంటుని

తిడుతుంది. ప్రెసిడెంటు అన్న కొడుకు చిన్నారావు ఆమెను కొడతాడు. అది చూసి సహించలేని బోడయ్య చిన్నారావుని కొడతాడు. అసలు సంగతిపోయి కొట్లాట సంగతి ప్రధానం అవుతుంది. టౌనుకు వెళ్లి బోడయ్య, బోడయ్య భార్యలతో పాటు కూతురు సిలకను కూడా కలిపి దొమ్మీ కేసు పెడతాడు. అప్పు కేసుతోపాటు క్రిమినల్ కేసు. టౌనులో అధికారులూ, పోలీసులూ, వాళ్లకి ఊతంగా నిలిచే మరికొందరు సిలకను ఎత్తుకుపోయి అఘాయిత్యం చేసి రైలుకింద పడేస్తారు. క్రిమినల్ కేసులో బోడయ్యకు శిక్షపడుతుంది. రాజీ ప్రయత్నాలలో భాగంగా తన భూమిని సెంటుకి వంద రూపాయల చొప్పున ప్రెసిడెంటుకి అమ్మడానికి సిద్ధపడతాడు బోడయ్య. అయితే భూమిని కొలిచిన కరణం భూమి ముప్పై సెంట్లే ఉందంటాడు. దానిపైన గొడవై రాజీప్రయత్నం చెడిపోతుంది. చిన్నారావు కొందరు రౌడీల సహాయంతో బోడయ్య భూమిని దున్నబోతాడు. జరిగిన దొమ్మీలో బోడయ్య చిన్నారావును చంపేస్తాడు. బోడయ్య భార్యను, బోడయ్య జగిలీడుని రౌడీలు చంపేస్తారు. బోడయ్య బావమరిదికి గాయాలవు తాయి. జనం రెచ్చి పోయి ప్రెసిడెంటు ఇంటికి నిప్పుపెడతారు. బోడయ్య జైలు పాలవుతాడు. ప్రెసిడెంటునీ అరెస్టు చేస్తారు. కాని అతనికి జామీను దొరుకు తుంది. బోడయ్యకు దొరకదు.

*మూడు కథల బంగారం*

మనిషి కష్టం = మంచి బంగారం.
బంగారం అది మానాన్న కష్టం.
బంగారం అది మా చెల్లి అందం.
బంగారం అది మా చినబావ దుర్మార్గం.
బంగారం అది నా జీవితానికి నాశనం.
ఆ దినం బంగారం న్నా జీవితానికే నాందీ వాక్యం.
మనిషి కష్టం బంగారం, మనిషి మాయ బంగారం.
మనిషి కష్టం బంగారం, మనిషి దోపిడి బంగారం.

ఇవి బంగారానికి వివిధ రూపాలు. ఆ బంగారంకోసం కష్టాలు. దానికోసం దుర్మార్గాలు. దానికోసమే దోపిడీలు. ప్రతిగా బంగారం ప్రదర్శించే మాయలు. వీటి కథలే మూడు కథల బంగారం. అన్ని రకాలైన సంపదలకీ బంగారం గుర్తు. అన్ని రకాల ఉత్పత్తులకీ వినిమయ రూపం బంగారం. బంగారాన్ని ప్రతీకగా తీసుకొని డబ్బు చేసే వికృత తాండవాన్ని చిత్రిస్తాడు రావిశాస్త్రి ఈ నవలలో.

ఈ నవలలో నాలుగు కథలున్నాయి. మొదటిది వియత్నాం విమల కథ. తక్కిన మూడు కథలు వరుసగా బంగారుబాబు, బంగారిగాడు, బంగారయ్యగార్ల

కథలు. ఈ ముగ్గురూ ఒకరే అని, అతడు విమల వృత్తాంతంలో విమల వివాహ సందర్భంగా దూరంగా నిలుచుని చూచిన యువకుడే అని చివరి కథదాకా పాఠకుడికి తెలియకపోవటం ఉత్కంఠ కలిగించే లక్షణం. మొదటి కథ తరువాత చివరి కథలోనే విమల కనిపిస్తుంది. మొదటి కథ ప్రత్యక్ష కథనంలో ఉంది. తక్కిన మూడు కథలూ ఉత్తమ పురుష కథనంలో ఉన్నాయి. చివరికి ఇద్దరి కథలు కలసినట్టుగానే రెండు రకాల కథనాలు సమన్వయిస్తాయి.

విమలకి ఇద్దరు అన్నలు, ముగ్గురు అక్కలు. పెద్ద కూతురికి, రెండో కూతురుకి పెళ్లిళ్లు చేసి చితికి పోయాడు తండ్రి. అన్నలిద్దరూ పెళ్లిళ్లు చేసుకొని సొంత ప్రయోజనాల కోసం వేరే కాపురాలు పెట్టారు. మూడో కూతురు సరళ దాసు అనే ఒక బంట్రోతు కొడుకు నడిపిన ప్రేమ వ్యవహారానికి మోసపోయి ఆత్మహత్య చేసుకుంటుంది. తరువాత తల్లి చనిపోతుంది. విమల తండ్రి భూమి అమ్మిన డబ్బుతో భార్య అంత్యక్రియలు జరిపిస్తాడు. విమల పెళ్లికి వాగ్దానం చేసిన కట్నం ఇవ్వలేక పోతాడు. సరిగ్గా పెళ్లి సమయంలో కట్నం ఇచ్చేస్తే మంగళసూత్రం కడతానంటాడు పెళ్లికొడుకు. విమల పెళ్లికొడుకును చెంపమీద చెళ్లున వాయించి పుస్తె లాక్కొని దాన్ని అతని మెడకు కట్టి "నువ్వు నాకు మొగుడివిగా ఉండలేవు. అంచేత ఇకమీంచి కనీసం పెళ్లాంగా అయినా బతుకు, ఫో!" అని అతణ్ణి రెండు చేతులతో వెనక్కు తోసేసి వెళ్లిపోతుంది. ఒక యువకుడు దూరంగా ఉండి ఈ సంఘటనను చూస్తూ ఉంటాడు.

చితికిన కుటుంబంలో పుట్టి పెరిగిన బంగారుబాబు కుటుంబంలో తన అనుభవంతో "ఈ జీవితంలో బాధల్ని జయించడానికి బంగారం పనికి వస్తుందని ..." గ్రహిస్తాడు. బంగారుబాబుకి ఒక అక్క, ఒక చెల్లెలు. అక్కకు పెళ్లవుతుంది. తండ్రి అవసరానికి తల్లి పుస్తె తాడును తాకట్టు పెట్టి మూడు సంవత్సరాలకు విడిపించుకొని వస్తాడు. పుస్తెతాడు చేయించటానికి ఎన్ని కష్టాలు పడ్డానో విడిపించడానికి అన్ని కష్టాలు పడ్డానంటాడు తండ్రి. అప్పుడు అనుకుంటాడు 'మనిషి కష్టం-మంచి బంగారం' అని. తండ్రి చనిపోతాడు. తనూ, అమ్మా, చెల్లీ, అక్కా,బావల పంచన చేరుతారు. తల్లి పుస్తెను చెరిపించి అక్కకు గాజులు, చెల్లిమెడకి ఒక గొలుసు, దుద్దులు చేయిస్తుంది. అమ్మకి బంగారు పుస్తెలతాడు అందాన్నిచ్చింది. బంగారం అంటే అందం అని అర్థం అయింది బంగారు బాబుకి. తరువాత తల్లి చనిపోతుంది. బావ సవతి తమ్ముడు డబ్బు కోసం తనచెల్లిని ఎక్కడికో తీసుకొనివెళ్లిచంపిఒంట్లో బంగారం తీసుకొనిపోతాడు. అప్పుడు అవగాహన అవుతుంది తనకి బంగారం అంటే దుర్మార్గం అని, అది తన జీవితాన్ని నాశనం చేసి అనాథగా మిగిల్చిందని.

మూడవ కథలో బంగారిగాడు మోసాలు, దొంగతనాలు చేసి డబ్బు

సంపాదిస్తాడు. తాను దొంగిలించి తెచ్చిన బంగారాన్ని పోలీసులు మార్చి మాయచేసి తక్కువరకం బంగారంగా మార్చి కేసు పెడతారు. తరువాత దొంగనోట్ల వ్యాపారంలో కొందరిని మోసం చేసి డబ్బు సంపాదిస్తాడు. ఒక పెళ్లికి వెళ్లే గుంపుతో ప్రయాణం చేసి వాళ్లందరూ ఒక సజ్జలో దాచుకున్న బంగారాన్ని దోచుకుంటాడు. అందుకే మనిషి కష్టం బంగారం, మనిషి దోపిడీ బంగారం అవుతుంది. నాలుగవ కథలో బంగారయ్య తన అసలు పేరు కడవలూరి వీరవెంకట సత్యనారాయణమూర్తి (విమల వివాహాన్ని దూరంగా ఉండి చూచిన యువకుడు)గా చెప్పుకుంటాడు. కాని అందరికీ అతడు బంగారయ్యే. సారా కాంట్రాక్టులు, ఇతర వ్యాపారాలు చేసి బాగా డబ్బు సంపాదిస్తాడు. రాజకీయ నాయకులలో, అధికారులలో మంచి పలుకుబడి సంపాదిస్తాడు. ప్రభుత్వ యంత్రాంగాన్ని ప్రభావితం చేసే శక్తిగా ఎదుగుతాడు. పెళ్లికొడుకును కొట్టి వెళ్లిన విమల ఆ ఊరి ఆసుపత్రిలో నర్సుగా బంగారయ్యకు తటస్థపడుతుంది. తన కోరిక తోనే విమలను ఒప్పించి పెళ్లి చేసుకుంటాడు. విమల సాహచర్యంతో అతనిలో ఆత్మవిమర్శ మొదలవుతుంది. విమల గర్భవతి అవుతుంది. ఒంటినిండా బంగారు నగలు ధరించి భర్తతో కొండపైన దైవదర్శనానికి బయలుదేరు తుంది విమల. ఆ బంగారం కోసం ఒక దొంగ హత్యా ప్రయత్నం చేస్తాడు. గాయపడిన విమల అమ్మాయిని కని చనిపోతుంది. తరువాత బంగారయ్య విమల చేసిన ఏర్పాట్ల వల్ల చట్టానికి చిక్కి జైలుశిక్ష అనుభవిస్తాడు. బంగారయ్యలో మార్పురావడం, ఆత్మవేదనకు గురి కావడంతో కింది వాక్యాలతో నవల ముగుస్తుంది.

> "అయితే
> నీవైనా, నావైనా పాపాలన్నీ ఎలాపోతాయి?
> అందుకు సమాధానం -
> నువ్వూ నేనూ చేసిన పాపాలవల్ల ఎవరైతే నష్టపడ్డారో,
> బాధపడ్డారో -
> వారే చెప్పాలి! అంతేకాని, నువ్వూకాదు, నేనూకాదు,
> భగవంతుడైనా కాదు"

మూడు కథల బంగారాన్ని చిన్నకథగా రాయాలని ప్రారంభిస్తే అదొక చిన్న నవలగా మారి పెరిగిందంటాడు రావిశాస్త్రి నవల పీఠికలో సృష్టించాలనుకున్న కొన్ని పాత్రలు సృష్టించబడ్డాక తన వశం తప్పిపోగా వాటిని నిలబెట్టి ఆపడంలో తనకు కొంత కష్టం అయిందని కూడా అంటాడు.

ఈ నవలలో విశిష్టమైన పాత్ర వియత్నాం విమల. పురుషాధిక్యతను, దురాచారాల్ని ఎదుర్కోవడంలోను, నర్సుగా డాక్టర్లు కూడా సరిగ్గా డ్యూటీ చేసేట్టు

చూడడం లోను, వ్యవస్థ దుర్మార్గాలలో కూరుకుపోయిన బంగారయ్యలో మార్పు తీసుకొనిరావడానికి ప్రయత్నించడం లోను ఆమె చూపిన చైతన్యం అప్పటికి తెలుగు సాహిత్యంలో కొత్త మలుపు. సాధారణంగా రావిశాస్త్రి రచనల్లో స్త్రీ పాత్రలు అన్ని పాత్రలలో భాగంగా మాత్రమే కనిపిస్తాయి. కానీ 'విమల' ఆయన సృష్టించిన పాత్రలలో ప్రత్యేక వ్యక్తిత్వంగల పాత్ర.

ఇల్లు

రావిశాస్త్రి చివరి రోజులలో రాసిన నవల 'ఇల్లు'. రావి శాస్త్రి చివరి రోజులలో రియల్ ఎస్టేట్ వ్యాపారం చాలా వికృతంగా పట్టణాల్లో విస్తరించడం గమనించి ఉంటాడు. 'ఇల్లు కొందరికి వుండటానికి గూడు, మరికొందరికి అది సంపాదించవలసిన ఆస్తి' అంటాడు రావిశాస్త్రి ఈ నవలలో ఒకచోట. ఒక పట్టణంలో వితంతువు చిట్టెమ్మ ఇల్లు చుట్టూ తిరుగుతుంది నవలలోని ఇతి వృత్తం. ఇల్లుని ఆస్తికి ప్రతీకగా తీసుకొని నవల రాశాడు రావిశాస్త్రి. మామూలుగానే అన్ని నవలల్లోలాగా ప్రభుత్వ యంత్రాంగం, న్యాయవ్యవస్థ, పాలనా వ్యవస్థ, స్థానిక రాజకీయాలు, స్థానిక నాయకుల మధ్య పోటీలు, కక్షలు అన్నీ ఈ నవలలో కూడా ఉన్నాయి. వీటి అన్నిటి మధ్య చిట్టెమ్మ తన ఇంటిని అమ్ముకోక తప్పని పరిస్థితి ఏర్పడుతుంది. పదిహేను వందల గజాల స్థలంలో నాలుగిళ్ల వాకిలి చిట్టెమ్మ ఇల్లు. పెంకుటిల్లేగాని డాబా లేదు. పెరుగుతున్న నగరంతో ఆ స్థలం విలువకూడా పెరుగుతోంది. దాన్ని ఎలాగయినా సొంతం చేసుకోవాలనే ప్రయత్నం సోమయాజులుది. దాన్ని కొనాలని చూస్తున్న వాడు గోపికామనోహరం. అక్కడ మంచి కమర్షియల్ కాంప్లెక్సు తేవడానికి వీలుండడమే వాళ్ల కన్ను ఆ ఇంటి స్థలంపైన పడటానికి కారణం. త్వరలో ఆ పట్టణం మెగాసిటీ కాబోతున్నది. అందువల్ల చిట్టెమ్మ ఇంటిపక్క ఇల్లు కొనడానికి వచ్చిన మనోహరానికి చిట్టెమ్మ ఇంటిమీద కూడా దృష్టిపడింది. పక్కిల్లూ, ఈ ఇల్లూ కలిస్తే ఏం చేయలేం అనుకుంటాడు మనోహరం. సోమయాజులు, గోపికా మనోహరంల మధ్య ఏర్పడ్డ పోటీలో అడిషనల్ డి.ఎస్.పి చిట్టిబాబు తన అధికార బలంతో సోమయాజుల్ని లొంగదీసుకొని తానూ ఆ ఇంటిలో భాగం తీసుకొనేట్టు ఏర్పాట్లు చేస్తాడు. చిట్టెమ్మ ఇల్లు సో.మ.నా ఎంటర్‌ప్రైజ్ వారి అధీనం అవుతుంది. అక్కడ కాంప్లెక్స్ కట్టడానికి ముఖ్యమంత్రితో శంకుస్థాపన చేయించడానికి ఏర్పాట్లు జరుగుతాయి. సోమయాజులు, మనోహరం, చిట్టిబాబు అల్లుడు నానారావు అందులో పార్ట్నర్స్.

ప్రధాన కథలో భాగంగా అనేక సామాజికాంశాలను చిత్రించాడు రావిశాస్త్రి ఈ నవలలో. బ్రాహ్మణులలోని శాఖా భేదాలను, శాఖల మధ్య ఉండే పరస్పర అనుమానాలను, ద్వేషాలను నవలలో చిత్రించాడు. ప్రజాసంక్షేమంలో భాగమైన వైద్యరంగంలో అవినీతిపరులు, వైద్యవిద్యతో వ్యాపారం చేసి ప్రాణాలతో

చెలగాటమాడే డా॥ సువర్ణ సుందరి వంటివారు కూడా ఈ నవలలో కనిపిస్తారు. ముఖ్యమంత్రి పదవి కోసం పోటీపడే రాష్ట్రస్థాయి రాజకీయాలున్నాయి. రావిశాస్త్రి 1993లో రాసిన ఈ నవలలో ప్రధాన కథకు సమాంతరంగా సాయుధ విప్లవోద్యమ కార్యక్రమాలను కూడా చిత్రించాడు. చిట్టెమ్మ మేనల్లుడు ఉదయ భాస్కరం ఒక విప్లవోద్యమ దళానికి నాయకుడు. ఉదయ భాస్కరం తమ్ముడు అరుణ ప్రకాశం. ఈ పేర్లు పెట్టడంలో కూడా విప్లవోద్యమంపైన తనకుండే ఆసక్తిని ప్రదర్శించాడు రావిశాస్త్రి. నవల ముగింపు ఇలా ఉంటుంది -

"ఈ
(భగవత్) సృష్టిలో
న్యాయం లేదు, ధర్మంలేదు, సత్యం శివం లేనేలేవు.
ఇంతవరకూ, కొంతవరకూ

సర్వజీవజాలాన్నీ సమన్వయపరచి, సమానత్వం సాధించి, న్యాయం నిలబెట్టి ధర్మ సంస్థాపనకి తాపత్రయ పడేదీ మానవుల్లో కోటికి ఒక్కడే, ఒక్కడే, కోటికి ఒక్కడైనా మానవుడే, మానవుడే!"

## నవలా సారాంశం

'ఆడదాని సాహసం' ఒకరకంగా రావిశాస్త్రి ప్రాథమిక రచన. అయినా ఆసక్తిగా చదివించే నవల. 'అల్పజీవి' మధ్యతరగతి జీవితాన్ని చిత్రించే, మనస్తత్వ చిత్రణ ప్రధానంగా గల నవల. ఈ నవలను వదిలేస్తే తక్కిన నవలల్లోని ప్రధాన ఇతివృత్తానికి, వృత్తాంతాలకు సమానమైన నేపథ్యం, ఏకసూత్రత ఉంది. అది సంక్లిష్ట జీవనంపైన, సంకీర్ణ వ్యవస్థపైన విమర్శ. ఒకప్పటి భూస్వామ్య వ్యవస్థలో ఆధిపత్యం వహించినవారి వారసులే ఆధునిక కాలంలో రాజకీయాలలో, పాలనా యంత్రాంగంలో అధికారాన్ని చలాయిస్తున్నారు. భూస్వామ్య వ్యవస్థలో క్రౌర్యం ప్రత్యక్షంగానే కనిపిస్తుంది. ఆధునిక ప్రజాస్వామ్యం పేరిట వడుస్తున్న వ్యవస్థలో మోసంతో అధికారాన్ని నడపడం కనిపిస్తుంది. తడిబట్టతో గొంతులుకోయడం ప్రస్తుతం అధికార లక్షణం. అధికార దురహంకారం రెండింటిలోను సమానమే. స్వాతంత్ర్యం తరువాత మనం అమలు చేస్తున్న రాజ్యాంగం వలస పాలన నుంచి సంక్రమించి కొనసాగుతున్నది. వలసపాలకులు తమ పాలనను కొనసాగించ డానికి, స్థిరపరచుకోవడానికి ప్రవేశపెట్టిన చట్టాలే ఇప్పటికి కొనసాగుతున్నాయి. గురజాడ అప్పారావు "ఆధునిక పాశ్చాత్య రాజ్యాంగ వ్యవస్థ, దాని పరిపాలనా పద్ధతి ఒక చిత్రమైన కలగూర గంప. ఇందులో కొద్ది మానవత్వం వున్నప్పటికీ మితిలేని స్వార్థపరత్వంతో ఇది కూడుకుని ఉంది. ఈ రెండింటిలో ఏది

జయిస్తుంది? స్వార్థపరత్వమే కాబోలు!" అంటాడు ఒక లేఖలో. అవును స్వార్థపరత్వమే జయించింది. ఈ స్వార్థపరత్వమే కొనసాగుతూ మూడుపూవులు ఆరు కాయలుగా వర్ధిల్లుతున్నది. రాజ్యాంగ స్వరూపంలోనే అది కలిసిపోయి ఉందేమో అనిపించేటంతగా అది వికృతరూపాన్ని ధరించింది. దీనికి సంబంధించిన అన్ని కోణాలను బహుముఖంగా రావిశాస్త్రి తన నవలలలో చిత్రించాడు. గ్రామస్థాయిలో, మున్సిపల్ స్థాయిలో, జిల్లా స్థాయిలో, రాష్ట్ర స్థాయిలో, దేశ స్థాయిలో రాజకీయాధికారం సమాజాన్ని వికృతంగా శాసిస్తున్నది. డబ్బుతో డబ్బు కోసం ఏర్పడ్డ డబ్బుకలవారి రాజ్యంగా ప్రస్తుత వ్యవస్థ కనిపిస్తుంది. ఇటువంటి రాజకీయాధికారమే రాజ్యాంగానికి సంబంధించిన అన్ని అంగాలను ప్రభావితం చేస్తున్నది. అవి పరస్పర అవసరాలకు సహకరించు కుంటున్నాయి. సామాన్యులు, బక్కరైతులు, శ్రామికులు, ఆత్మవిశ్వాసం లేని మధ్యతరగతివారు, స్త్రీలు వ్యవస్థమాయాజాలంలో తమ ప్రసక్తి లేకుండానే చిక్కుకొని పోతున్నారు. నేరస్తులుగా తయారు చేయబడ్డవాళ్లు దుర్భర జీవితాన్ని, వాళ్లను నేరస్తులుగా చేసినవాళ్లు సుఖ జీవితాన్ని అనుభవిస్తున్నారు. ఇది రావిశాస్త్రి నవలలలో వస్తు సారాంశం.

ఈ వ్యవస్థ వికృత రూపాన్ని చిత్రించడంలో శిల్పంలో ఒక్కొక్కసారి రావిశాస్త్రి సంయమనాన్ని కోల్పోయాడేమో అన్న విమర్శ ఉంది. సంయమనాన్ని కోల్పో తున్నట్టు, పాత్రలు, సన్నివేశాలు అదుపుతప్పిపోతున్నట్టు రావిశాస్త్రి స్వయంగా చెప్పుకున్న సందర్భాలున్నాయి. చుట్టూ ఉన్న జీవితంపైనా, దానికి కారణమైన వ్యవస్థపైనా, వృత్తిపరంగా తాను స్వయంగా చూసిన అన్యాయ, అధర్మాలపైనా రావిశాస్త్రికుండే ఆవేశం, ఆక్రోశం, కోపం, తపన, ప్రతీ అంశాన్ని విస్తరించి, వివరించి, ఒకే విషయాన్ని అనేక రకాలుగా వర్ణించి చెప్పడానికి కారణాలై ఉంటాయి. రచనలను చదివినవారికి ఈ విషయంలో రావిశాస్త్రికిగల నిజాయితీ స్పష్టమవుతుంది. రావిశాస్త్రి రచనాప్రతిభ ఈ అసంయమనాన్ని కూడా కప్పివేసి పాఠకుణ్ణి చివరంటా చదివిస్తుంది.

రావిశాస్త్రి నవలలలో కనిపించే మరో విశేషం సినిమా శిల్పం. చదువుతుంటే చూస్తున్న అనుభవాన్ని కలిగిస్తాయి ఆయన నవలలు. ప్రతి నవలా ఒక సినిమాకు స్క్రీన్‌ప్లే రాసినట్టుగా ఉంటుంది. రావిశాస్త్రి నవలలను శ్రద్ధగా చదివితే ఏ మాత్రం సృజనాత్మకత లేని దర్శకుడు కూడా గొప్ప సినిమా తీయగలుగుతాడు. అన్ని కోణాల నుంచి చిత్రించిన పాత్ర స్వరూప స్వభావాలను జాగ్రత్తగా గుర్తించిన ఏ నటుడైనా,నటిఅయినా అప్రయత్నంగా గొప్ప నటనను అందించగలరు. వర్ణించిన నేపథ్యాన్ని, సన్నివేశాన్ని చూడగలిగిన ఏ ఛాయాగ్రాహకుడైనా కెమేరాను అలవోకగా

కళాత్మకంగా ఉపయోగించుకోగలడు. నాటక ప్రయోగం రావిశాస్త్రికి ఆనుషంగికమే అయింది. న్యాయవాద వృత్తికి, సాహిత్య కళకు, విశాఖపట్టణానికి మాత్రమే పరిమితమై ఉండకపోతే ఆయన అంతర్జాతీయ స్థాయిలో నిలబడగలిగిన సినిమాలు కూడా తీయగలిగి ఉండేవాడనిపిస్తుంది.

# 6. నాటకత్రయం

రావిశాస్త్రి స్వయంగా నటుడు, నాటక ప్రయోక్త, దర్శకుడు కూడా. ఆయన రాసిన మూడు నాటకాలు 'తిరస్కృతి', 'నిజం', ''విషాదం'. నాటకాలలో ఆయన ఇచ్చే సూచనలు, వ్యాఖ్యానాలు, సన్నివేశ కల్పన విషయంలో, ప్రదర్శన విషయంలో, పాత్ర నిర్మాణంలో ఆయనకున్న సునిశిత దృక్పథాన్ని సూచిస్తాయి. నవలలలో లాగే అధికార దురహంకారం, యంత్రాంగం, న్యాయ వ్యవస్థ, పీడిత, తాడిత స్త్రీలు, మధ్యతరగతి జీవితం నాటకాలలో కూడా ప్రధాన వస్తువులు. సంభాషణలద్వారా పాత్రల నేపథ్యాన్ని చూపించగలగడం రావిశాస్త్రి నాటక శిల్పంలోని ప్రత్యేకత.

## తిరస్కృతి

తిరస్కృతి నాలుగంకాల నాటకం. రమణయ్య ప్రముఖ పారిశ్రామికవేత్త. ఆయన రెండవ కొడుకు మోహన్‌బాబు. కుటుంబయ్య రమణయ్యకు బంధువు. రమణయ్యదగ్గరే గుమాస్తాగా పనిచేస్తున్నాడు. కుటుంబయ్య కూతురు కామేశ్వరి. కామేశ్వరి తరువాత కొడుకు. అతడు తీవ్ర జ్వరంతో చనిపోతాడు. మోహన్‌బాబు జులాయిమనిషి. ఆడపిల్లలంటే సరదా. ఆడపిల్లలంటే ఆటబొమ్మలే. అతని మాయలోపడి కామేశ్వరి గర్భవతి అవుతుంది. మోహన్‌బాబు దగ్గరికి వచ్చి చెప్పుకుంటుంది. మోహన్‌బాబు ఆమెతో ఎటువంటి సంబంధమూ లేదని బుకాయిస్తాడు. చంద్రశేఖరం రమణయ్యకు సెక్రటరీ. ఆయన జోక్యం చేసుకొని ఆ విషయం తాను మాట్లాడతానని, ఏ అఘాయిత్యం చేయవద్దనీ చెప్పి కామేశ్వరిని పంపుతాడు.

సోమనాథం కుటుంబయ్య మిత్రుడు. స్కూలు టీచరు. కూతురు పెళ్లికి డబ్బు అవసరం వచ్చి శేఖరం ద్వారా రమణయ్యను కలిసి భంగపడతాడు. అయినా రమణయ్య పెద్దకొడుకు చనిపోతే వచ్చి పరామర్శిస్తాడు శేఖరం మోహన్‌బాబు వ్యవహారం రమణయ్యకు చెప్పి కామేశ్వరితో పెళ్లికి ఒప్పించమని చెప్తాడు. అది తనకు సాధ్యం కాదంటాడు రమణయ్య. ఆయన అనుమతితోనే ఈ వ్యవహారాన్ని చక్కబెట్టడానికి పూనుకుంటాడు శేఖరం. తన ఇంట్లో పార్టీ ఏర్పాటు చేసి మోహన్‌బాబుని ఆహ్వానించి బలవంతంగా కామేశ్వరితో పెళ్లి ఏర్పాట్లు చేస్తాడు. సోమనాథం కామేశ్వరిని తీసుకొని అక్కడికి వస్తాడు. ఇది బలవంతపు వ్యవహారంగా గుర్తించిన కామేశ్వరి "ఇంత బలవంతాన పెళ్లాడిన వీడితో తన బతుకెలా తెల్లారుతుంది" అని తిరస్కరిస్తుంది. సోమనాథం కొడుకు జగన్నాథం కామేశ్వరిని పెళ్లాడడానికి సిద్ధంగా ఉన్నట్టు సూచనప్రాయంగా తెలియజేస్తాడు రచయిత. కొడుకు బాగుపడే అవకాశం లేదని గుర్తించిన రమణయ్య సోమనాధాన్ని సంబోధిస్తూ "మాకు పోయే కాలవే(గాని ఒచ్చేకాలం ఎక్కడిది సోవఁనాథంగారూ!" అన్న మాటలతో నాటకం ముగుస్తుంది.

తిరస్కృతి నాటకం రచనా కాలం 1956. మొదట నాటకానికి పెట్టిన పేరు 'వచ్చేకాలం'. తరువాత మిత్రుల సలహాతో 'తిరస్కృతి'గా పేరుమార్చాడు రావిశాస్త్రి. 1956 నాటికే కామేశ్వరివంటి చైతన్యవంతమైన స్త్రీ పాత్రను సృష్టించడాన్ని ప్రత్యేకంగా గుర్తించాలి.

## నిజం

రావిశాస్త్రి నాటకాల్లో చాలాసార్లు ప్రదర్శితమై బాగా పేరుపొందిన నాటకం 'నిజం'. ఇది ఆరు అంకాల నాటకం. రాజకీయాధికారంలో ఉన్నవాళ్లు తమ స్వార్థంకోసంయంత్రాంగాన్ని,న్యాయవ్యవస్థను ఎలా ఉపయోగించుకుంటున్నారో, దీనివల్ల సమాజంలోని బడుగువర్గం ఎలా అల్లకల్లోలం అవుతున్నదో 'నిజం' నాటకం చెప్పేనిజం. యంత్రాంగం అంతా రాజకీయాధికారంలో ఉన్నవారి ప్రయోజనం కోసం పనిచేసినప్పుడు నిజానికి ఎక్కడా చోటు ఉండదని కూడా ఈ నాటకం చెప్తుంది.

సార్వభౌమరావు పార్లమెంటుమెంబరు. తనకుగల అధికారంతో, పలుకుబడితో ఎవరూ ఎదిరించడానికి వీలులేని స్థాయికి ఎదిగాడు. రాజ్యాంగ యంత్రంలోని ఏ విభాగంలోనూ అతనికి ఎదురంటూ లేదు. సార్వభౌమరావు కొడుకు సుందరం అనబడే సుందరరావు ఆర్మీలో పనిచేస్తున్నాడు. సుశీల అనే చనిపోయిన వంటమనిషి కూతురు సార్వభౌమరావు అధీనంలో, పోషణలో ఉంటుంది.పాతికేళ్ల అందమైన సుశీలను అన్నివిధాలుగా ఉపయోగించుకుంటాడు

సార్వభౌమరావు. సోమసుందరం పాతికేళ్లజులాయి. సుశీలను కలుస్తూ ఉంటాడు. ఒక రోజు ఈ విషయం సార్వభౌమరావు దృష్టిలో పడుతుంది.

సెలవులకి ఊరికి వచ్చిన స్సుందరం ఒక రోజు ఊరవతల చిట్టడవిలో మిత్రులు సత్యం,కృష్ణారావు,మధుసూదనరావులతో మందుపార్టీ పెట్టుకుంటాడు. లా చదువుతున్న సత్యానికి ఎప్పుడూ సుందరాన్ని దెప్పడం అలవాటు. మందు నిషా బాగా తగిలిన తరువాత సుశీలకి సార్వభౌమరావుకి ఉండే సంబంధాన్ని గురించి మాట్లాడతాడు. చివరికి సుందరం కూడా ఆమెని సాకుతున్నాడని అంటాడు. సుందరం తక్కిన మిత్రులు ఎంత వారించినా నిజం చెప్పకుండా నన్నెవరూ ఆపలేరంటాడు సత్యం. సుందరం విస్కీసీసాతో సత్యం తలపైన కొడ్తే సత్యం చనిపోతాడు. ఈ విషయం తెలిసిన సార్వభౌమరావు హత్యానేరాన్ని తన ఇంట్లో సుశీలను కలవడానికి వచ్చిన సోమసుందరంమీద మోపుతాడు. ఎస్.ఐ కిష్టప్ప సార్వభౌమరావుకి బంటులాంటివాడు. మొదట సోమసుందరంపైన ఖూనీ కేసు పెట్టడానికి వెనకాడతాడు. ప్రమోషన్ ఇప్పిస్తాడనే ఆశకు చివరకు ఒప్పుకుంటాడు. కేసు బనాయిస్తాడు. నయాన కృష్ణారావుని, భయాన మధుసూధనరావుని, ఆదేశంతో సుశీలని సాక్షులుగా తయారుచేస్తాడు. ఇది రెండంకాలవరకు నడిచే కథ.

మూడు, నాలుగు అంకాలు కోర్టుసీను. ప్రాసిక్యూషను, డిఫెన్స్, సాక్ష్యాలు నిజాలు అబద్దాలుగా మారడం అంతా మామూలే. కేసు పకడ్బందీగా నడుస్తుంది. సార్వభౌమరావు జడ్జీని కూడా ప్రభావితం చేసినట్టు కేసు విచారణ క్రమంలో సూచితం అవుతుంది. సోమసుందరానికి ఉరిశిక్షపడుతుంది. అయిదవ అంకంలో సుశీల బాధతో సార్వభౌమరావువంటివారు మారే అవకాశం లేదని, అలాంటివారు ఉన్నంతవరకు లోకంలో అన్యాయాలు కొనసాగుతూనే ఉంటాయని ఇల్లు వదలి వెళ్లిపోవడానికి సిద్దపడుతుంది. చివరి అంకంలో ఉరిశిక్ష అమలు కావడానికి ముందు సీనులో లోకం అంతా నిజం పలకాలనేది తన ఆఖరి కోరికగా సోమసుందరం చెప్తాడు. అక్కడ ఉన్నవారందరినీ వారివారిజీవితాల్లో ఇకముందెప్పుడూ నిజానికి నిలబడతామని వీలైతే వాగ్దానం చేయమని అడుగుతాడు.

ఈ నాటకంలోని సార్వభౌమరావు పాత్ర తరువాత నాటకాలలో, సినిమాలలో అనేక దురహంకార, దురధికార పాత్రలకి నమూనాగా నిలిచింది.

## విషాదం

'విషాదం' ఏకాంకిక. ఒక యువతి విషాదగాథ 'విషాదం' నాటకం. ఒక ఏటి

ఒడ్డున పిచ్చిగా తిరుగుతున్న ఒక యువతిని నలుగురు కుర్రాళ్లు వెంటబడి లొంగదీసుకోవడానికి ప్రయత్నం చేస్తారు ఆ యువతి తన విషాదగాథను చెప్పుకుంటూ ఉంటుంది. సినిమా పిచ్చితో ఒక యువకుడితో మద్రాసు వచ్చి మోసానికి గురై ఒక గుడ్డి పిల్లవాణ్ణి కంటుంది ఆ యువతి ఒంటరి అయిన తనను ఆదుకున్న వ్యక్తీ, కొడుకూ ప్రమాదవశాత్తూ ఒక ఏటిలో పడి చనిపోతారు. వాళ్లను వెతుక్కుంటూ పిచ్చిగా ఏటిఒడ్డునే తిరుగుతుంటుంది యువతి. ఆవిడలోని విషాదాన్ని గుర్తించలేని సంస్కారహీనులు ఆ యువకులు. ఆ యువకులు సమాజంలో బాగా పలుకుబడి, హోదాగల అధికారుల, వ్యాపారుల పిల్లలు. ఒక కానిస్టేబులు వాళ్ల పెద్దలదుష్కార్యాలను పొగుడుతూ చెప్పిన మాటల వల్ల ఈ విషయం తెలుస్తుంది. ఆ యువతి జీవిత విషాదాన్ని, యువకుల ప్రవర్తనకు సంబంధించిన సామాజిక విషాదాన్ని గుర్తించగలిగిన సబ్ ఇన్స్పెక్టర్ ఆ యువతిని మరొకచోటికి చేర్చి ఆమె విషాదజీవితాన్ని గురించి వాళ్లకి చెప్పి వార్నింగ్ ఇచ్చి వదిలిపెడతాడు.

# 7. తదితరాలు

కథానిక,నవల,నాటకం కాక రావిశాస్త్రి రచనలలోవ్యాసాలు, సంపాదకీయాలు, కాలం రచనలు, ముందు మాటలు, రాజకీయ ప్రసంగ వ్యాసాలు, ప్రకటనలు, కర పత్రాలు,ఎలిజీలు ఉన్నాయి.సంపాదకీయాలలో ఆయా పత్రికలకు సంబంధించిన లక్ష్యప్రకటనలు, ప్రత్యేక సందర్భాలకు సంబంధించిన అంశాలు ఉన్నాయి. 'కాలం' రచనలలో విశాఖపట్టణానికి సంబంధించి స్థానిక సమస్యల చర్చలు ఎక్కువగా కనిపిస్తాయి. ఈ 'కాలం' రచనలన్నీ ఈనాడు దినపత్రికలో వచ్చినవే. వీటిలో కొన్ని 'డాల్ఫిన్ డైరీ' పేరుతో వచ్చాయి. ప్రసంగ వ్యాసాలు, ప్రత్యేక సంఘటనల సందర్భంగా చేసిన లిఖిత ప్రకటనలు, కరపత్రాలు రావిశాస్త్రి సామాజిక రాజకీయ భావాలను, వివిధ విషయాలపైన ఆయన స్పందనలను తెలియజేస్తాయి. రావిశాస్త్రి రాసిన ముందు మాటలు సుమారు ముప్ఫైదాకా ఉన్నాయి. వీటిలో కొన్ని రచయిత గురించి, ఆ రచయితతో తనకున్న సంబంధాన్ని గురించి చెప్పినవి. కొన్నిటిలో ఆ రచనా ప్రక్రియనుగురించిన పరిచయాలు ఉన్నాయి. కొన్నింటిలో రచనను గురించిన పరిచయాలున్నాయి. మరికొన్నింటిలో రచనలోని సామాజిక స్పృహ, విప్లవ చైతన్యం గురించిన వివరణలు ఉన్నాయి. కొన్ని ముందుమాటలలో సాహిత్యాన్ని గురించి రావిశాస్త్రికిగల అభిప్రాయాలు, గుర్తుంచుకోదగ్గ వ్యాఖ్యలు ఉన్నాయి. ప్రస్తుతం రావిశాస్త్రి వ్యాసాలను, ఎలిజీలను పరిచయం చేసుకుందాం.

## వ్యాసాలు

'ఎందుకు రాసేను' అన్న వ్యాసం విశాఖ రచయితల సంఘం నడిపిన పత్రికకోసం రాసింది. ఈ వ్యాసంలో తాను రచనలు ప్రారంభించిన నేపథ్యం, అభిరుచులు, తనను ప్రభావితం చేసిన రచయితలు, తనకు గల జీవిత దృక్పథం, సాహిత్య దృక్పధం మొదలైన అంశాలను రావిశాస్త్రి వివరించాడు. 'నాకు రాయాలని..... ' అనే వ్యాసం తాను నమ్మే సాహిత్య ప్రయోజనాన్ని గురించి కవితాత్మకంగా చెప్తుంది. 'నా కాలేజీల్లో నేను' ఎ.వి.ఎన్ కాలేజీ మొదలుకొని ఆంధ్రవిశ్వవిద్యాలయం, మద్రాసు లాకాలేజీ వరకు తన విద్యాభ్యాసానికి సంబంధించిన విశేషాలను, సహాధ్యాయులతో,మిత్రులతో తనకుగల అనుభవాలను వివరించిన వ్యాసం.

"శేఖరుగారి "స్త్రీవత్రీ" కథను గురించి కథనాత్మకంగా చెప్పిన వ్యాసం. కథలు రాయడం గురించి, కథలు రాయాలనే కోరిక గురించి, తాను కథలు రాయడం మొదలుపెట్టినవాటి అనుభవాలనుగురించి వివరిస్తుందీవ్యాసం. కవిత్వానికి సంబంధించి శ్రీశ్రీ 'ఋక్కులు' లాగే కథకు సంబంధించి ఈ వ్యాసం వస్తు వైవిధ్యాన్ని గురించి వివరిస్తుంది. ఎటువంటి సన్నివేశాలపైన, ఇతివృత్తంపైన కథలు రాయవచ్చో చమత్కారంగా రావిశాస్త్రి వివరిస్తాడు. ఒకే వస్తువు మీద రెండురకాలుగా కథలు చెప్పవచ్చని సోదాహరణంగా వివరిస్తాడు. ఈ వ్యాసంలో షివత్రస్‌కి బదులుగా 'స్త్రీవత్రీ' చమత్కారంగా వాడిన పదం. 'రమణాచారి డాబాగదీ' మరో కథనాత్మక వ్యాసం. పై వ్యాసానికి ఒకరకంగా కొనసాగింపు. ఈ వ్యాసంలో కూడా ఏయేరకాల వస్తువు తీసుకుని కథ రాయవచ్చో, ఒకే వస్తువు మీద ఎన్ని రకాలుగా కథ చెప్పవచ్చో సోదాహరణంగా వివరిస్తాడు రావిశాస్త్రి. సాధారణంగా ఆయన కథలలో, నవలలలో ఉండే ఆకర్షణీయమైన శైలి ఈవ్యాసాల్లోకూడా కనిపిస్తుంది. 'ఒకథ కథ' వ్యాసంలో తానురాసిన 'మెరుపు మెరిసింది' అనే కథకు మూలమైన తన అనుభవాన్ని వివరిస్తాడు. తాను తొమ్మిదో ఏట చదివిన యు.సత్యబాల సుశీలాదేవి రాసిన కథను గురించిన వ్యాసం 'ఆ గదిలోనే'.

1960లో హైదరాబాదులో జరిగిన అఖిలభారతతెలుగురచయితల మహాసభల సందర్భంగా రాసిన వ్యాసం 'కథానిక'. భారతదేశభాషలలో కథలు, కథలచరిత్ర, వాటి స్వరూపస్వభావాలు, తెలుగులో కథలచరిత్ర, తెలుగులో అప్పటికి వచ్చిన కథానికలు, అనువాదాలు, ఇతర భాషా ప్రభావాలు మొదలైన ఎన్నో విషయాలను వివరిస్తూ 'అకడమిక్'గా రాసిన వ్యాసం ఇది 'పులిశవర్లు' పవర్ అన్న భావనను చమత్కారంగా వివరించే వ్యాసం. 'దిక్కెవరు? ఏదిదిక్కు' తన జీవితానుభవంలోంచి వచ్చిన వ్యాసం. వర్షంలో ఇంటి ముందు చూరుకింద చేరిన

ఒక పేదరాలిని 'నీకు దిక్కెవరూలేరా?' అని అడిగితే 'దిక్కెవరుబాబూ దరణి బూదేవి, ఆపైన దేవుడు, ఆయెనక నీలాటి మారాజులూను' అని సమాధానం ఇస్తుంది. దానిపైన తనకు కలిగిన ఆలోచనల్ని వివరించడం ఇందులో ఉంది.

'ముద్రారాక్షసం' చరిత్రపైన, అంతర్జాతీయ రాజకీయాలపైన, రాజనీతిపైన రావిశాస్త్రికి ఉండే అధికారాన్ని తెలియజేస్తుంది. ఇది 1963లో రాసిన వ్యాసం. చాలా వినయంగా, అమాయకంగా ఏమీ తెలియనివాడు అనిపించేలా రాసిన ఈవ్యాసం రావిశాస్త్రికి రాజకీయాల విషయంలో ఉన్న స్పష్టమైన అవగాహనకు అద్దం పడుతుంది. చైనా, భారతదేశాల మధ్య సరిహద్దు తగాదా, టిటోశాంతి ప్రవచనాలు, తూర్పుయూరప్ రాజ్యాలలో ప్రజాస్వామ్య వ్యవస్థాపన ప్రయత్నాలు, అమెరికావాళ్లకి తలుపులు బార్లా తెరిచిన రష్యా ప్రధానమంత్రి కృశ్చేవ్, ప్రజాస్వామ్యానికి, సోషలిజానికి ఉండే సంబంధం, నెహ్రూ రాజకీయాలు-ఇలా మొత్తం ప్రపంచ రాజకీయాలను అంతర్జాతీయ సంబంధాలను ఒక తాటగట్టినట్టు తికమక లేకుండా వ్యంగ్యంగా చెప్పిన పద్ధతి అద్భుతం. 'అసలు రాజనీతినిగురించి మననుంచే పైవాళ్లు నేర్చుకున్నారేమో' అని 'ముద్రారాక్షసం' లోని చాణక్య నీతిని ఉదహరిస్తాడు. సాహిత్యం ప్రచారాత్మకంగా ఉండకూడదనే వాళ్లకూడా దేశానికి చైనాతో వచ్చిన తగువులో రచయితలంతా సంబంధం పెట్టుకోవాలనడంలోని వైరుధ్యాన్ని చమత్కారంగా వివరిస్తాడు రావిశాస్త్రి. ఏసాహిత్యమైనా ప్రచారంకోసమే అన్నమాటను నమ్మినవాడు రావిశాస్త్రి.

శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంగా రాసిన వ్యాసం 'మహాకవి'. మూసలో వస్తున్న వ్యాపార సినిమాలను చూసి మొహం మొత్తిన వారికి పూర్తిగా భిన్నమైన ధోరణిలో వచ్చిన 'శంకరాభరణం' ఎంతో హాయినిచ్చింది. సంగీత ప్రధానమైన ఈ సినిమాను, సవిమర్శకంగానే అయినా, స్వాగతిస్తూరాసిన వ్యాసం 'శంకరాభరణం'. శంకరాభరణానికి రావిశాస్త్రి స్పందించిన తీరులో కొంత వివాదం ఏర్పడే అవకాశం ఉంది. అయితే ఆరోజులలో ప్రగతికాముక రచయితలు చాలామంది ఈ సినిమాకి సానుకూలంగా స్పందించారు.

సామాజిక స్పృహ లేకుండా రాయాలని ప్రయత్నించే వాళ్లని విమర్శిస్తూ, సామాజిక స్పృహ లేకుండా ఎవ్వరూ ఏ కల్పనా సాహిత్యం సృష్టించరని వివరిస్తూ రాసిన వ్యాసం 'సామాజిక స్పృహగాళ్లుట'. రచయితల కర్తవ్యాన్ని గురించి వివరించే వ్యాసం 'బాధ్యత-భద్రత'.

## ఎలిజీలు

రావిశాస్త్రి ఆర్ద్రహృదయుడు. అరమరికలు లేని స్నేహం ఆయనది. వ్యక్తిగత జీవితంలో ఆయనకు సన్నిహితులైనవారు ఆయన జీవితంతో పెనవేసుకొని

పోతారు. ఆయన వ్యక్తిత్వం స్నేహానికి స్నేహంగా,ప్రాణానికి ప్రాణంగా ఉంటుంది. ఆయన సన్నిహితవర్గంలో కమ్యూనిస్టుపార్టీ కార్యకర్త, కార్మికనాయకుడు వాసిరెడ్డి వెంకటప్పయ్య ముఖ్యుడు. ప్రముఖ కథారచయిత ఎన్నెస్ ప్రకాశరావు మరో ఆంతరంగిక మిత్రుడు. ప్రకాశరావూ, వెంకటప్పయ్యా ఒక ఫ్యాక్టరీని చూడడానికి వెళ్లి అక్కడ సల్ఫ్యూరిక్‌యాసిడ్ పడి నాలుగు రోజుల తేడాతో 1973 జూన్‌లో మరణించారు. రావిశాస్త్రికి త్యాగాలుచేసి, ప్రజాహృదయాలను చూరగొన్న ప్రపంచనాయకులెవరన్నా ఆరాధన. ఆయన అభిమానించిన నాయకులలో కాంగోకి చెందిన పాట్రిస్ లుముంబా ఒకడు. బెల్జియం వలస పాలకులు జనరల్ మొబుటును అడ్డుపెట్టుకొని లుముంబాను హత్యచేశారు. 1961 జనవరి 17న ఇది జరిగింది. ఈ ముగ్గురిని గురించి – వచనమూ, కవిత్వమూ – అయిన స్మృతి గీతాలు రాశాడు.

పాట్రిస్ లుముంబా మరణం సందర్భంగా రాసిన స్మృతిగీతం పేరు 'ఉహురు'. కాంగో భాషలో ఉహురు అంటే స్వాతంత్ర్యం. అందులో కొన్నిభాగాలు.

"లుముంబా!

నీ ఎదలోని రొదలు, ఇక్కడా
అక్కడా అల్లక్కడా నలుమూలలా నలి
గిన జీవుల అందరి రొదలూ నీయెదలోని
రొదలు
నీవిచ్చిన పిలుపు ఈ తరంలో భావి
తరాల్లో ప్రతిదేశంలో ప్రతియోధుడుకీ
స్వాతంత్ర్య సమరానికి అదొకగొప్ప
పిలుపు
నీపేరు పలికేసరికి, ఇన్నాళ్లయి
మమ్మల్నందర్నీ ఉక్కిరి చేసి తెల్ల
దొరల విషవాయువులు నల్లదొరల విష
మేఘాలు అన్నీ కూడా నీపేరు పలికే
సరికి ఇక మీదట చెల్లాచెదురు
లుముంబా!"

'ఎన్నెస్ ప్రకాశరావ్!!' అన్న స్మృతిగీతంలో భాగాలు. ఇది 'విషారా' పేరుతో రాసింది.

"నువ్వులేవు

నవ్వులు చిందించేవ్

నువ్వులేవు
పువ్వులు అందించేవ్
నువ్వులేవు
పువ్వులు నవ్వించిన
నవ్వులు పూయించిన
నువ్వులేవు
కధలెన్నొ పండించేవ్
కలలెన్నో సృష్టించేవ్
మెరుపులు మెరిపించేవ్
ఆశలు చిగురించేవ్
నువ్వులేవు
ఆశలన్ని తుంచేసేవ్
తుంచేసేవ్
మెరుపులా మాయమయేవ్
నువ్వులేవు,
...............
నీధైర్యం
నీ సాహసం
నీ సమరం
నీ సందేశం
మాకున్నాయి
అయయో ప్రకాశమా
అయ్యారే ప్రకాశమా"

'కళ్లను సెలయేళ్లుగా మార్చివెళ్లిన వాసిరెడ్డి' అన్న పేరుతో వాసిరెడ్డి వెంకటప్పయ్య మరణాన్ని గురించి రాసిన స్మృతివచనంలోని భాగాలుకొన్ని. సల్ఫ్యూరిక్ యాసిడ్‌లో పడ్డ వెంకటప్పయ్య నాలుగైదు రోజులు మృత్యువుతో పోరాడి మరణించాడు.

"వాసిరెడ్డి వెంకటప్పయ్య వెళ్లిపోయాడు
మనదేశంలో చాలామంది ఈలోకంలోంచి వెళ్లిపోతారు.
ఆ తరువాత కాలిపోతారు. అందులో వింతలేదు.
విడ్డూరం లేదు, భయంలేదు, బీభత్సంలేదు.
భయంకరమైన పోరాటంలేదు.
కాని వాసిరెడ్డి వెంకటప్పయ్య కాలిపోయి వెళ్లిపోయాడు.
అందులో మనకి భయం, బీభత్సం ఉంటే ఉన్నాయి.

కానీ, అందులో అతనికి మాత్రం భయంకరమైన పోరాటం ఉంది చివరికి చారిత్రాత్మకమైన విజయం ఉంది.

............

మా ఆలోచనల్ని మండించి వెళ్లిపోయాడు. మాగుండెల్ని పిండేసి వెళ్లిపోయాడు. మాలో ఆవేదనా ఝంఝా మారుతాన్ని రేపేసి వెళ్లిపోయేడు. మాలో పండించిన నవ్వులన్నీ ఎండించి వెళ్లిపోయేడు. మాలో ఆశలనే దీపాలన్నీ ఆర్పేసి వెళ్లిపోయేడు. మాలో ఉత్సాహోద్వేగాల నన్నింటిని చల్లార్చి వెళ్లిపోయేడు. మా కళ్లని సెలయేళ్లుగా మార్చేసి వెళ్లిపోయేడు.

............

వెయ్యి వ్యాఘ్రాల్ని ఒక నంది నిలబెట్టేసినట్లు, వేయి తలల పాముతో పసిపిల్లడు చెరువులో చలగాటాలాడి చెండాడినట్టు, కొన్ని కోట్ల టన్నుల అమెరికన్ బాంబుల బీభత్సాన్ని వియత్నాం వీరులు ధిక్కరించినట్టు, ఎవ్వరూ ఆపలేరనుకున్న, అడ్డలేరనుకున్న, నిలపలేరనుకున్న మహా మృత్యువును ఆపి, అడ్డి, నిలబెట్టి ఎదిరించి ధిక్కరించేడు వాసిరెడ్డి వెంకటప్పయ్య.

............

కాలిపోయిన వాళ్లంతా బూడిదయి పోతారు.
మా వాసిరెడ్డి వెంకటప్పయ్య మాత్రం బంగారంలా మాకెప్పటికీ మిగిలేవుంటాడు.

......... ...

స్మృతి గీతాలలో కూడా సామాజిక, రాజకీయ చైతన్యాన్ని వీడలేకపోవడం రావిశాస్త్రిలోని నిబద్ధతను సూచిస్తుంది.

రావిశాస్త్రి కౌమారంలో రాసుకున్న డైరీలు, జ్ఞాపకాలు పూర్తిగా దొరికి ఉంటే, ఉన్నవి అచ్చై ఉంటే ఆయన సాహిత్యవ్యక్తిత్వం మరింత సమగ్రంగా ఆవిష్కరించడానికి అవకాశం ఉండేది. పత్రికలకి, రేడియోలకి ఇచ్చిన ఇంటర్వ్యూలు కూడా ఆయన సామాజిక, సాహిత్య చైతన్యానికి ప్రతిబింబాలు.

# 8. సాహిత్య దృక్పథం

రావిశాస్త్రి వ్యవస్థను తన సృజనాత్మక రచనలలో విమర్శ చేశాడు. కాని సాహిత్య విమర్శకు సంబంధించి అంతగా ఏమీ రాయలేదు. సామాజిక జీవితాన్ని రచనలో విశ్లేషించి చూపాడేకాని సాహిత్యవిశ్లేషణ ఏమీ చేసినట్టు కనిపించదు. కథానిక పరిణామంగురించీ, కథలు రాయడాన్ని గురించి రెండు మూడు వ్యాసాలు రాశాడు. పుస్తకాలకు రాసిన ముందు మాటలలో ఆ రచనలకు ఆయన స్పందనలు, రచయితలను గురించిన అభిప్రాయాలు కనిపిస్తాయి. ఇవి ముందు మాటలు కాబట్టి వీటిలో అన్నీ మంచి మాటలేకాని కరుకు మాటలు ఉండే అవకాశం లేదు. 'నేనెందుకు రాసేను', 'నాకు రాయాలని.....' వంటి ఒకటి రెండు వ్యాసాల్లో, ఇంటర్వ్యూల్లో సాహిత్యప్రయోజనాన్ని గురించి, రచయితల కర్తవ్యాన్ని గురించి, వస్తురూపాలకు ఉండే సంబంధాన్ని గురించి కొన్ని అభిప్రాయాలు వెలిబుచ్చాడు. సృజనాత్మక రచనల ఆధారంగానేకాక ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాల్నిబట్టి రావిశాస్త్రి సాహిత్యదృక్పథం కొంతవరకు అర్థం చేసుకోవచ్చు.

సాహిత్య విమర్శను గురించి రావిశాస్త్రికి అంత సానుకూలమైన అభిప్రాయం ఉన్నట్టు కనిపించదు. ఒక ఇంటర్వ్యూలో ఆయన ఇలా అంటాడు "విమర్శలు నేనేవీ చదవలేదు. నాకు విమర్శలగురించి స్పష్టమైన అభిప్రాయాలేం లేవు. ఏదోకథరాస్తాం. అదిబాగుంటే బాగుంటుంది. జనం ఒప్పుకుంటే ఒప్పుకుంటారు. ఒప్పుకోకపోతే పోతుంది. అదినిలబడదు". ఇది ఒక ఉదాసీన భావంలాగా

కనిపిస్తుంది. రచన నిలబడడం, నిలబడకపోవడం అనేది రచనబలం మీదనే ఆధారపడి ఉంటుందన్నమాట నిజమేకాని విమర్శ ఒక రచన విలబడడానికి, నిలబడలేక పోవడానికి కారణాలను, సూత్రాలను వివరించడంద్వారా సాహిత్య పురోగతికి తోడ్పడుతుందన్న విషయాన్ని కూడా గుర్తించవలసి ఉంటుంది. అయితే రావిశాస్త్రి 'రత్తాలు-రాంబాబు' సీరియల్‌గా వస్తున్నప్పుడు వచ్చిన విమర్శలు, ప్రతి విమర్శల మీద తన అభిప్రాయం రాస్తూ 'విమర్శ విడిచిపెట్టి విమర్శకుల మీద వ్యక్తిగతంగా విసుర్లు విసరడం మంచిదికాదని' అంటాడు. దీన్నిబట్టి విమర్శ పరిధుల్ని గురించి, ప్రయోజనాన్ని గురించి రావిశాస్త్రికి ఒక స్పష్టమైన అభిప్రాయం ఉన్నట్టు తెలుస్తుంది.

## రచయిత

మంచి,చెడుల విచక్షణజ్ఞానాన్ని పెంచడానికి ఉపయోగించాలన్నది రచనల ప్రయోజనంగా, ఆవిధమైన రచనలు చేయడం రచయితల కర్తవ్యంగా తన అభిప్రాయాలను సరళంగా చాలాచోట్ల పునరావృతం చేస్తాడు రావిశాస్త్రి. 'రామాదివత్ ప్రవర్తితవ్యం న రావణాదివత్' అని అలంకార శాస్త్రాలు చెప్పినట్లుగా ఉంటాయి ఈ మాటలు మంచి చెడులకు రాముడు రావణులను ప్రతీకలుగా తీసుకుంటాడు రావిశాస్త్రి. ఇది సాహిత్యప్రయోజనాన్ని గురించి చెప్పేటప్పుడు పునరావృతం అయ్యే అంశం. "నిజాన్ని తెలుసుకోడం, అందులో మంచిచెడ్డలేవో నిర్ణయించుకోడం, మనుష్యుణ్ణి మంచికి మళ్లించడానికి ప్రయత్నించడం రచయితల కర్తవ్యం అని ప్రస్తుతం నేను అనుకుంటున్నాను. ప్రతిరచయిత తనురాస్తున్నది రావణుణ్ణి సమర్థించి రాముణ్ణి ఓడించడానికా, లేక సీతని విడిపించి న్యాయాన్ని గెలిపించడానికా అనేవిషయం తేల్చుకోవాల్సుంటుందని తలుస్తాను. కానీ ఈ విషయం తేల్చుకొనే ముందు రావణుడు సీతాదేవిని ఎత్తుకుపోవడం న్యాయమో అన్యాయమో రచయిత నిర్ణయించుకోవలసుంటుంది. అందుచేత రచయిత అయిన ప్రతివాడూ తాను రాస్తున్నది ఏమంచికి హాని కలిగిస్తుందో, ఏచెడ్డకి ఉపకారం చేస్తుందో అని ఆలోచించవలసిన అవసరం ఉందని నేను తలుస్తాను. మంచికి హాని, చెడ్డకి సహాయము చేయకూడదని నేను భావిస్తాను" అంటాడు రావిశాస్త్రి. "జీవితంలోని మంచిని చూడగలిగిననాడు అందులోని చెడ్డనుకూడా చూడగలడు. అయితే ఆ మంచిని గుర్తించగలిగి ఆ చెడ్డని ఎత్తిచూపగలిగిననాడు రచయిత మంచి రచయిత అవుతాడు" అంటాడు మరోచోట. "..........ఉడుకు నెత్తురున్నవాడు దుష్టశిక్షణకోసం కత్తులైనా పట్టాలి, కత్తుల్లాంటి కలాలైనా పట్టాలి" అని రచయితలకి కర్తవ్యబోధ చేస్తాడు ఇంకొకచోట.

తాను రచన ఎందుకు చేస్తున్నాను అన్న విషయాన్ని సూటిగా, సరళంగా వివరిస్తాడు రావిశాస్త్రి. తన రచనలకు సామాజిక ప్రయోజనంతోపాటు స్వీయ సంస్కరణ అన్న ప్రయోజనంకూడా ఉంది. "నా కోపం, తాపం, నా దుఃఖం, సంతోషం, నాసరదా, నా క్యూరియాసిటీ వగైరాలు ఇతరులకు తెలియజేయడానికి క్కూడా నేను కథలు రాసేననుకుంటున్నాను" అని స్వీయ రచనా ప్రయోజనాన్ని వివరిస్తాడు. రావిశాస్త్రి వ్యవస్థమీద తనకుండే కోపం, తను చూసిన దుఃఖం మొదలైన అంశాలను తన రచనలలో ఇమిడ్చాడు. తన రచనలు ఆత్మవిమర్శకు కూడా ఉపయోగించాయి. తనకు ఉన్నాయనుకుంటున్న బలహీనతలను విమర్శించుకోవడానికి రచనలలో కొన్ని పాత్రలను సృష్టించానని కూడా అంటాడు. "నా మీద నాకుండే అసహ్యం కొద్దీకూడా నేను కొంతగా రచన చేసేను". ఉన్నతవర్గ దురహంకారంతో అమాయకులైన పల్లెటూరి ఆడవాళ్లను అది ఏ మాత్రం తప్పుకానట్టు అనుభవించిన 'అగ్గిపుల్ల'లో శేషగిరి పాత్ర, ఉన్నవాళ్లకు కొమ్ముగాలు కాస్తూ స్వీయప్రయోజనంకోసం కవిత్వం రాసే 'రొట్టెముక్క'లోని మూర్తికవి పాత్ర తాను అలాకాకుండా ఉండాలని సృష్టించిన పాత్రలుగా ఆయన పేర్కొంటాడు.

## రచనా ప్రయోజనం

సాంఘిక ప్రయోజనం రావిశాస్త్రి దృష్టిలో సాహిత్యానికి ప్రధాన ప్రయోజనం. మంచి చెడ్డల నిర్ణయమే 'సాహిత్య ప్రయోజనం' అని చెప్పేవారు పెద్దలు చాలా మంది ఉన్నారనేది ఆయన నిశ్చితాభిప్రాయం. తనను కథారచయితగా, కథ ముఖ్యమైన సాహిత్య ప్రక్రియగా జ్ఞాపకం చేస్తుంటాడాయన. లోకాన్నీ, మానవ లోకాన్నీ, మానవ నైజాన్ని అర్థం చేసుకొని మనిషి ఈ లోకంలో, ఈ సంఘంలో మంచి సభ్యుడిగా ఉండేట్టు చేసే కథలు, ఆ విధంగా ఉండడానికి అతనిచేత ప్రయత్నం చేయించే కథలు మంచివని స్పష్టం చేస్తూ, సాంఘిక ప్రయోజనం అంటే అర్థం ఇదేనని కూడా వివరిస్తాడు. ప్రతి కథా ప్రచారసాధనమేనని రామాయణ, భారతాలు కూడా ప్రచారం కోసం పుట్టినవేనని, అయితే మంచి ప్రచారం చేయడం కర్తవ్యం అని కూడా రావిశాస్త్రి భావిస్తాడు.

## సాహిత్యం-జీవితం

జీవితమేసాహిత్యం కావాలని నిష్కర్షగాచెప్పినవాడు గురజాడ. ఆ అభిప్రాయం తోనే రచనలు చేసినవాడు రావిశాస్త్రి. "కథలు ఆకాశంలో పుట్టవు. మనిషి జీవితం లోంచి పుడుతాయి. అందుచేతనే రచయితలు జీవితానికి దగ్గరగా ఉండాలి. జీవితానికి దగ్గరగా ఉండగలిగినవాడే మంచి రచయితగా మిగులుతాడు" అనేది

ఆయన సిద్ధాంతం. జీవితంలోని మంచిని చూడగలిగిన వాడు అందులోని చెడ్డను కూడా చూడగలడని, మంచిని గుర్తించగలిగి ఆ చెడ్డని ఎత్తి చూపగలిగిననాడు రచయిత మంచి రచయిత కాగలడని, మంచి రచయిత లక్షణాన్ని కూడా వివరించి చెప్తాడు. రావిశాస్త్రి దృక్పథం అంతా మంచి-చెడు అన్న ద్వంద్వాల పైననే ఆధారపడి ఉండడం అతని ప్రతి అభిప్రాయ ప్రకటనలోను చూడవచ్చు. ఇతర సాహితీ ప్రక్రియల దృష్ట్యా నాటకం సమాజానికి పూర్తిగా సంబంధించిన ప్రక్రియగా భావిస్తాడు రావిశాస్త్రి. గురజాడ జీవితాన్ని గురించి చెప్పడానికి నాటక ప్రక్రియను ప్రధానంగా ఎన్నుకోవడం ఇందుకే కావచ్చు.

## వస్తువు-రూపం

రచనా శిల్పాన్ని వస్తువుతో, రచయిత చెప్పదలచిన విషయంతో వేరుచేసి చూడడానికి వీలులేదని రావిశాస్త్రి అభిప్రాయంగా కనిపిస్తుంది తన రచనానుభవంతో జోడించి రచనా శిల్పం రూపొందే తీరుని గురించి రావిశాస్త్రి చాలాచోట్ల వివరిస్తాడు. తమతమ ఆవేదనల్ని ఇతరులకి సరిగ్గా స్పష్టంగా చెప్పాలనే తపనలోంచే బలమైన భాష పుట్టుకొస్తుందని ఆయన ఖచ్చితమైన అభిప్రాయం. సామాన్యులు, తమ ఆక్రోశాన్ని, ఆవేదనల్ని చెప్పుకొనేటప్పుడు అప్రయత్నంగానే అవి భాషారూపాన్ని పొందుతున్నాయి. వాళ్లు మాటల కోసం తడుముకొన్నట్టు కనిపించదు. చదువుకున్న రచయితల రచనలతో పోలిస్తే ఆ మాటలు ఏ మాత్రం అభివ్యక్తీకరణ విషయంలో తీసిపోవు. తన అనుభవంలోంచి రావిశాస్త్రి దీనికి అనేక ఉదాహరణలు ఇస్తాడు ఆయన రచనలలోని సామాన్యులు కూడా అలాగే మాట్లాడతారు. అందుకే తనకు తెలుగు ఎవరో గురువుదగ్గర నేర్చుకోవడం వల్ల రాలేదని, ప్రజల నుంచి నేర్చుకొన్నానని అంటాడు.

తాను రచన చేసేటప్పుడు శిల్పాన్ని గురించి ఎక్కువగా శ్రద్ధ తీసుకుంటాడని అన్నవాళ్లకు ఆయన ఇలా సమాధానం చెప్తాడు. "వాస్తవానికి నేను కథగా చెప్పే ఇతివృత్తం ఏ విధంగా చెప్తే బాగుంటుందోనని కొంచెం ఆలోచిస్తాను. ప్రతి ఇతివృత్తంకూడా ఏదో ఒకవిధంలో చెప్తేనే అది పాఠకుడి మనసుని హత్తుకుంటుంది. అది ఏదా అని కొంచెం ఆలోచిస్తానంతేకాని దాన్ని గురించి తన్నుకు చావను. ఆ విధానం తెలిస్తే ఆ కథ సరిగా వస్తుంది. లేకపోతేరాదు. అదంతే." ఎన్నుకున్న ఇతివృత్తాన్ని ఏ విధంగా చెప్తే పాఠకుడిపైన ప్రభావం కలిగిస్తుందో ఆ విధమైన విధానాన్ని ఎన్నుకోగలగడంలోనే రచనా శిల్పం ఉంది అన్నది రావిశాస్త్రి అభిప్రాయం.

ఏదైనా ఒక అనుభవం ఉన్నప్పుడు అది స్పష్టంగా ఎట్లా ప్రకటించాలి అని ఉంటుందని, అలాగే తనకు ప్రత్యేకంగా రచనా దృక్పథం అంటూ లేకపోయినా

చెప్పవలసిన విషయాన్ని సూటిగా ఎలా చెప్పాలో ఆలోచించడంలో తనకు ప్రత్యేకమైన పద్ధతి ఏర్పాటై ఉంటుందని తనకు ప్రత్యేక పద్ధతంటూ ఉందని ఇతరులు చెప్పేంతవరకూ తనకు తెలియదని అంటాడు రావిశాస్త్రి.

వస్తువుకి, శిల్పానికి సమతౌల్యం ఉండాలన్నది రావిశాస్త్రి అభిప్రాయం కూడా. ఆ విషయాన్నే ఒకచోట ఇలా స్పష్టం చేస్తాడు. "తాము చెప్పేది పాఠక లోకం వినేలా చేసేందుకు రచయితలు రకరకాల ప్రయత్నాలు చేస్తుంటారు. అయితే చమత్కారంగా చెప్పడం తప్ప చెప్పిన దాంట్లో పసలేనప్పుడు (చమత్కారాల కోసం మాత్రం వింటేనే తప్ప) పాఠకుడు విసుక్కుంటాడు. ఎంత మంచి చెప్పదల్చుకొన్నప్పటికీ అది అందంగా, చమత్కారంగా చెప్పకపోతే వినవలసిన వాడు నువ్వు చెప్పేది వినవే వినడు".

విప్లవ రచయిత, గాయకుడు వంగపండు ప్రసాదరావు 'ఏరువాక' పుస్తకానికి ముందుమాట రాస్తూ రావిశాస్త్రి ఇలా అంటాడు. ఇందులో ఆయన భాషా దృక్పథం కూడా కనిపిస్తుంది.

"సాహిత్యం పెద్దల ప్రైవేటుఆస్తిగా ఎల్లకాలం ఉండిపోదు. అలా ఉండి పోవాలని శతాబ్దాలుగా తెలుగుపెద్దలు చేసిన ప్రయత్నాలమీద పెద్దదాడి చేసినవాడు స్వర్గీయ గిడుగు రామమూర్తి గారు. ఆ గిడుగు పిడుగు కూడా కోట కూల్చినప్పుడు శిష్టులే అందులో ప్రవేశిస్తారనుకున్నారు. కాని అది అలా జరగదు. శిష్టుల కంటే జనులే విశిష్టులు. శిష్టులొక్కరే కోటగోడలు కూల్చలేరు. జనం ఆగోడల్ని కూలుస్తారు. ఆస్వేచ్ఛ అందరూ అనుభవిస్తారు."

సాహిత్యాన్నిగురించి, రచనారీతులనుగురించి రావిశాస్త్రి ప్రత్యేక సిద్ధాంతాలు, సూత్రీకరణలు చేస్తూ ప్రత్యేకంగా ఏమీరాయలేదు. అడపా దడపా ప్రకటించిన అభిప్రాయాలే ఆయన సాహిత్యదృక్పథాన్ని తెలియజేస్తాయి.

# 9. రచనలూ - తీరుతెన్నులూ

ఆధునిక తెలుగు సాహిత్యంలో కవిత్వవిషయంలో శ్రీశ్రీకి ముందూ, శ్రీశ్రీకి తరువాత అని చెప్పుకున్నట్టుగానే, కథానికల విషయంలో రావిశాస్త్రికి ముందూ, రావిశాస్త్రికి తరువాత అని చెప్పుకోవలసి ఉంటుందని విమర్శకులంటారు. వచన సాహిత్యంలో ఇది రావిశాస్త్రి యుగమని కూడా విమర్శకుల అభిప్రాయం. రావిశాస్త్రిని అనుకరించడానికి ప్రయత్నం చేసి అనుకర్తలుగా మిగిలిపోయిన కథారచయితలున్నారు. ఆయన రచనలు ప్రేరణగా జీవితంలోని మరికొన్ని కోణాల్లోకి వెళ్లి కొత్త రచనా మార్గాలలో వెళ్తున్న కథారచయితలూ ఉన్నారు. వస్తు స్వీకారంలోనేకాదు, రచనా ప్రకారంలో, నిర్వహణలో, నిర్మాణంలో, సంభాషణల లో, పాత్ర చిత్రణలో, కథాకథనంలో వైవిధ్యాన్ని ప్రదర్శించినవాడు, తనదంటూ కొత్త విధానాలను నిర్మించుకున్నవాడు రావిశాస్త్రి. ఎన్ని పేర్లతో రాసినా ఒక వాక్యం చాలు రావిశాస్త్రిని పట్టుకోవడానికి అంటారు విమర్శకులు. కథాకథనంలో ఎన్నిరకాల వైవిధ్యం ఉండడానికి వీలుందో అన్నిరకాల పద్ధతులూ రావిశాస్త్రి రచనల్లో కనిపిస్తాయి. దీనిని గురించి ప్రత్యేక సిద్ధాంత వ్యాసమే రాయడానికి అవకాశం ఉంది. కథల్ని, నవలల్ని పరిచయం చేసిన సందర్భంలో స్థూలంగా రావిశాస్త్రి కథాకథనపద్ధతుల్ని గురించి తెలుసుకున్నాం. రావిశాస్త్రి రచనా శిల్పానికి సంబంధించిన ఇతర అంశాలను పరిశీలిద్దాం.

పాత్రలు

రావిశాస్త్రి నవలల్లో, కథల్లో కనిపించే పాత్ర వైవిధ్యం తెలుగులో చాలా

తక్కువమంది రచనలలో కనిపిస్తుంది. పై తరగతి, మధ్యతరగతి మనుష్యులతో పాటు ఎన్నిరకాల బతుకులు బతకటానికి వీలుందో అన్నిరకాల బతుకులు బతికే కిందితరగతివాళ్లు రావిశాస్త్రి రచనల్లో కనిపిస్తారు. వర్ణనల ద్వారా పాత్రల భౌతిక స్వరూపాన్ని, సంభాషణల ద్వారా, వ్యాఖ్యానాల ద్వారా, వర్ణనల ద్వారా కూడా పాత్రల స్వభావాలను, ప్రవృత్తుల్ని చిత్రించడంలో గురజాడ తరువాత రావిశాస్త్రినే చెప్పుకోవాలి. ఇది ఆయన పరిశీలనాశక్తి ద్వారానే సాధ్యమయింది. గురజాడ ప్రధానంగా నాటకకర్త. పాత్ర స్వభావాలను చెప్పడానికి సంభాషణలే ఆయనకు సాధనాలైనాయి. కథకుడుగా రావిశాస్త్రి అన్నిరకాల సాధనాలను ఉపయోగించు కున్నాడు. రావిశాస్త్రి రచనలలో మనం రోజూ చూసే సాధారణ మానవులు కనిపిస్తారు. రావిశాస్త్రి పాత్ర చిత్రణ ప్రతిభకు మచ్చుకి కొన్ని ఉదాహరణలు చూద్దాం.

'రాజు-మహిషి' నవలలో గంగరాజు వర్ణనలు ఆయన భౌతిక స్వరూపాన్ని, స్వభావాన్ని వ్యక్తం చేస్తాయి.

"రాజు పోతులా ఉంటాడు. తన ఇరవై గేదెల మధ్య నిలబడ్డప్పుడు ఇంకా మరీ మంచి పోతులా ఉంటాడు. ఆ ఎగిరే రింగురింగుల జుట్టు, ఆ కొమ్ములు తిరిగిన తెల తెల్లని, నలనల్లని మీసం, ఆ గర్జన, ఆ ఛాతీ, ఆ జబ్బలు, ఆ పిక్కలు, ఆ హైటు, ఆ రంగుల చొక్కా అన్నింటి తోను అతను మనిషిగా మారిన కారుదున్నలా ఉంటాడు. ఆ వూరే యమలోకం అయితే ఇతనే ధర్మరాజనిపిస్తాడు. అతను చెక్కిన రాతిబొమ్మలా ఉంటాడు. చాలా అందంగా ఉంటాడు."

"రాజు గర్జిస్తే సింహంలా గర్జించగలడు! దెబ్బలాడితే పులిలా దెబ్బలాడగలడు. పడితే భల్లూకంలా పట్టు పట్టగలడు. ఢీకొంటే మదపుటేనుగులా ఢీకొనగలడు. అన్ని మంచి రాజలక్షణాలూ అతనిలో ఉన్నాయి."

గంగరాజు మరదలు, తరువాత భార్య అయిన రాజమ్మ స్వభావం ఇలా ఉంటుంది.

"ఆమె కోపం ప్రళయమైతే, ఆమె తెలివితేటలు కత్తి వంటివి. కోపానికి ఫోర్సెక్కువైతే తెలివికి పదునెక్కువ. ఆమె వెయ్యిళ్లకి దీపాలు పెట్టగలదు. పదివేల కొంపలకి నిప్పంటించగలదు. దుర్దినాల్లో ఆమె కిలుం పట్టిన బిందెలా ఉండేది. ఇప్పుడామె బాగా తోమి ఎండలో బోర్లించిన ఇత్తడి బిందెలా తళతళ్లాడుతూంటుంది."

'రాజు-మహిషి' నవలలోనే భీమసేనరావుగారి పర్సనాలిటీని వర్ణించినతీరు అద్భుతంగా ఉంటుంది.

"భీమసేనరావుగారు, చిన్నప్పుడు మంచి రాజకుమారుల్లా ఉండేవారు. 'ఫలానావారి అబ్బాయి' అనే గౌరవం అటుంచగా ఆ చక్కటి పర్సనాలిటీనే అతనికి (రెయిల్వే) ఫస్ట్‌క్లాస్ ఫ్రీపాస్‌లా పనిచేసేది. పిలువ(బడ)కుండా గవర్నర్ గారి విందుకు వెళ్లినా అతణ్ణి చూసీ చూడగానే అక్కడ వారంతా అతనిని పిల్చి కుర్చీవేయాలన్న మాట. అంత బావుండేవాడతను. వీధంట అతను తాజాగా నడుచుకు వెళ్లిపోతుంటే, ఆ 'ప్రిన్సలీ పర్సనాలిటీ' చూసి కిళ్లీకొట్ల వాళ్లు లేచి నిలబడిపోయేవారు. తలగుడ్డలు చుట్టుకోవడం మర్చిపోయిన బళ్లవాళ్లు గాభరాగా తలగుడ్డలు చుట్టేసుకొనేవారు. రైతులు నోట్లోంచి చుట్టలు తీసేసి దాచేసుకొని తప్పుచేసినవాళ్లల్లా వంగొని వినయంగా నిలబడిపోయేవారు. బంట్రోతులు సలాములు కొట్టేవారు. బ్రాహ్మణులు పుణ్యావచనాలు చదివేసేవారు. మరింక ఆడవాళ్లమాట చెప్పేదేముంది?...

అనాదినించీ 'మంచి పర్సనాలిటీ'కి మానవ సంఘంలో ఎంతో మంచి పలుకుబడి ఉన్నదనే విషయం అందరికీ తెలిసిందే."

డబ్బుతోనూ, హోదాలోనూ ఎదిగి వచ్చిన భీమసేనరావు స్వార్థపర స్వభావాన్ని రావిశాస్త్రి ఇలా వర్ణిస్తాడు.

"జీవితంలో అన్నిటికంటే, భగవంతుడికంటే కూడా ముఖ్యమైన పదార్థం ఒకటే ఉంది. అదేదనగా తను!

తనే ముఖ్యం! తను లేకపోతే లోకమూలేదు, భగవంతుడూ లేడు. ఏమీలేదు. తను లేకపోతే సర్వం శూన్యం అన్నమాట.

తను, తనవారు, పైవారు -

జీవితంలో ముఖ్యమైన పదార్థాలు ఆక్రమంలో ఉంటాయని భీమసేనరావుగారు చాలా కాలం కిందే స్పష్టం చేసుకున్నారు."

ఇదే నవలలో కోర్టులో బార్ అసోసియేషన్ ప్రెసిడెంట్ ఎలా ఉంటాడో చూడండి.

"ప్రెసిడెంట్‌గారికి డెబ్బయ్యేళ్లుంటాయి. పచ్చగా పొడవుగా కొంచెం గూనిగా ఉంటారాయన. అతని చాయ చాలా స్వచ్ఛంగా ఉంటుంది. చిన్నప్పటినుండీ పళ్లు తినీ, పాయసం తాగీ, దేవతార్చన చేసీ, తండ్రి మాట వినీ, భార్యనేనమ్మీ, బంధువుల్ని అభిమానించీ, స్నేహపాత్రుల్ని గౌరవించీ, నౌకర్లని నవ్వించీ, కారులో తిరిగీ, పెద్దల పరిచయం కలిగీ పెరిగినవాళ్లా ఉంటాడాయన."

'రత్తాలు-రాంబాబు' నవలలో అడ్డబుర్ర అనే వింత పాత్ర ఉంది. కంపెనీ నరసమ్మకి అతను అసిస్టెంట్. అతని అసలుపేరు తెలియదు. మొత్తం నవలంతా

అడ్డబుర్ర అనే పేరుతోనే ఆ పాత్ర కనిపిస్తుంది.

"అతను చాలా పొట్టిగా ఉన్నాడు. కాని మరుగుజ్జులా లేడు. కాని, మరిగుజ్జుకి వయసు చెప్పలేనట్టే అతనికి కూడా వయసు చెప్పడం కష్టం. అయితే ఇతను నూనూగు మీసాలవాడు మాత్రం కాదని చెప్పొచ్చు. ఎంచేతనంటే ఎంత బాగా గీయించుకు వచ్చినప్పటికీ అతని గీసిన గడ్డపు ఆకుపచ్చతనం మాత్రం నిలబడి కనపడుతోంది. అతని తల అందరి తలల్లాగా లేదు. అడ్డుగా ఉంది. ఎదరనుంచి చూస్తే అది కుడివైపొక బుర్రా ఎడమనించి మరొక బుర్రా కలిసి ఏర్పడ్డట్టుగా ఉంటుంది. అతని ముక్కూ, కళ్లూ, నోరు అన్నీకూడా ఆరేళ్ల కుర్రాడు మనిషి ముఖం గీస్తే ఉన్నట్టు ఉన్నాయి. అతను అందంగా లేడు, వికారంగానూ లేడు. అతను మనిషిలాగా ఉన్నాడు. జంతువులాగా ఉన్నాడు. అతను నిక్కరుమీద పువ్వుల టెర్లిన్ షర్టు తొడుక్కొని ఉన్నాడు. మెళ్లో ఏదో పతకం వేసుకున్నాడు. అతను పూర్తిగా తలగొరిగించుకొని ఉన్నాడు. తలా గడ్డం కూడా చాలా ఆకుపచ్చగా ఉండడం చేత అతను ఆకుపచ్చని కోతి టోపీలో తల అమర్చుకున్నట్టున్నాడు"

'రొట్టెముక్క' కథలో ఫిజిక్స్‌లో డాక్టరేట్ చేసి వ్యాపారంలో పడ్డ డాక్టర్‌గారి భౌతికరూపం ఎలా ఉంటుందో చూడండి.

"డాక్టర్‌గారిక్కూడా నలభైయ్యేళ్లుండవచ్చు. కోడిగుడ్డు ఆకారంలో ఉన్న అతని తలపైన ఒక వెంట్రుకైనా లేకుండా ధగధగా ఎలా మెరుస్తుందో వళ్లంతా కూడా అలాగే నున్నగా పచ్చగా మెరుస్తుంది. ఇండియా, మంగోలియా, ఇంగ్లీషు కలయికలా ఉంటాడతను".

రావిశాస్త్రి పాత్రల స్వభావాన్ని సూచించే పద్ధతి చమత్కారంగా ఉంటుంది. "కామయ్యని చంపేస్తే కామయ్యే చస్తాడు. అతని భయం ఉండిపోతుంది." కామయ్యకు భయం ఎక్కువ అని చెప్పే పద్ధతి. 'షోకుపిల్లి'లో రావుగారి డ్రైవరు చాలా ముఖ్యమైన సమస్య ఉన్నప్పుడు చాలా నమ్మకంగా ఉంటాడు. నమ్మకంగా ఉండే నౌకర్లంటే గొప్పవాళ్లకి ఎంత ఆనందమో వర్ణిస్తున్నాడు శాస్త్రి. "ఈ కమ్యూనిస్టురోజుల్లో కూడా తమవంటి పెద్దవార్ని నమ్ముకొని విశ్వాసంగా ఉండే నౌకర్లున్నందుకు రావుగారి కళ్లు ఆనందాశ్రువులతో నిండిపోయాయి."

వేశ్యాగృహంలో చిక్కుకుపోయిన రత్తాలు మానసికస్థితి ఎలా ఉందంటే "ఆమెకి ఆ సమయంలో, కథల్లో చెప్పినట్టు, సినీమాల్లో చూపించినట్టు, ఏదో అద్భుతశక్తి ప్రభావంవల్ల కన్నీరూ, భయాలూ, అమ్మకాలూ, దాస్యాలూ, లంజరికాలూ, ద్రోహాలూ, పాపాలూ లేని లోకంలోకి అకస్మాత్తుగా మారిపోవాలనిపించింది".

పాత్రల మనఃస్థితిని వర్ణించడంలో రావిశాస్త్రి ప్రతిభ స్పష్టంగా కనిపిస్తుంది. బస్తాలు, రాళ్లు మోస్తూ కూలీ చేసే నూకరాజుకు ఒక జీవిత సమస్య ఎదురై అసహాయ స్థితిలో ఉండిపోతాడు. ఆ స్థితిని ఆయన వర్ణించిన తీరు ఇది. "అరవై ఘనపుటడుగుల బండరాయిని ఎత్తుకు తిరగగలిగీ ఆరడుగులే లోతున్న నీట్లో ఈదలేని వాళ్లా అయిపోయేడతను". గొర్రెమార్కు కంపెనీకి పోటీగా వచ్చిన పులిమార్కు కంపెనీని చూసి గొర్రెమార్కు కంపెనీ ఏజెంటుకి "ఆ (పులి) కోరలు తీసేసి వాటితోటే ఆ పులిని పొడిచి చంపాలి" అన్నంతకోపం వచ్చింది. "మంచి" "చెడ్డ"ల్లో ఏ కథ"లో రచయిత తనకంటే జ్ఞానంలోను, సాహిత్యంలోను ఎక్కువవాళ్లం అనుకునే ఇద్దరు మిత్రులముందు తనను కథారచయితగా పరిచయం చేసుకుంటాడు. అది "ఏంతపాలెంలో కుట్టించుకున్న సూటు వేసుకొని, ఢిల్లీలో డాబు చెయ్యిబోయిన వాళ్లా అయింది" తనకి.

ఉపమానాల ద్వారా కూడా పాత్ర స్వరూప, స్వభావాలను చక్కగా వ్యక్తీకరిస్తాడు రావిశాస్త్రి.

## కవితావచనం

సాహిత్య ప్రక్రియలలో కవిత్వం ప్రధానమైనదా నవల, కథ వంటి ప్రక్రియలు ముఖ్యమైనవా? అన్న విషయంలో సాహిత్య లోకంలో కొంత చర్చ ఉంది. నవల కవిత్వానికున్న ప్రాధాన్యాన్ని తగ్గించడానికి వచ్చిందని కూడా ఒక అభిప్రాయం ఉంది. కవిత్వమే ప్రధానమైన ప్రక్రియ అన్నవాళ్లు వచనం కూడా కవిత్వ స్పర్శ ఉన్నప్పుడే రాణిస్తుందని, అటువంటి వచన రచనలే నిలబడ్డాయని అంటారు. ఈ వాదం ఎంతవరకు సరి అయిందనేది వదిలేస్తే రావిశాస్త్రి వచనంలో కవిత్వపు విలువలున్నాయనేది అందరూ అంగీకరించే విషయం.

వెన్నెల, ఎండ, మెరుపు మెరిసింది, ఉదయం, జరీ అంచు తెల్లచీర వంటి కథలు పూర్తిగా కవితాత్మకంగా ఉంటాయి. 'సొమ్ములు పోనాయండి'ని ఒక సుదీర్ఘ కావ్యంగా పేర్కొనవచ్చు. ఇతర రచనల్లోనూ కవిత్వం అనిపించే భాగాలు ఉన్నాయి.

కవిత్వస్పర్శ రావిశాస్త్రి రచనా శిల్పంలో భాగం. కవిత్వీకరణ, ఉపన్యాస ధోరణిలోని సుదీర్ఘ సంభాషణలు కథాకథనానికి అడ్డం వచ్చాయన్న విమర్శ ఒకటి ఉంది. సాధారణంగా కాల్పనిక శైలి వచనానికి కవిత్వపు విలువలనిస్తుంది. చలంలో ఈ అంశాన్ని మనం చూడవచ్చు. ఆవేదన, ఆక్రోశం, దుఃఖం వెళ్లబుచ్చుకోవడంలో కూడా కవితా స్పర్శ, ఉపన్యాస ధోరణి వచ్చే అవకాశం ఉంది. రావిశాస్త్రి వచనంలో కూడా కాల్పనికత ఉన్నచోట, అంతకంటే ఎక్కువగా ఆవేదన వెల్లడించేచోట కవితావిలువలు చోటు చేసుకుంటాయి. 'మాయ' కథలో

ముత్యాలమ్మ ఆవేదన, 'న్యాయం' కథలో ముద్దాయి వేశ్య ఆక్రోశం ఉపన్యాస ధోరణిలో ఉంటూ కవితాత్మకంగా ఉంటాయి. రావిశాస్త్రి వచనంలోని కవిత్వం వంటి భాగాలు 'వెన్నెలో వెన్నెల' పేరుతో సంకలనంగా వచ్చాయని ఇంతకుముందే తెలుసుకున్నాం. అందువల్ల రెండు చిన్న కవితా వచన భాగాలను మాత్రం ఇక్కడ చూద్దాం.

"ఇది మెరుపులేని మబ్బు
ఇది తెరిపిలేని ముసురు
ఇది ఎంతకీ తగ్గని ఎండ
ఇది ఎప్పటికీ తెల్లవారని చీకటిరాత్రి
ఇది గ్రీష్మం ఇది శిశిరం
ఇది దగ్ధం చేసే దావానలం
ఇది చుక్కల్ని రాల్చేసే నైరాశ్యం."
- జరీ అంచు తెల్లచీర

'సైగల్' కథలో సైగల్ పాటలలో వినిపించే వేదనను, పాటలలో మార్దవాన్ని ఇలా వర్ణిస్తాడు రావిశాస్త్రి. ఈ పాటలో

"వెన్నెల వెలుగులున్నాయా?
చుక్కల తళుకులున్నాయా?
చిక్కటి చీకట్ల నునుపులున్నాయా?
కెరటాల విరుపులున్నాయా?
ఇంద్ర ధనస్సుల రంగులున్నాయా?
వేడికొండల నిట్టూర్పులున్నాయా?
జలదాల జలదరింపులున్నాయా?

ఈ పాటలో........
ప్రియురాలి విరహముందా?
పడుచు రక్తపు ప్రవాహముందా?
స్మృతులే మిగిలిన ముసలివాని బోసి నవ్వుందా?
కూలివాని కష్టముందా?
పేదవాని ఏడుపుందా?
సీతాదేవి శోకముందా?
రాధేయుని హృదయముందా?
అసహాయుని ఆర్తనాదముందా?

ఈ పాటలో ఏవేవో ఉన్నాయి.
ఈ పాటలో ఎన్నెన్నో ఉన్నాయి."

"నాకు రాయాలని..." అన్న రచనలో తనకు ఎందుకు రాయాలని ఉందో కవితాత్మకంగా చెప్పిన వాక్యాలివి.

"ఈ ఎండని నాకు వెండిలా
మండించాలని వుంది.
ఈ వెన్నెల్ని మంచినీటితో
కడగాలని వుంది
ఈ గాలికి ప్రాణంపోసి
పరిగెట్టించాలని వుంది
ఈ కొమ్మల్ని కెరటాల్లా
లేపించాలని వుంది.
ఈ నీడల్ని
చెలరేగింపించాలని వుంది
ఈ సంద్రాన్ని
ఉడుకులెత్తించాలని వుంది
ఈ నదులన్నీ
నయాగరా జలాలు కావాలని వుంది."

## వర్ణనలు

రావిశాస్త్రి రచనాశిల్పంలోని మరో ప్రధానాంశం వర్ణనలు. సందర్భానుసారంగా ఒక సన్నివేశాన్ని విశదం చేయడానికి, జరిగిన, జరగబోయే విషయాలను సూచించడానికి చక్కని వర్ణనలు చేస్తాడు రావిశాస్త్రి. చాలా కథల్లోను, ప్రతి నవల లోను వర్ణనలు కనిపిస్తాయి. పాత్రల స్వరూప స్వభావాలకు సంబంధించిన వర్ణనలను ఇంతకుముందే చూశాం. ప్రకృతికి, ఒక సన్నివేశానికి సంబంధించిన వర్ణనలకు రెండు చిన్న ఉదాహరణలు చూద్దాం.

స్వచ్ఛమూ, నిర్మలమూ, అమాయకమూ అయిన ప్రకృతి వాతావరణంలో ఒక మనిషి దుర్మార్గాన్ని చూపించే సందర్భంలో 'అధికారి' అన్న కథలో ప్రకృతిని గ్రామీణ వాతావరణాన్ని వర్ణిస్తున్న పద్ధతి ఇది. స్వచ్ఛమైన ప్రకృతి మధ్య మానవ కాలుష్యాన్ని గురించి చెప్పడానికి ఈ వర్ణనను ఉపయోగించుకున్నాడు రావిశాస్త్రి.

"కైట కనుచూపు మేరలో అంతా పచ్చపచ్చగా, ఎర్ర ఎర్రగా కనిపిస్తోంది. గాలి మందమందంగా వీస్తోంది. దుమ్మెక్కడా లేకపోవడంచేత వడబోసినట్టుగా ఎండ శుభ్రంగా ఉంది. రాజుగారి లోగిట్లో సిమెంటు గచ్చులా ఆకాశం చక్కగా, సాపుగా మెరుస్తోంది. దూరాన్న ఉన్న కొండల గుంపులు ఘనీభవించిన మబ్బుల్లా కనిపిస్తు న్నాయి. నీట్లో చేపల గుంపులా ఆకాశంలో కొంగల బారొకటి గీతగీసుకొని

గిడిమీద పోతున్నట్టుగా నిదానంగా పోతోంది. కాలవకవతలివైపున మామిడి తోటల్లో చిలకలు చేసే అల్లరి కలకల వినిపిస్తోంది. దూరాన రామినాయిడి పొలంలో కుప్పమీదికి చేనుకట్టలు ఎగురుతున్నాయి. కుప్పమీద కుర్రాడొకడు ఎగిరిగెంతి తలపాగా ఊడిపోగా కేకలేసి సర్దుకుంటున్నాడు. ఎక్కడో ఆడంగులు పాడేపాట గాలికి కెరటాలు కెరటాలుగా వినవస్తోంది. అల్లంత దూరంలో గట్టంట ఓ పదేళ్ల పిల్ల కుడిచేతిని చక్రంగా తిప్పుకుంటూ చెంగు చెంగున పరిగెడుతోంది. కళ్లంలో కమ్మల సాలలో కూర్చొని చూస్తే అంతా స్వచ్ఛంగా, సుందరంగా, నిజంగా దేముడు సృష్టించినట్టుగానే ఉంది. పచ్చగా, ఆకుపచ్చగా, నీలంగా, నిర్మలంగా లోకంలో పాపం అంటూ ఎక్కడా లేనట్టుగా ఉంది".

'అల్పజీవి' నవలలో పరిసరాల్ని వర్ణించే తీరు ఇలా ఉంటుంది.

"స్టూడెంట్స్ గుంపులు గుంపులుగా నడుస్తున్నారు. స్టూడెంట్స్ కానివాళ్లు కూడా గుంపులు గుంపులుగా నడుస్తున్నారు. షాపుల్లో దీపాలు వెలుగుతున్నాయి. 'ఫలానా నెంబరు బీడీనే వాడండి' అని కేకలు వేస్తూ పద్దెనిమిది మంది చిన్నా, పెద్దా ప్రొసెషన్‌లా వెళ్తున్నారు. కళ్లలో కామం పెట్టుకున్నవాడు ఒకడు సానివీధి ఎక్కడుందో ఎరక్క ఎవర్నీ అడగలేక బాధపడు తున్నాడు. 'ధర్మాసుపత్రికి దారేదీ!' అని ఒక నాటురకం ఒరియావాణ్ణి ఒక నాటురకం తెలుగువాడు అడిగాడు... రిక్షా అవసరం లేని ఒక పడుచు ప్లీడరు రిక్షాలో వెడుతున్నాడు. రిక్షా అవసరమున్న ఒక ముసలి ప్లీడరు కాలినడకన నడక సాగిస్తున్నాడు. తనవేపు వస్తున్న కాబూలీవాలాను తప్పించుకోటానికి, జేబుల్లో డబ్బులు లేని ఒక ఆసామీ దగ్గరున్న కాఫీహోటలులో దూరాడు. మఫ్టీలో ఉన్న ఒక సర్కిల్ ఇన్‌స్పెక్టర్ కాలుజారి కిందబడితే, కిళ్లీ దుకాణదారు మొదలుకొని అందరూ నవ్వారు. అతను సర్కిల్ ఇన్‌స్పెక్టర్ అని తెలిశాక, అందరూ ఏమీ చూడనట్టు నటించారు."

'అధికారి' కథలో మబ్బుపట్టి, పోయిన చంద్రుణ్ణి వర్ణించిన పద్ధతి వర్ణనలకే అలంకారం.

"చంద్రుడు బూజుపట్టిపోయి వేలాడుతున్నాడు. వెన్నెలంతా పాలిపోయి బూడిదలా ఉంది. చెట్లన్నీ జీవచ్ఛవాల్లాగా, పైనున్న చుక్కలన్నీ చావబోయేవాళ్ల ప్రాణాల్లాగా వున్నాయి. మరి గాలి బిగుసుకుపోయి చచ్చేపోయింది.

చంద్రుడికి బూజులుపోవడంతో వెన్నెలకి తేటొచ్చింది. గాలికి చలనం, చెట్లకి చైతన్యం, చుక్కలకి ప్రాణాలు ఒచ్చాయి. (అదంతా ఎలా వున్నా పున్నమినాటి రేయిలా వుండడం మూకరాజు పనివాడితనం)"

## ఉపమానాలు

రావిశాస్త్రి రచనలలో కనిపించే ఉపమానాల వైవిధ్యం కూడా బహుశా ఏ ఆధునిక రచయితలోను, అందులోనూ వచనరచయితలలో కనిపించదేమో. ప్రకృతిని మనిషితో, మనిషిని ప్రకృతితో, మూర్తాన్ని అమూర్తంతో, అమూర్తాన్ని మూర్తంతో, ఒక క్రియను మరో క్రియతో, ఒక అనుభవాన్ని మరో అనుభవంతో ఇలా ఈ భౌతిక ప్రపంచంలో, మానవ సమాజంలో ఎన్నిరకాల ఉపమానాలు సాధించవచ్చునో అన్ని రకాలను రావిశాస్త్రి సాధించాడు. రాజకీయాల నుంచి, రాజ్యాంగయంత్రం నుంచి ఉపమానాలను ఎన్నుకోవడం రావిశాస్త్రి ప్రత్యేకత. దేశాలు, జాతులు, చారిత్రిక సన్నివేశాలు, పౌరాణిక పాత్రలు స్వభావవర్ణనలో, స్వరూపవర్ణనలో ఉపమానాలుగా ప్రతిభావంతంగా వాడుకున్నాడు రావిశాస్త్రి. ఇతిహాస పురాణాలపైన, చరిత్రపైన పూర్తి అధికారం ఉన్నవారు తప్ప ఈ విధంగా సందర్భానికి తగ్గ ఉపమానాలను వాడలేరు. రావిశాస్త్రి కేవలం అలంకారం కోసం మాత్రమే ఉపమానాలు వాడడు. ఒక సన్నివేశాన్ని, ఒక సంఘటనను, ఒక పాత్ర స్వభావాన్ని, స్వరూపాన్ని, ఒక భావాన్ని, ఒక ఆలోచనను, ఒక చర్యను మరింత స్పష్టం చేయడానికి ఉపమానాలనువాడుకున్నాడాయన. (భద్రిరాజు కృష్ణమూర్తి గారు 'రాచకొండ రచనల్లో సిమిలీ' అన్న వ్యాసంలో రావిశాస్త్రి ఉపమానాలను గురించి వివరంగా చర్చించారు.)

చంద్రుడు అప్పనంగా తిని బలిసిన దత్తపుత్రుల్లా వెలగడం, సూర్యుడు సెలవు రోజున స్టూడెంటు కుర్రాళ్లా లోకంమీద పడడం, బోడికొండలు బ్యాంకుల నిండా డబ్బు దాచుకున్న షావుకార్లలా నిశ్చింతగా నిద్రపోవడం వంటి ఉపమానాలను రావిశాస్త్రి మాత్రమే వాడగలడు. సందులో మున్సిపల్ దీపాలను ముష్టివాళ్ల కళ్లతో పోల్చడం దీపాలిచ్చే కాంతి స్థాయిని తెలుపుతాయి. రాత్రంతా వృత్తిలో నలిగిపోయి పోలీసులకు చిక్కి కోర్టులో ఓ మూల నిలుచున్న వేశ్య 'మూడో తరగతి రైలు పెట్టెలో ఓ మూల నలిగి వాడిపోయిన పువ్వులదండ'లా ఉందన్న ఉపమానం ఆమె శారీరక స్థితిని, దైన్యాన్ని దృశ్యమానం చేస్తుంది.

'మూడు కథల బంగారం'లో ఊళ్లో కొత్తగా వేంకటేశ్వరస్వామి దేవాలయం కట్టిన తరవాత భక్తులందరూ అటువైపే తరలడంవల్ల అంతవరకూ వెలిగిపోయిన రాముడిగుడి వెలవెలపోయింది. పెట్టుబడిదారీ విధానం ప్రవేశించిన తరువాత భూస్వామ్య విధానం వెనక్కిపోవటాన్ని సారాంశంగా చెప్పదలిచాడు రావిశాస్త్రి. వేంకటేశ్వరుణ్ణి షావుకారుతోను, రాముణ్ణి మొఖాసాలు కోల్పోయిన మొఖాసా దారుతోను పోలుస్తున్నాడు.

"వేంకటేశ్వరస్వామి పంచదార మిల్లు ప్రెసిడెంటులాగా, మాంగనీసు వ్యాపారం

చేసే మార్వాడీ షావుకార్లాగా ధగధగలాడుతూ ఉంటే అన్ని మొఖాసాలు టపటపమాని వెళ్లిపోగా అంతా చెడిపోయిన పాతకాలపుమొఖాసాదార్లా రాములవారు వెలవెలబోతున్నారు."

అలాగే మరో సాంస్కృతిక విషయాలకు సంబంధించిన ఉపమానం -

"ఆకాశవాణిలో సంస్కృత వార్తల్లా పురోహితుడు ఏమేమో చెప్పుకు పోతున్నాడు"

ప్రపంచరాజకీయసంఘటనలు,జాతీయరాజకీయాలు, పాలనా యంత్రాంగం, పురాణాలు, చరిత్ర మొదలైనవాటి నుంచి ఉపమానాలు గ్రహించడం రావిశాస్త్రి ప్రత్యేకత. స్వభావాలను, పరిస్థితులను తెలియజేయడానికి వీటిని శక్తిమంతంగా వాడుకున్నాడాయన.

## ప్రపంచ రాజకీయాలు

"దక్షిణ అమెరికాలో అమెరికా రాయబారి మాటవంటిది ఇన్‌స్పెక్టరుగారి మాట"

"అంతా ఒకే జెయిల్లో ఉన్నప్పటికీ అమెరికాలో తెల్ల ఖైదీలు నల్ల ఖైదీలను చూసినట్టు సాటివారిని చూసి తాను అసహ్యించుకోవారంభించాడు"

"ముసోలినీగాడు అబిసీనియాని తినేసినట్టు పులి మిమ్మల్ని తినేస్తే"

"ఆయన (భగవంతుడి) దయ అమెరికాలో డబ్బులాంటిది. ఎంత ఇచ్చినా తరగదు".

"ఆ యెడ్డు సత్తరకాయగాడి సెంపమీద పేల్చినోడండి, జపానోడి సిటీమీద అమెరికావోడు ఏటంబాంబు పేల్చినట్టు పేల్చేడు"

## జాతీయ రాజకీయాలు

"నేనాయన్ని ఆ రోజుల్లో కాంగ్రెసువాళ్లు ఇంగ్లీసువాళ్లని చూచినట్టుగా చూడ్డం ప్రారంభించేను"

"నల్లవాళ్లని తెల్లవాడొకంతట వదలనట్టు దారిద్ర్యాన్ని ఈగలొదలవు"

## పాలనయంత్రాంగం

"ప్రజల్లో గవర్నమెంటు మీద కోపం వస్తే పోలీసువాళ్లని చితక్కొట్టినట్టు పులిమీద కోపంతో వాణ్ణి కొడ్దామనిపించింది"

"కమ్యూనిస్టుమీటింగుదగ్గర స్పెషల్‌బ్రాంచివాడునిల్చున్నట్టు నిల్చున్నాడతను"

"కలెక్టరుగారి బంట్రోతు దాశిల్దారి కచేరికి వెళ్లినట్టు నేను అతి దర్జాగా అన్నిచోట్లకీ గొర్రె పాసుమీద వెళ్లి గౌరవం పొందుతుండేవాడిని"

పురాణాలు

"ఆ నవ్వు అస్త్రాలొదిలేసి రథం దిగిన కర్ణుణ్ణి చూసి నవ్విన కృష్ణుడి నవ్వులాగా...., అతిచిన్న క్యూబాని చూసి ఉదజనిబాంబు నవ్విన వేళాకోళం నవ్వులాగ ఉంది". రెండవ ఉపమానం అంతర్జాతీయ రాజకీయాలలోకి వస్తుంది.

చరిత్ర

"క్రికెట్‌వారు పెట్రీషియన్లు, ఫుట్‌బాల్‌వారు ప్లిబియన్లు"

డాక్టరు.... "ఎలాగూ తప్పించుకోలేని చందనదాసుని చాణుక్యుడు చూసినట్టుగా కథకుణ్ణి చూసి....."

రావిశాస్త్రి ఉపమానాలను కొన్ని విభాగాలలోకి కుదించడం కష్టమే. ఆయన ఉపమానాలనుగురించి ప్రత్యేకంగా అధ్యయనం చేస్తేనేకాని వాటిని వర్గీకరించడం సాధ్యం కాదు. వ్యాఖ్యానాలతో, వర్ణనలతో, ఉపమానాల పరంపరతో హోరెత్తించి పాఠకుణ్ణి ఉక్కిరిబిక్కిరి చేయడం రావిశాస్త్రి శైలి లక్షణం. ఇంతకుముందు ఉదహరించిన వర్ణనలు, పాత్ర వర్ణనలలో కూడా ఉపమానాలను వరుసగా గుప్పించడం చూడవచ్చు.

## ఉక్తులు, చమత్కారాలు

రావిశాస్త్రిరచనలలో జీవిత వాస్తవానికి సంబంధించి తన అనుభవంలోకి వచ్చిన విషయాలను సూత్రీకరించే పద్ధతిలో ఉక్తులు విరివిగా కనిపిస్తాయి. అలాగే ఒక విషయాన్ని చెప్పే పద్ధతిలో చమత్కారం కనిపిస్తుంది. ఇవికూడా రావిశాస్త్రి రచనా శిల్పంలో ప్రధానాంశాలు. ఒక విషయాన్ని వర్ణించి, వివరించి, చిత్రించి చివర ఆ విషయానికి సంబంధించి ఒక వ్యాఖ్య చేస్తాడు. దాన్నే ఉక్తి అనవచ్చు. వీటిలో అనుకూల, వ్యతిరేక విషయాలు రెండూ ఉన్నాయి. వ్యతిరేకాంశాలను చెప్పడంలో వ్యంగ్యం ఉంది.

ఉక్తులు

"చేతిలో పవరుంటే నెత్తికి పొగరెక్కుతుంది"

"మోడ్రన్ సొసైటీలో స్టేటస్‌కీ సక్సెస్‌కీ ఆధారం డబ్బు డబ్బు డబ్బు. డబ్బే ఆధారం"

"గవర్నమెంటంటే మనకు పోలీసోడు"

"పెట్రోలుకి నిప్పంటించినట్టు జనానికి భయం అంటుకుందంటే అది భగ్గున మండి అందర్నీ చుట్టబెడుతుంది"

"ఈ సంఘానికి డబ్బే మూలస్తంభం అనీ, అమ్మడం కొనడమే వీని మూల సూత్రమనీ, దోపిడీలే ఇందులో పెద్దల జీవనాధారమనీ, నోరులేని వాళ్ల నెత్తురు పీల్చడమే ఇందులో న్యాయం ధర్మం అనీ రత్తాలికి తెలియదు.

"ఆదిశంకరుడు వెర్రివాడు కాదు. జ్ఞానం ప్రధానం అన్నాడాయన. జ్ఞానోదయం అయితేనేగాని మోసేవారు తిరగబడరు. వారు తిరగబడితేనేగాని పల్లకీ మోసాలు తిరగబడవు"

"గాంధీగారితో పేచీ వస్తే మనం సత్యాగ్రహం చేస్తూ కూర్చోవచ్చు. అమెరికావాడితో పేచీ వస్తే మాత్రం అలా కుదరదు"

"మహిలో మనిషి బాధకి మీటర్లు లేవు. ఎంత గొప్ప శాస్త్రజ్ఞుడైనాసరే బాధని కొలవలేడు. బాధామీటర్లు లేకపోవడంతో వేదాంతుల పని చాలా సులభం అయిపోయింది"

"అనాదినించీ ఆస్తికోసం ఆడదాని కోసం యుద్ధాలు జరుగుతూ వస్తున్నాయని విజ్ఞులు చెప్తారు. మరింక ఆడదే ఆస్తి అయినప్పుడు చెప్పేదేముంది"

"మనుషులకుందేమోగాని ఆ వూరి ఇళ్లకి మాత్రం అంటరానితనం లేదు".

"అంటరానితనం జాతికి మచ్చ

అది నిప్పుకి లేదు"

ఒక పేటలో ఇళ్లు కాలిపోవడాన్ని వర్ణిస్తూ చెప్పినమాటలివి.

"మనల్ని ఇలా ఉంచినవాడు దేవుడే అయితే వాడు దేవుడు కాడు. మనల్ని ఇలా ఉంచినవాళ్లు మనుషులైతే వాళ్లు మనుషులు కారు. మాకు ఈ చావే చాల్నని ఇలా ఉండిపోతే మనం పశువులం కూడా కాము"

"మంచీ చెడ్డా, పాపం పుణ్యం లేవు గురువుగారూ! లాభం నష్టం రెండే ఉన్నాయిప్పుడు"

"బాగ్గెమంతుడి పల్లకి బగుమంతుడు మోస్తాడు"

## చమత్కారాలు

ఒక విషయాన్ని సూటిగాకాక చమత్కారంగా చెప్పడం రావిశాస్త్రిలో ఉండే ప్రత్యేక లక్షణం. స్వరూప, స్వభావ వర్ణనలకి ఈ పద్ధతిని ఆయన చక్కగా వినియోగించు కున్నాడు. చెప్పవలసిన విషయాన్ని వ్యంగ్యంగా చెప్పడం కూడా ఇక్కడ కనిపిస్తుంది.

"అవసరాల కోసం రాజులు భగవంతుణ్ణి ప్రార్థిస్తారు. ఆ భగవంతుడు ఆ అవసరాలన్నింటికీ వారికి ప్రజల్నే చూపిస్తాడు."

రాజులు అవసరం వచ్చినప్పుడల్లా పన్నులు పెంచుతూ పోవడాన్ని చెప్పిన విధానం.

"కామయ్యని కాలితో పొడిచిందావిడ. కొమ్ముల్లేవు. మరింతకంటే ఏం చేస్తుంది"

"అయితే సినిమా గేటు ఈవలకీ ఆవలకీ తేడా రెండణాలు"

"ఆవిణ్ణి కుడితే తేలు చస్తుందట, పాము పళ్లూడిపోయి చతికిలబడి పోతుందట"

"తోటమాలినీ, మోటారుకారునీ, చావునీ తప్పించుకున్న నల్లమేక ఎక్కడో బలుసాకు తింటోంది"

బతికుంటే బలుసాకైనా తిని బతకొచ్చు అన్న సామెత ఆధారంగా అన్నిటినీ తప్పించుకున్న నల్లమేక బతికే ఉందని చెప్పడానికి బలుసాకు తింటోంది అని అంటాడు.

"ఆమెని నూతిలోంచి తీయగలిగేంకాని ఆమెకి ఊపిరి మాత్రం పోయలేకపోయేం"

"ఇంట్లో బాత్‌రూంకి వెళ్లాలంటే కార్లోనో, ప్లేన్లోనో వెళ్లగల తాహతుందతనికి"

"హై సొసైటీలో తిరిగినప్పుడు తాక్కపోతే ప్రమాదం అని తెలుసుకోగలిగిన చదువుకున్న పెళ్లాం ఉందతనికి"

"అతను నల్లగా చాలా నల్లగా పది పెట్రోమాక్సులైట్లని ఒక్కసారిగా తన నలుపుతో ఆర్పేయగలిగినట్టున్నాడు"

"చిట్ట చివరకు ఆవిడ తన కొడుకు కోడళ్లకి ప్రేమాభిమానాలూ, కూతురుకి అల్లుడికీ వెండి బంగారాలూ విడిచేసి కన్నుమూసింది ("చూసేవురా! మా అత్త ఎంత పనిచేసిందో" అని నేనొక ఆయన్తో చెప్తే అతను ఏం! వెండి బంగారాలు

ప్రేమాభిమానాలకంటే ఎక్కువ కాదు కదా?" అని చమత్కరించేడు)"

"ఏనాడో ఎప్పుడో చావకుండా కాంతమ్మ ఈనాటికీ ఇంకా మిగిలి ఉందంటే అందుకు పన్నెండేళ్ల కారణం ఆవిడ పెద్దకొడుకు, పదేళ్ల కారణం చిన్నకొడుకు".

"అందుకు వాణ్ణి చంపి మళ్లీ బతికించి మళ్లీ చంపుదాం అన్నంత కోపం వచ్చింది నాకు"

వ్యాకరణంతో చమత్కారాలు సాధించడం రావిశాస్త్రిలో కనిపించే మరోగుణం. నేను నాది అనే స్వార్థం గురించి చెప్తున్న మాటలివి.

" 'నేను' అనే పదం యొక్క అన్ని విభక్తులతోనూ నిండిన లోకంలో 'పద్దం' చేత కలిగే నొప్పికి కారణం స్పష్టంగా కనిపిస్తున్నా యెవ్వరికీ తెలియనట్టే అతనిక్కూడా తెలియదు"

మనుష్యులకీ, మనుష్యేతరాలకి ప్రథమ పురుష బహువచనంలో వాడే క్రియలు భిన్నంగా ఉంటాయి. ఈ అంశంపైన ఒక చమత్కారాన్ని సాధించాడు రావిశాస్త్రి.

"ఆ పాత్ర చూసేసరికి కామయ్యకి తన పుత్ర, పుత్రికా రత్నాలు ('జ్ఞప్తికి వచ్చేరు అనాలా?' 'జ్ఞప్తికి వచ్చేయి' అనాలా? ఎందుకీ గొడవ?) జ్ఞప్తికి రావడం జరిగింది!"

అలాగే

"జడ్జీలకి మరింక ఏయే వీక్నెసులుంటాయో 'బ'కార 'భ'కారాలకే తెలుస్తుంది. అంటే బంట్రోతుకి, బెంచి గుమాస్తాకి, బడా లాయర్‌కి, ఆ తరువాత ఆ భగవంతుడికే తెలియాలి "

'రొట్టెముక్క'లో యువక లీడరు మాట్లాడే భాషను వర్ణించిన తీరు.

"అతను 'గ్రామ్యం' 'శిష్ట వ్యావహారికం' రెండూ జోడించి మాంసానికి మసలా కలిపి వేసినట్టు మాటాడుతూ ఉంటాడు"

భాష-శైలి

రావిశాస్త్రి భాష, శైలి ఆయనకు మాత్రమే ప్రత్యేకమైనవి. భాషమీద పూర్తిగా అధికారం ఉన్నవాళ్లకే ఆయన శైలిలాంటి శైలి సాధ్యమవుతుంది. ఆయన రచనలలో భిన్నతరహాలకు చెందిన వ్యక్తుల స్వభావాలు, వారు మాట్లాడే తీరు వాస్తవానికి దగ్గరగా ఉంటాయి. ఆయన పాత్రలు సజీవభాష మాట్లాడే సజీవ పాత్రలు. విశాఖపట్టణం మాండలికాన్ని పాత్రల సంభాషణల ద్వారా రచనల్లో

ప్రవేశపెట్టి వేరే ప్రాంతం వాళ్లకి ఆయన పరిచయం చేశాడు. వేరే ప్రాంతానికి సంబంధించిన ఒక వ్యక్తి విశాఖపట్టణంలో జనం మాట్లాడే తీరుని చూసి వాళ్లందరూ రావిశాస్త్రి రచనలు చదివినవాళ్లేమో అనుకున్నాడని ఒక విమర్శకుడు చమత్కరించాడు. తన ఆరాధ్యరచయితలు గురజాడను, శ్రీశ్రీని వ్యాసాల్లోనే కాక, సృజనాత్మక రచనల్లో కూడా ఉటంకించడం, కొన్నిచోట్ల అవి అతని రచనా శైలిలో భాగం అయిపోవడం కూడా గమనించవలసి ఉంది.

వాక్యాన్ని ఎన్నిరకాలుగా ఆడించవచ్చునో అన్ని రకాలుగా ఆడించగలిగినవాడు రావిశాస్త్రి. రొట్టె కోసం తడిపిన పిండిలాగ ఎలాగపడితే అలాగ సాగుతాయి ఆయన వాక్యాలు. ఒక విషయంలోని క్లిష్టతను వెల్లడించవలసి వచ్చినప్పుడు వాక్యాలను కూడా అలాగే ప్రయోగిస్తాడు. విషయంలోని తీవ్రతను చెప్పేటప్పుడు తీవ్రత, గాఢతను వర్ణించేటప్పుడు గాఢత ఆయన శైలిలో ప్రత్యక్షమవుతాయి. ఒక విషయంలోని తికమకను తెలియజేయవలసి వచ్చినప్పుడు తికమక అనుభవానికి వచ్చే పద్ధతిల్తో వాక్యాన్ని కూరుస్తాడు.

'మాయ' కథలో ముత్యాలమ్మపైన లేని సారా కేసు పెట్టారు. కోర్టులో ఆ కేసు లేదని నిరూపించేట్టు చేశారు కేసు పెట్టినవాళ్లే. యువలాయర్‌కి ఇదంతా మాయగా అనిపించింది.

"సారా, అసలుకి దొరకలేదు. దొరికిందని కేసు పెట్టారు. దొరకలేదని తిరిగి తేలగొట్టేశారు. విషయం జరగలేదు. జరగని విషయం జరిగిందన్నారు. జరిగినదని చెప్పబడిన జరగని విషయం జరగలేదన్నారు. లేదు ఉంది లేదు. అంతా మాయచేశారు."

'తలుపుగొళ్లెం' కథలో పైడ్రాజు తనను పెంచిన దొంగ బిచ్చగాళ్ల దంపతులతో తిరిగి ఎన్నో అనుభవాలు తెచ్చుకున్నాడు. దొంగతనం చేస్తుండగా పట్టుబడిన పెంచిన తల్లి జనం దెబ్బలకి చనిపోతుంది. పెంచిన తండ్రి తాను చేయని ఖూనీ కేసులో ఇరుక్కుంటాడు. విచారణ సందర్భంగా కోర్టులు, ప్లీడర్లు, ఉన్నవాళ్లు మొదలైన వాతావరణం చూశాడు. పైకి రావాలంటే అన్యాయ, అధర్మ మార్గాలే శరణ్యమని తీవ్రంగా నిశ్చయించుకున్నాడు. ఆ తరువాత పైడ్రాజు ఆ మార్గంలో వెళ్లి చాలా పెద్దవాడవుతాడు. పైడ్రాజులోని తీవ్రమైన ఆకాంక్షను రావిశాస్త్రి ఇలా వర్ణిస్తాడు.

"పోలీసులు, ప్లీడర్లు, కోర్టులు, జెయిళ్లు, షావుకార్లు, వాళ్ల మేడలు, వాళ్లకార్లు, వాళ్లవాళ్ల గజలక్ష్ములు, వాళ్ల ప్రమాణాలు, వాళ్ల ధైర్యాలు, వాళ్ల సాహసాలు, వాళ్ల భయాలు, వాళ్ల శత్రుత్వాలు, వాళ్లపెట్టెలు, వాళ్లనోట్లు, వాళ్ల మాయలు, వాళ్ల దొంగతనాలు..... అవన్నీ సూచించే దృశ్యాలు కూడా కళ్లముందు ఆడాయి.

చిన్నాపెద్దా తేడా తప్ప ఆ రెండు జీవితాలకీ ఆట్టే తేడా కనిపించలేదు పైడ్రాజుకి. దరిద్ర ప్రయాచకులూ, దరిద్రదొంగలూ ఉన్నట్టే గొప్పయాచకులూ, గొప్పదొంగలూ ఉంటారనిపించిందతనికి.

దోచుకు తినడం బెస్టు.

అనేటువంటి పరమ ఘోరమైన నిశ్చయానికి ఏ మానవు డైనా వచ్చి సాహసంతో రంగంలోకి ఉరికి, మెలకువతో వ్యవహరించి పట్టుదలతో పనిచేస్తే వాణ్ణి మరింక ఆపడం చాలా కష్టం"

ఒక అంశానికి సంబంధించిన స్వభావాన్ని, లక్షణాన్ని పాఠకుడి మనసులో గాఢంగా హత్తుకునేట్టు చెప్పాలనుకున్నప్పుడు ఆ అంశానికి సంబంధించిన వివిధ కోణాలను వివరిస్తూ గాఢమైన శైలితో రాస్తాడు రావిశాస్త్రి. 'అధికారి' కథలో అధికారానికి ఉండే వివిధ కోణాలను ఇలా వర్ణిస్తాడు.

"...... అధికార్లకి కత్తులుంటాయనిగాని, అవి రెండు వేపులా పదునుగా ఉంటాయనిగాని వాళ్లకి తెలీదు. కోటీశ్వరన్‌గారు నీ కంటపడకుండా నిన్ను గుమ్మం లోంచి తరిమికొట్టగలడు. లేకపోతే, నీ చేతిలో పది రూపాయలు పెట్టి నీ చేత కాళ్లు పట్టించుకోనూగలడు. మంత్రిపుంగవుడు నిన్ను కొమ్ముల్తో పొడవగలడు, కాకపోతే, పాలకుల ప్రతినిధి కాబట్టి నీకు పాలిప్పించి సాకనూగలడు. న్యాయాధిపతి నీ మీద వచ్చిన సాక్ష్యాన్ని నమ్మనూగలడు. నమ్మకపోనూగలడు. రక్షక భటుడు నీ మీద లేని నేరాన్ని సృష్టించనూగలడు, ఉన్న నేరాన్ని మాఫీ చేయనూగలడు. పక్కసందులోంచి గూండా నీ ఇంటి మీద రాళ్లు రువ్వించనూగలడు, రువ్వినవాణ్ణి తిప్పి కొట్టనూ గలడు. వాళ్ళందరూ కూడా నిన్ను తహతహ లాడించ గలరు. లేకపోతే మేల్ మేలని నీచేత చేయెత్తి దండాలు పెట్టించుకోనూగలరు"

దేవుడు ఉన్నాడు, లేడు వీటిని నిరూపించడంలోని తికమకని తికమకగానే వర్ణించి చూపిస్తాడు రావిశాస్త్రి.

"భగవంతుడు ఉన్నాడో లేడో చెప్పడము కష్టం. ఉంటే, ఉన్నాడని చెప్పడము కష్టం. లేకపోతే, లేడనడానికి కారణాలు చెప్పడం కష్టం. ఉంటే, ఎందుకున్నాడో చెప్పడం కష్టం. లేకపోతే ఎందుకు లేడో చెప్పడం కష్టం. నిజంగా ఉన్నట్లయితే పూర్వకాలంలో ఎవర్నెందుకు రక్షించినా, శిక్షించినా ఈ కాలంలో ఎవరినెందుకు పోషిస్తాడో, ఎవరినెందుకు నాశనం చేస్తాడో చెప్పడం చాలా కష్టం. దేవుడు లేనట్లయితే ఎన్నో విషయాలకి కారణాలు చెప్పడం ఎంత కష్టమో, దేవుడు ఉన్నట్లయితే ఎన్నో జరిగే విషయాలకి కారణాలు చెప్పడం కూడా అంతే కష్టం."

## దేవుడు - పులి

రావిశాస్త్రి రచనల్లో పునరావృతం అయ్యే అంశాలు చాలా కన్పిస్తాయి. కోర్టులు, కేసులు, సాక్ష్యాలు, ప్లీడర్లు, జడ్జీలు, వాదనలు, అధికారులు అన్నిటినీ మించి పోలీసులు చాలా కథల్లో, అంతకుమించి నవలల్లో పునరావృతంగా కనిపించే అంశాలు. ఇది రావిశాస్త్రి చుట్టూ ఉన్న ప్రపంచం. చూసిన ప్రపంచం, అనుభవించిన ప్రపంచం. సంక్లిష్ట స్వభావంతో పెరిగి విస్తరిస్తున్న నేర ప్రపంచం. ఆ ప్రపంచంలో భిన్నతరహా వ్యక్తులు, వాళ్ల సంక్లిష్ట జీవితాలు. కొన్ని అంశాలు పునరావృతం అవుతున్నట్టు కనిపించినా రావిశాస్త్రి రచనల్లో వైవిధ్యానికి కారణం ఈ జీవితాల్లో ఉండే వైవిధ్యమే.

రావిశాస్త్రి ఎంత అద్భుతమైన రచనా శిల్పంతో రచనలు చేసినా సాహిత్యం ఎందుకు? ఏ ప్రయోజనం కోసం? అన్న ప్రశ్నలకు ఆయన సమాధానాలు చాలా మామూలుగా, సరళంగా ఉంటాయి. ఈ ప్రశ్నలన్నిటికి సమాధానం ఒకటే మంచి, చెడు. ప్రకృతిలో, జంతువుల్లో కొన్ని మంచికి ప్రతీకలు, కొన్ని చెడుకి ప్రతీకలు. కొన్ని పీడకులకు, కొన్ని పీడితులకి గుర్తులు. దేవుడు (రావిశాస్త్రి రాతలో 'దేముడు') పునరావృతంగా కనిపించే మరొక అంశం. రావిశాస్త్రి రచనల్లో ఏదో ఒక సందర్భంలో దేవుడి ప్రసక్తి వస్తూ ఉంటుంది. అలాగే పులి, మేక లేక గోవు.

రావిశాస్త్రి రచనల్లో దేవుడు, దైవం అన్నభావనకు ఆస్తికత్వంతో, నాస్తికత్వంతో సంబంధం లేదు. మంచి చెడులను గురించి వివరించడానికి దేవుడు అన్న భావం ఒక ఆలంబనం. రావిశాస్త్రి దృష్టిలో దేవుడు ఉన్నాడా లేడా అన్నది ప్రధాన విషయంకాదు. దేవుడంటూ ఉంటే మంచి చెడుల విషయంలో అతని పాత్ర ఏమిటనేది ఆయన సందేహం. పేదల కష్టాలు, దుఃఖాలు అలాగే ఉన్నాయి. నిజంగా అతడు ఉంటే పేదవాడికి, కష్టాల్లో ఉన్నవారికి ఎందుకు సహాయం చేయడు? అనేది ఆయన ప్రశ్న. ఈ విషయం చర్చ రూపంలోనో, వ్యాఖ్యానాల రూపంలోనో, సంభాషణల రూపంలోనో రావిశాస్త్రి రచనల్లో కనిపిస్తూ ఉంటుంది. దేవుడే ఉంటే చెడు, పీడన, దుర్మార్గం ఎందుకు పెరిగిపోతున్నాయి? అనేది మరొక ప్రశ్న?. పెద్దవారికి, ఉన్నవారికి దుర్మార్గులకి దైవం అన్న భావన ఉపయోగిస్తున్నదన్న అంశాన్ని ఆయన చాలాచోట్ల చెప్తాడు. 'రాజు-మహిషి' నవలలో భీమసేనరావు వ్యక్తిత్వాన్ని ఇలా వర్ణిస్తాడు రావిశాస్త్రి. "తన లాభానికి దైవాన్ని ఎంతగానో ఉపయోగించుకోవచ్చుని, భీమసేనరావుగారు ఏనాడో గ్రహించేరు. అవతలివాణ్ణి అణచి పారేసి అది దైవ నిర్ణయమని, దైవ న్యాయమని సమర్థించడానికి దైవం దొరికినంత విలుగా మరేదీ లేదనే విషయం భీమసేనరావుగారు ఏనాడో గ్రహించారు."

పులి ప్రసక్తి కూడా రావిశాస్త్రి రచనలలో మాటిమాటికి వచ్చే మరొక అంశం. దౌష్ట్యానికి, క్రౌర్యానికి, దుర్మార్గానికి, అధికారానికి, చెడుకి పులి ప్రతీక. ఫుల్ పవర్‌ని పులిపవర్‌గా చమత్కరించడం ఆయన రచనల్లో విరివిగా కనిపిస్తుంది. ఫుల్‌పవర్లుగల పెద్దలు పులులుగా మారడానికి సరదాపడుతుంటారు ఎల్లప్పుడూ అనీ, సింహాసనాలమీద పులులు కూర్చుంటే గోవులకీ, గొర్రెలకి మరింక బతుకులుండవనీ రకరకాలుగా పులి స్వభావం మీద వ్యాఖ్యానాలు చేస్తాడు. పులి న్యాయం అన్నది ఆయన విరివిగావాడే మరోమాట. సినిమాలకు అక్షర జ్ఞానం లేని అమాయకులకు మార్గం చూపించగల శక్తి ఉందని, కాని మనదేశంలో సినీశక్తి పెద్దపులి శక్తిగా వుందిగాని పేదజనశక్తిగా లేదని అంటాడు రావిశాస్త్రి. అంటే ఇక్కడ చెడుకి పులిని ప్రతీకగా వాడుతున్నాడు. రాజయోగి పెదనాయనగారు నవ్వితే పులి నవ్వినట్టుగా ఉండేదంటాడు కిరీటిరావు 'గోవులొస్తున్నాయి జాగ్రత్త'లో.

'ది స్మోకింగ్ టైగర్ అను పులి పూజ' కథ పూర్తిగా పులి ప్రతీకగా నడుస్తుంది. బ్రిటిష్ సామ్రాజ్యవాదం పోయింది. అమెరికన్ సామ్రాజ్యవాదం వచ్చింది. బ్రిటిష్ వారి కాలంలో పెట్టింది గొర్రెమార్కు సిగరెట్ కంపెనీ. అమెరికన్ గుత్తాధిపత్యంలో బహుళజాతి కంపెనీగా వచ్చింది పులిమార్కు సిగరెట్ కంపెనీ. పులిమార్కు సిగరెట్ గొర్రెమార్కు సిగరెట్‌ని పూర్తిగా మింగేసింది. ప్రపంచంపైన, ప్రపంచ దేశాల ఆర్థిక వ్యవస్థలపైన అమెరికా గుత్తాధిపత్యానికి ఈ కథ చక్కని వ్యాఖ్యానం. కథలో ప్రధాన పాత్ర 'నేను' పులి మహిమపైన చేసిన ఈ వ్యాఖ్యానం స్థానికస్థాయినుంచి అంతర్జాతీయస్థాయిదాకా పులి(స్వభావం)ఆధిపత్యాన్ని స్పష్టం చేస్తుంది.

"మా కంపెనీ వాళ్లు కాణీ ఖరీదుగల సరకుని అణాకి అమ్మేవాళ్లు. పులిగాళ్లు దమ్మిడీ సరకుని అణాకి అమ్ముతూ మార్కెట్టంతా పులిమయం చేయగలగడం నాకు అన్యాయంగా తోచింది.

పులిదెబ్బ ఎంతటి దెబ్బో నాకపుడు తెలిసొచ్చింది.

పులిమహిమ ఎంతటి మహిమో నాకు భూపతిగాడివల్ల పూర్తిగా తెలిసొచ్చింది. పులిగురించి నేనప్పుడు తీవ్రంగా ఆలోచించి జీవితపు సత్యాలు కొన్ని తెలుసుకున్నాను. నరుల్లో వ్యాఘ్రాలు, పద్యాల్లో శార్దూలాలు, సిగరెట్లలో టైగర్లు ఎందుకుంటాయో నాకప్పుడర్థం అయింది. అరణ్యాల్లోనే కాకుండా మానవ సంఘాల్లో కూడా పెద్దపులి కొక విశిష్టమైన స్థానం ఉన్నదని నేను అనుభవం మీద తెలుసుకున్నాను."

రావిశాస్త్రి రచనల్లో బాధలు, కష్టాలు, పీడన మొదలైన వాటిని చిత్రించే

సందర్భాలలో దేవుడి ప్రసక్తి వస్తుంది. ఆ ప్రసక్తి సాధారణంగా ప్రార్థించే రూపంలో కాక ఎక్కువగా ప్రశ్నించే రూపంలో కనిపిస్తుంది. ఇందులో వేదన వ్యక్తం అవుతుంది. అలాగే ఉన్నవారు, దురహంకారులు దైవం అన్న భావనని తమకి అనుకూలంగా ఎలా వాడుకుంటారో చెప్పవలసిన చోట్ల కూడా దేవుడి ప్రసక్తి వస్తుంది. ఇది ఆయన రచనా శిల్పంలో భాగం కూడా. దేవుడు అన్న భావన విషయంలో రావిశాస్త్రి మనస్తత్వాన్ని కూడా ఈ చిత్రణలు తెలియ జేస్తాయి. అధికారం,అణచివేత,పీడన,ద్వేషం,దౌష్ట్యం మొదలైన వాటి విషయం లో ఆయనకుండే నిరసన భావం,అసహ్యం వాటిని పులి ప్రతీకతో చిత్రించ డంలో వ్యక్తం అవుతుంది.

## చురకలు - ఛలోక్తులు

మాటకి మాట అంటించడంలో,ఛలోక్తులు విసరడంలో కూడా రావిశాస్త్రి దిట్ట. రావిశాస్త్రే స్వయంగా చెప్పుకున్న మాటలలో

" నా గుండెల మీద కూర్చున్న పెద్ద పులి మనసు మార్చుకొని,సన్యాసం పుచ్చుకుని,కమండలం పట్టుకుని తావళం తిప్పుకొని వాయు భక్షణ చేసుకుంటూ హరినామ సంకీర్తనలో కాలం గడుపుకుంటే దానికీ,నాకూ పేచీ లేదు. దిక్కుపోతేనే పేచీ.

ఇది చదివిన నా స్నేహితులు ఒకాయన చిరునవ్వు నవ్వి, మీ గుండెల మీ ద కూర్చున్నది పెద్దపులి కాబట్టి మారదు. కాని ఆ కూర్చున్నది మనిషైతే మారొచ్చు కదా? అన్నారు. అప్పుడు నా వంతు ప్రకారం చిరునవ్వు నవ్వి వాడే మనిషైతే అలా కూర్చునే కూర్చోడు కదా! అన్నాను"

* * * *

అప్పటికి రావిశాస్త్రి సిగరెట్ తాగడం మానేశాడు. ఒకాయన శాస్త్రికి సిగరెట్ ఆఫర్ చేస్తే 'నేను సిగరెట్ కాల్చను' అన్నాడు. ఆఫర్ చేసినాయన 'అయితే వచ్చే జన్మలో దున్నపోతువై పుడుతావన్న మాట' అన్నాడు. వెంటనే 'అయితే కిందటి జన్మలో నువ్వు తాగలేదన్న మాట' అని చురక అంటించాడు.

* * * *

శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంగా పానగల్లు హాలులో సాహిత్య గోష్ఠి జరిగింది. నిర్వాహకులలో ఒకరైన రావిశాస్త్రి ఆ రోజు వేదిక ఎక్కలేదు. జ్వాలాముఖి కాలో 'ఇదేమిట'ని ప్రశ్నిస్తే 'ఉస్తాద్ బడే గులాం అలీఖాన్లు వచ్చినప్పుడు లోకల్ టాలెంట్లు తగ్గాల'ని ఛలోక్తి విసిరాడు.

*  *  *  *

ఎమర్జెన్సీ కాలంలో రావిశాస్త్రి జైల్లో డిటెన్యూగా ఉన్నప్పుడు మామూలు ఖైదీ ఒకడు డిటెన్యూలందరూ మామూలు బట్టలు వేసుకోవడం,చదువుకుంటూ ఉండడం,మిగతా ఖైదీల్లాగా పనులు చేయకపోవడం చూసి 'డిటెన్యూ' అంటే 'కులాసా ఖైదీయా?' అని అడిగాడు. కులాసా ఖైదీ అన్న మాట రావిశాస్త్రికి నచ్చింది. 'అవునవును సుఖ వ్యాధుల్లో సుఖం లాంటిదే కులాసాఖైదీ కులాసా కూడా' అని చమత్కరించాడు.

*  *  *  *

రావిశాస్త్రికి తెలిసిన బస్ డ్రైవర్ ఒకతను తాగి బస్సు నడిపి ఏక్సిడెంట్ చేశాడు. మర్రోజు అదే డ్రైవర్ తాగి శాస్త్రికి కనిపించాడు. 'మరీ తాగకు. నిన్నే కదా ఏక్సిడెంట్ అయింది' అన్నాడు శాస్త్రి. పక్కనున్న మరో అతను అన్న మాటలివి. 'శాస్త్రిబాబు ఏం చెప్తున్నారో ఎరికా? పటాసు మీదుంటే బండెక్కకు' అని వివరించాడు.

*  *  *  *

ఒక మిత్రుడు 'మీరు రాసేది విప్లవానికి ఎలా ఉపయోగిస్తుంది?' అని అడిగాడు. దానికి రావిశాస్త్రి సమాధానం " యుద్ధకాలంలో అందరూ సైనికులై పోరు కదా! తమ తమ ఇళ్ళల్లోనే ఉండి కొందరు మేజోళ్ళు అల్లుతారు. కొందరు రక్తదానం చేస్తారు. నన్ను మేజోళ్ళు అల్లువానిగా భావించుకోవచ్చు."

# 10. రావిశాస్త్రి సారాంశం

తెలుగు సాహిత్యంలోనే కాదు, స్థూలంగా చెప్పాలంటే ఆధునిక భారతీయ సాహిత్యాలలోనే రావిశాస్త్రి విశిష్టమైన రచయిత. వస్తుపరంగా, రూపపరంగా కథారచనలో రావిశాస్త్రి సాధించిన విజయం అది. తాను చిత్రించిన జీవితంతో మమేకం కావడం, తాను చూసిన అధోజగత్తు విషయంలో తనకుండే ఆవేదన, దుర్మార్గం ,అన్యాయాలయెడ ఆయనకుండే ఆక్రోశం, సాహిత్యపరంగా ఆయన కుండే నిబద్ధత బలమైన శైలితో కూడిన భాషారూపంలో అనువాదం అయినాయి. ఆరుసారా కథలు, పిపీలికం, సృష్టిలో, తలుపు గొళ్లెం, రొట్టెముక్క, లక్ష్మి, 'మంచి' 'చెడ్డ'ల్లో ఏ కథ, షోకుపిల్లి-విశ్వసాహిత్యం లోనే గొప్ప కథలుగా చెప్పుకోదగ్గవి. రావిశాస్త్రిపాత్రలు, సంభాషణలు, పరిశీలనలు, వర్ణనలు, నిర్మాణం, కథోన్మీలనం, అభివ్యక్తీకరణ పద్ధతులు పాఠకుడిపైన చెరగని ముద్రవేస్తాయి. ఆయన నవలలలో అట్టడుగు జనాల విషాద, బీభత్సజీవితం అనేకకోణాలలో కనిపిస్తుంది. ధనస్వాముల అహంకారం, దుర్మార్గం విశ్వరూపంలో కనిపిస్తాయి. వీటిని అనేక విధాలుగా విస్తరించి చిత్రించడం వల్లనే కథలతో పోల్చినప్పుడు నవలలు కొంత అదుపు తప్పి నడచినట్టు కనిపిస్తాయి. మధ్యతరగతి ఆత్మవంచన, బలహీనత రావిశాస్త్రి కథలలో, నవలలలో కనిపించే మరో ప్రధాన వస్తువు. 'జీనియస్' అన్న పదానికి తెలుగు సాహిత్యరంగంలో అర్హుడైనవాడు రావిశాస్త్రి.

రావిశాస్త్రి మరణానికి పత్రికలు స్పందించిన తీరు తెలుగు సాహిత్యంలో ఆయన స్థానాన్ని చెప్తాయి. తెలుగు దినపత్రికలతోపాటు దాదాపు పత్రికలన్నీ సంపాదకీయాలు రాశాయి. సాహిత్య పత్రికలు ప్రత్యేక సంచికలు వేశాయి. రేడియో, టివీలు ప్రత్యేకకార్యక్రమాలను ప్రసారం చేశాయి. ఇంతవరకు సుమారు పదిదాకా రావిశాస్త్రి మీద సిద్ధాంత వ్యాసాలు వచ్చాయి.

## చదివిన పుస్తకాలు, పత్రికలు


1. నరసింహారావు, అత్తలూరి (సం.) 1982, జూలై 30.
(రావిశాస్త్రిగారికి పుట్టిన రోజు కానుక)

2. అనంతం(సం) 1982. రావిశాస్త్రీయం
(రాచకొండ విశ్వనాధశాస్త్రి వ్యాసాలు)

3. జ్యేష్ఠ లిటరరీ ట్రస్టు. 1994. నివాళి (రావిశాస్త్రికి నివాళి)

ఇంకా......

ప్రజాసాహితి (రావిశాస్త్రి సంచిక), డిసెంబర్ 1993.

అరుణతార (రావిశాస్త్రి ప్రత్యేక సంచిక), జనవరి 1994

'రచన' సంచికలు

'స్వాతి' సంచికలు

రావిశాస్త్రి గురించి మేధావులు, విమర్శకులు రాసిన వివిధ వ్యాసాలు

అచ్చైన రావిశాస్త్రి రచనలు.

## అనుబంధం

రావిశాస్త్రికి సంబంధించిన సిద్ధాంత వ్యాసాలు

ఎం.ఫిల్

| | | |
|---|---|---|
| కె.వీరయ్య | రావిశాస్త్రి కథలు | ఉస్మానియా విశ్వవిద్యాలయం |
| ఎం.మాధవరెడ్డి | రావిశాస్త్రి కథలు-ప్రభుత్వయంత్రాంగం | హైదరాబాద్ విశ్వవిద్యాలయం |
| ఎం.యాదయ్య | రావిశాస్త్రి బుక్కులు-ఒక విశ్లేషణ | కాకతీయ విశ్వవిద్యాలయం |
| జె.సుభద్ర | రావిశాస్త్రి నిజం-ఒక పరిశీలన | కాకతీయ విశ్వవిద్యాలయం |
| వి.ఝాన్సీ | రావిశాస్త్రి బుక్కులు-సామాన్య మానవుడు | కాకతీయ విశ్వవిద్యాలయం |

పిహెచ్.డి

| | | |
|---|---|---|
| తాటి కృష్ణ | రావిశాస్త్రి నవలానుశీలన | నాగార్జునవిశ్వవిద్యాలయం |
| పి.సుధారాణి | రావిశాస్త్రి కథలు-పరిశీలన | హైదరాబాద్ విశ్వవిద్యాలయం |
| ఎం.మాధవరెడ్డి | రావిశాస్త్రి నవలాప్రపంచం | హైదరాబాద్ విశ్వవిద్యాలయం |

రావిశాస్త్రిగా ప్రసిద్ధుడైన రాచకొండ విశ్వనాథశాస్త్రి (1922-93) తెలుగు అగ్ర శ్రేణి కథానికా రచయితలలో ఒకడు. ఆయన అరవై నాలుగుపైగా కథలు, ఎని మిది నవలలు, మూడు నాటకాలు రచించాడు గురజాడ అప్పారావు, శ్రీశ్రీల వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్న రావిశాస్త్రి వస్తు, శిల్పాలలో తెలుగు కల్పనా సాహిత్యాన్ని పెద్దమలుపు తిప్పాడు అధోజగత్తులోని జీవిత వైవిధ్యాన్ని అందు లోని సూక్ష్మాతి సూక్ష్మ విభాగాలను ఆయన వస్తువుగా గ్రహించాడు సమకాలీన సమాజపు చీకటి కోణాలలోపడి నలుగుతూ అంతవరకు గుర్తింపుకు రాని వారి జీవితాలు రావిశాస్త్రి కథలలో, నవలలలో కనిపిస్తాయి మధ్యతరగతి కుహనా స్వ భావం, ఆత్మవంచన, ప్రభుత్వ యంత్రాంగం, న్యాయస్థానాలు, భూకా మందులు, పైరవీ రాయుళ్లు, అవినీతితో, అధర్మంతో రాజకీయ పదవీ సోపానాల ధిరోహించేవాళ్లు,సంపన్న వర్గాలు, అధికారులు, ఈ సంక్లిష్ట సమాజంలో తమ జీవితం అలా ఎందుకు ఉందో తమకే తెలియకుండా బతికే బడుగుజనం, అలగా జనం రావిశాస్త్రి రచనలలో వస్తువులు అధోజగత్తు భాషను సరిగ్గా పట్టుకోగలిగినవాడు రావిశాస్త్రి. వస్తువులోనే కాదు శిల్పంలోను కొత్త పుంతలు తొక్కినవాడాయన వచనాన్ని కవిత్వంగా, కథనాన్ని కావ్యంగా మలచగలగడం రావిశాస్త్రికే చేతనవును కథ, సంవిధానం, పాత్రచిత్రణ - అన్నిటిలోను రావిశాస్త్రిది విశిష్టమైన మార్గం. ఆయన కథల్లోని శిల్పాన్ని, నగిషీని అనుసరించాలని ప్రయ త్నించి వైఫల్యం చెందిన రచయితలు అనేకులు తెలుగు కథకు అంతర్జాతీయ ప్రమాణాలను తీసుకొని వచ్చిన ఇద్దరు, ముగ్గురు రచయితలలో రావిశాస్త్రి ఒక డు. స్థానీయత ఆయన రచనల ప్రధాన స్వభావం వృత్తిపరంగా న్యాయవాది అయిన రావిశాస్త్రి సాహిత్యంలోను, వృత్తి జీవితంలోను పేదల పక్షానే నిలబడ్డాడు

రావిశాస్త్రి సాహిత్య వ్యక్తిత్వాన్ని మన ముందు ఉంచిన వారు ఆచార్య కె కె.రంగనాథాచార్యులు హైదరాబాద్ (కేంద్రీయ) విశ్వవిద్యాలయంలో భాషా, సాహిత్యాలను బోధిస్తున్నారు విమర్శకులుగా, చక్కని బోధకులుగా పరిచితులు సాహిత్య సామాజిక విమర్శ ఆయన ప్రత్యేకత తెలుగు సాహిత్యంలో అనేక పరి శోధనలకు రంగనాథాచార్యుల వ్యాసాలు ఆధార భూమికలు అయ్యాయి

Rachakonda Viswanatha Sastry (Telugu) Rs. 25/-

ISBN · 81-260-0939-X